శ్రీరస్తు

# శ్రీ వైశ్య పురాణము

పద్యకావ్యము.

భాస్కరాచార్య ప్రణీతము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1929.

శ్రీగణేశాయ నమః.

శ్రీశారదాంబాయై నమః.

# శ్రీవైశ్యపురాణము

## పీఠిక.



కంఠున్ జగదేకనాథు నభవున్ శీతాంశురేఖాధరున్
నాకౌకఃప్రవరార్చితాంఘ్రికమలున్ నానాగుణాధారు లీ
లాకైలాసనివాసు శైలతనయోల్లాసప్రదున్ భక్తర
క్షాకారుణ్యకటాక్షు శంకరు మహైశ్వర్యున్ బ్రశంసించెదన్. 1

ఉ. ఫాలవిలోచనాగ్నికణబంధురవైఖరిఁ జక్రరూపమై
వ్రాలిన [1]చాపమధ్యమున వర్తిలుచున్ బరివేషమధ్యమున్
శ్రీలలితేందులీలఁ బరఁజేత శుభంబుల నిచ్చు నెప్పుడున్
లోలత నాగలోకసురలోకవచఃపరిపూర్ణకర్ణుఁడై. 2

సీ. అఖిలవిశ్వములకు నాధార[2]మైతగు తనువు నిశ్చలపురథంబు గాఁగ
కమలోత్పలంబు లొక్కట ముదంబుగఁ జేయఁ జాలిననిజదృష్టి చక్రములుగ
బ్రహ్మదేవునిసత్యభాషలై విలసిల్లు నిశ్వాసపవనంబు లశ్వములుగ
వేల్పుమూకల కెల్ల వీడుపట్టైయున్న ఘనతరకుధరంబు ధనువు గాఁగ

తే. చారుఫణిమయదివ్యభూషణము గుణము, దనరఁ దనయంత నితరసాధనము లేక
ప్రకట[3]దైత్యాహితామోఘబాణమునను, ద్రిపురదనుజులఁ గెలిచిన దేవుఁ గొల్తు.

శా. శ్రీరాజన్మహిమానుభావుఁ గరుణాసింధున్ గజేంద్రాస్యు వి
ద్యారంభప్రతిభావు దాససులభున్ ధ్యాతవ్యు దేవాధిపున్
హారగ్రీవుఁ ద్రిణేత్రు నైందవకళావ్యాసంగకోటీరు వి
శ్వారాధ్యాంఘ్రియుగున్ మహాగణపతిన్ బ్రార్థింతు నెల్లప్పుడున్. 4

క. శ్రీగణపతి నభివాంఛిత, భోగప్రదు సకలలోకపూజ్యుని వరదున్
భోగీశ్వరోపవీతు హి, మాగసుతాధీశపుత్త్రుఁ బ్రార్థన చేతున్. 5

1 నభోంతరంబునను. 2 మగుతన. 3 దైత్యకులాహిత,

సీ. దేవకీసుతు వసుదేవమనోహరు నందగోపవ్రజానందకరుని
సమధికపూతనాస్తన్యరుచిజ్ఞుని శకటాసురాంతకచరణకమలు
ప్రాచుర్యగోవర్ధనాచలోద్ధారకుఁ దోయజాసనసుతస్తుత్యచరితు
కాళియాహిఫణాగ్రకలితరంగస్థలీ నర్తనసంక్రీడనప్రచారు
తే. సబలచాణూరమల్లశిక్షాప్రవీణుఁ, గంసగర్వాపహరణవిక్రమసమర్థు
భక్తవత్సలు రుక్మిణీప్రాణనాథుఁ, గొల్తు శ్రీకృష్ణమూర్తిని గుశలబుద్ధి. 6

క. నిద్దపుఁ దొలుపల్కులుఁగల, పెద్దని తను మునులుపొగడఁ బెనుజదువులచే
బుద్ధులప్రోవై హరిపె, న్నద్దై తగు బ్రహ్మదేవు నురుమతిఁ గొల్తున్. 7

ఉ. వాణికి మ్రొక్కెదన్ మధురవాణికి నిత్యకృపాభిరక్షితేం
ద్రాణికి షట్పదవ్రజవిరాజితసౌరభపుష్పమాలికా
వేణికిఁ గింకిణీగణనవీనగుణక్వణనాంకమేఖలా
శ్రోణికి వల్లకీకమలశోభితపుస్తకకీరపాణికిన్. 8

ఉ. శ్రీరమణీమనోహరవిరించిశతక్రతువీతిహోత్రపం
కేరుహమిత్రచంద్రబుధకీర్తితమూర్తిని భక్తవత్సలున్
గౌరవ మొప్ప వైశ్యులకుఁ గామితసంపద లిచ్చుదేవునిన్
హీరపటీరవర్ణు నగరేశ్వరు నీశ్వరు నాశ్రయించెదన్. 9

క. తలఁతు జనార్దనదేవునిఁ, గలుషమహాతిమిరపటలఖండనకేళీ
జలరుహబాంధవు దానవ,బలశిక్షాదక్షు విమలపద్మదళాక్షున్. 10

శా. శ్రీలావణ్యు శరణ్యుఁ బుణ్యుఁ గరుణాశృంగారు సంరక్షిత
క్ష్మాలక్ష్మీవిభుభారతీశశుభవాక్యశ్లాఘ్యు విశ్వంభరున్
బాలేందూజ్జ్వలశేఖరున్ శిఖరికన్యామాన్యవామాంగునిన్
మూలస్థానము మల్లికార్జునశివున్ మోదంబునన్ గొల్చెదన్. 11

ఉ. శ్రీరమణీశశంకరవిరించిరమాతుహినాద్రిపుత్రికా
భారతులన్ భజించి గణపాలకుఁ బ్రార్థన చేసి షణ్ముఖాం
భోరుహమిత్రులం గొలిచి భూరిరసార్ద్రకవిత్వతత్త్వల
క్ష్మీరమణీయులన్ గవులఁ జిత్తమునన్ గొనియాడి వేడుకన్. 12

సీ. పదపదార్థజ్ఞానభాషావిశేషముల్ వ్యంగ్యనానావస్తువర్ణనములు
బహువిధాలంకారభావక్రమంబులు శబ్దప్రయోగరసజ్ఞతలును
ఛందోవిశేషలక్షణలక్ష్యభేదముల్ కవిసమయము చమత్కారములును
గ్రహశత్రుమిత్రవర్గగ్రహఫలములు రీతిశయ్యాపాకజాతివిధులు

తే. గద్యపద్యచతుర్భద్రఖడ్గచక్ర, మురజగోమూత్రికా 1ముఖ్యముఖరనియతి
కావ్యరచనల నెగడినఘనుల నాది,కవుల నభినుతి చేసి తత్కరుణ మెఱసి. 13

వ. మఱియు మద్గురునాథకటాక్షవీక్షణప్రథితానుగ్రహంబున నేతద్దేవతా ప్రార్థనం బొనరించి వసిష్ఠాత్రిగౌతమపరాశరవేదవ్యాసముఖమహామునీంద్రులను భక్తిఁ దలంచి కాళిదాస బాణ మయూర మాఘ భారవిశివభద్ర మల్హణప్రముఖ నిఖిలకవీశ్వరకృపారసధారాప్రవర్ధమానవచోవిలాసభాసమానుండ నై యొక్క ప్రబంధంబు రచియింపం దలంచుచున్నసమయంబున నష్టాదశపట్టణంబులఁ గల నూటనేఁబండ్రు నగరస్వాములు పెనుగొండపట్టణంబున నగరేశ్వరుని ముఖమండపంబున ధర్మసింహాసనాసీను లై కులాచారప్రతిష్ఠాధురంధరు లై మహాప్రతిష్ఠ నొనర్చి కులాచారనిర్ణీతసమయబహిష్కృతు లై పఱచినకమ్మనరప గోవ తూర్పు నాటి దుష్కృతుల దూషితులఁ జేయుచుఁ దథావిధప్రతాపప్రశాసనకనకస్తంభంబు నగరేశ్వర శ్రీమన్మహాదేవుని సమీపంబునఁ బ్రతిష్ఠించి యున్నసమయంబున. 14

క. తారాగణములలోపలఁ, దారాపతిఁ బోలి యున్నధన్యుని సభలో
భూరిప్రజ్ఞాఫణీంద్రుని, గౌరవమున భాస్కరార్యుఁ గనుఁగొని యంతన్. 15

క. గుమిగూడి వైశ్యసంఘము, రమణతోఁ గులగురువు భాస్కరార్యపదాంభో
జములకు సాఁగిలి మ్రొక్కిడి, క్రమ మొప్పఁగ లేచి నిటలఘటితాంజలు లై. 16

సీ. ద్విజవర్య వైశ్యు లాయజునూరుజన్ము లై ధాత్రి కేతెంచినతద్విధంబు
తపముచే నీశ్వరుకృపచేతఁ గైలాసవాసంబు గంధర్వవైశ్యవరుల
శాపంబు శైలజద్వాపరవేళ వైశ్యులను భూలోకంబు చేర ననుపుట
ద్వినవపట్టణముల విభవాధిపత్యంబుఁ బుత్రకామేష్టిచేఁ బుత్త్రుఁ గనుట
తే. కుసుమసెట్టిని వాసవకోమలాంగి, నధిపుఁ డడుగుట నూటమూఁ డనలకుండ
ములను బడి వైశ్యు లత్తఱి ముక్తిఁ గనుట, విప్రకులముఖ్య మా కిది విస్తరింపు.

సీ. వల్మీకభవుఁ డగువాల్మీకి చెప్పిన రామాయణము లోకరమ్య మయ్యె
వ్యాసమహాముని వాసికెక్కఁగఁ జేసెఁ బాండవేయులపేర భారతంబు
వరుస నార్గురుచక్రవర్తులు రాజులు పదియునార్వురపేరఁ బరగెఁ గృతులు
నట్టి పురాణంబు లతిభక్తి విన్నను బఠియింప లిఖియింపఁ బాపహరము
తే. లైనవిధమున మాకు నీయమలవాక్య, కావ్య మబ్బిన రవిసుధాకరధరాబ్ధి
తారకాద్రీంద్రు లెందాఁకఁ దనరియుండు, నంతకాలంబు సత్కీర్తి నలరు భువిని.

క. బుధజనులు వొగడఁ గవితా,మధురసుధారసవిభాసమానం బై భూ
మిధవులు మెచ్చఁగఁ జెనుఁ గగు,విధమున రచియింపు కృతి నవీన ప్రౌఢిన్. 19

---

1 నాగముఖ్యబంధ.

క. పర ధననిక్షేపంబును, సురభవనముఁ జెర్వు బావి సూనుఁడు వనమున్
గరిమను సుతులం బొందుట, పరఁగ నివి యెల్ల సప్తసంతానంబుల్. 20

గీ. సుతనిధానంబు గుడియు భూసురప్రతిష్ఠ, వనతటాకము కృతులను వార్థి సంఖ్య
యుర్వి నెందుండునందుండు నొక్కకృతియు, నెక్కుఁడైనదిక్కులం దెల్లఁ బిక్కటిల్లు.

ఉ. భారతరామసత్కథలు భాగవతంబుఁ దెనుంగుసేయఁగా
నేరరె సత్కవీశ్వరులు నేర్చి రచించినసత్కవిత్వముల్
మీఱుఁ దెనుంగుబాస నిల మెచ్చఁగ నొక్క తెనుంగుగ్రంథ మిం
పారఁ బ్రసిద్ధిసేయు మహిమండలి నొప్పఁగఁ బాడితాగ్రణీ. 22

క. అని తనశిష్యులు వేఁడిన, జనితానందంబునొంది సాలంకాయం డను
ముని చెప్పసాగె వడి, వినిపించెద వినుఁ డటంచు వికచాననుఁడై. 23

క. చెప్పెద సుకవులచెవులన్, జిప్పిల నమృతంపుసోన చిలికినమాడ్కిన్
గప్పురమును విరిపొట్లము, విప్పినక్రియ నొకరికొకరి విప్పగుకీర్తుల్. 24

క. అని తనమనమునఁ బొంగుచు, మనమున నొకచింతనొంది మానసవీథిన్
గనుఁగొని వైశ్యులు గురులను, వినుతించుచు మ్రొక్కి లేచి వినయాన్వితులై. 25

చ. కలియుగవేళ గానఁ బగఁ గన్యక కట్టడరీతి సేయదో
చలమున నొక్కఁడే నతని జాడను బెద్దలు బుద్ధిహీనులై
మెలఁగిన సెట్టు దీర్తు రని మీనుచి నుండెడిభంగిఁ దోఁచె. సీ
కుల మనువార్థికిన్ సుగుణకోవిద! చెల్లెలికట్ట యెవ్వరో. 26

ఉ. రాజవరున్ శపించుకటి రమ్మని మమ్మిటు చేరఁ బిల్చి యం
భోజదళాక్షి వాసవియు బోరున మేఘసుగర్జితంబుగాఁ
బూజితు లెల్లకాలమున ముఖ్యపురోహితు లాటఁ గట్టడిం
దేజ మెలర్పఁ జేసితిని చెప్పినబుద్ధుల నాలకింపరే. 27

క. కొట్లాడ రాదు మార్పడి, మాట్లాడఁగ రాదు వీరు మనగురువులు మే
మెట్లాగు సేయుకట్టడ, యట్లాగున నడవవలయు నర్భకులారా. 28

చ. మాకులమందుఁ బాసిచనుమర్త్యులు మేల్పరజాతులున్ ధరన్
ప్రాకటమైనవస్తువులు భక్తి నొసంగిన నాదరించిన
స్త్రీ కది నీతిగాదు చన సేకను మేమును మాకు మీరునై
యేకత మై చరింపుఁ డని యీశ్వరుపాదము లంటఁ జెప్పదే. 29

ఉ. అలసిన లేవకున్న నెదురాడినఁ దిట్టినఁ గోపగించినన్
సొలసియు లేదటంచు వృథసుద్దులు చెప్పిన మ్రొక్కకుండినం
బలుకకయుండినం గినుక పడ్డ మాతుం దగునంచుఁ గన్య దా
నలసి శపింపవల్దనుచు నంఘ్రులపైఁ బడి సమ్మతింపదే. 30

శా. కన్యారత్నముతోడ నిట్లు వినుతుల్ గావించి ప్రార్థించినన్
ధన్యత్వంబున నొప్పగించి మము నీదారిం జనం బ్రోతురే
సన్న్యాస్యైన వితంతురాలు వణిజై సత్పాత్రిణి యై రాజుచే
మాన్యంబైనను మీరు వర్తనలిడన్ మర్యాద గావించెదన్. 31

ఉ. సూర్యకులేందువంశ నృపసోముల కర్థి వసిష్ఠధౌమ్యు లా
చార్యపురోహితుల్ బలె నృపసత్తమ మీరు పురోహితుల్ గులా
చార్యులు మీవచస్స్థితులజాడ జరింపక యొండుచేసి రే
నార్యులు మెత్తురే యతఁడు నర్యుఁడె యార్యవరుండు ప్రోచునే. 32

ఉ. ధర్మయుగంబునం దగవుదప్పి యయాతి వరించె భార్గవి
న్బేర్మిని నాంబికేయుఁడును బెండిలియాడెను వైశ్యకన్యక
న్నిర్మలవిష్ణువర్ధనుఁడు నెలుగ నేగురు నూఱురెండమున
త్కర్ము లకారణత్వముగఁ గల్పఁగ మీకును విన్నవింపనే. 33

మ. ఘనవంశంబులవార లిట్లు నపవం గల్యాణముం జెట్లొకో
మనుజుల్ ద్రోహులు క్రూరు లల్పకులజుల్ మర్త్యేశులై చొచ్చిరే
ననఘా యీతెగు వెందునుం గలుగనే యానాఁటి క్షేత్రోవా మీ
ఘనవిద్యాకుశలత్వరం గల ముపేక్ష ల్లేక రక్షింపరే. 34

ఉ. కావున మచ్చరిత్రమును గన్యక సాహసకౌశలంబులుం
దేవ ప్రబంధరూపముగఁ దెల్లముగాఁగ సవిస్తరంబుగా
భూవలయంబున న్నెగడె పూర్ణత దిక్కులు పిక్కటిల్లఁగా
భావజరూప మీ తెలుఁగుఁబల్కుల మాకులవార్ధి యుబ్బదే. 35

మ. తెనుఁగుం గావ్యముఁ జెప్పరయ్య మృదువై దేశీయమై భవ్యమై
వినసింపై సరసత్వమై విరళమై విఖ్యాతమై కీర్తిమై
జనతామోదకహృత్యపథ్యయుతమై సద్ధర్మమై చోద్యమై
తనరంబల్కవె చింత యేల యనుచున్ ధర్మజ్ఞ భాషింపనే. 36

ఉ. వాసవకన్యకామణియు వైశ్యులు నట్టొక రర్థిఁ జేయునా
భాసురమైనకట్టడ ప్రపంచము గల్గినయంతకాలమున్
మీసముఖంబు వారడుగ మేము సమర్పణ సేతు మయ్య యా
చేసినకట్టడ ల్సరకుసేయనిద్రోహి కులంబు కర్హుఁడే. 37

చ. అనఘుస్వకర్మ వర్యయుగ మాబ్ధికక్రాంతి ప్రలోపవాసత
ద్దినముల నిమ్ముఁ బేరడుగఁ జేర్చినకై వడి సేతుమయ్య మీ
యనుమతి లేక యోగ్యుఁ డని యావల వేఱొక విప్రుకీయ న
ద్దినములు నిష్ట దేవతలు దిట్టఁగ కారవమందుఁ గూలరే. 38

ఉ. ఇప్పుడు నిన్ను వేఁడెదము ఎన్నికమీఱఁగ నీప్రబంధముల్
ఒప్పగుశాస్త్రసంగతి మృదూక్తిఁగఁ జేసిన సప్తసంతతు
ల్విప్పుగ మాకు నంచు బహువిశ్రుతవాక్ప్రతిభాధురీణు లై
కప్పురము న్సుచేలములు గర్ణవిభూషలు నిచ్చియంపటన్. 39

వ. వినయం బొనరించిన నమ్మహానుభావుం డిట్లనియె. 40

శా. మీకన్యామహిమంబు మీదునడతల్ మీదివ్యచారిత్ర మ
ల్లా కైలాసనుసంబునంపలికథ న్సాంతంబుగాఁ జెప్పెదన్
లోకు ల్మెచ్చఁ గవీంద్రకోటి విని యాలోచించి మేల్మేలనన్
ఆకల్పాంతము నుండు మీసుచరితం బాచంద్రతారార్కమై. 41

వ. అని మఱిమఱి యాదరించి పలికి పరమానందకందళితహృదయారవిందుండ నై
గుణవంతు లగువైశ్యవరులఁ గృతి కథానాయకులంజేసి వైశ్యచరిత్రోపరచనోప
క్రమణకుతూహలి నగుచు. 42

క. నగరేశజనార్దనులను, నగజను నాకోనకమల నవ్యాసవిభున్
వగ నెంచి తత్కృపారస, మగణితముగఁ గ్రోలి కావ్య మారంభింతున్. 43

క. బుధజనులు వొగడఁ గవితా, మధురసుధారసవిభాసమానం బై భూ
ప్రథితులు మెచ్చఁగఁ దెనుఁగగు, విధమున రచియింతుఁ గృతి నవీనప్రౌఢిన్. 44

శా. ఆపస్తంబమహామునీశ్వరజగద్వ్యాఖ్యాతైకసూత్రుండ వి
ద్యాపాథోనిధి గౌతమాఖ్యమునిగోత్రాధిక్యుఁడం బ్రోల్లస
ద్వ్యాపానుగ్రహవాక్యమర్దిత నృపశ్లాఘ్యుండఁ బెన్గొండపూః
శ్రీపుణ్యాద్యనివాసభాసితుఁడ ధాత్రీదేవతామాన్యుఁడన్. 45

క. సల్లలితలక్షణోక్తుల, సుల్లసితకవిత్వతత్త్వయుక్తుఁడ సుమనః
పల్లవితకీర్తిలతికో, ద్వేల్లితహరిదంతరుఁడ ధృతిన్ భాస్కరుఁడన్. 46

వ. అని తన్ను నభివర్ణనంబు చేసికొని సద్గుణమణిరత్నాకరంబు లగువైశ్యవరులపురవరం
బభివర్ణించెద నెట్లనిన. 47

సీ. ఏపురంబున నుండు నెలమి మూలస్థాన మల్లికార్జునుఁడు శ్రీమండితుండు
ఏపట్టనంబున గోపికాపతి దైత్యమర్దనుం డుండు జనార్దనుండు
ప్రవహించు నేవీటిప్రాగ్భాగమున బెట్టు కడలిరాయనికొమ్మ గౌతమమ్మ
ఏవీటఁ జెలువొందు నేప్రొద్దుఁ గరుణతో విశ్వనాథునిదేవి వింధ్యనిలయ

తే. విప్రబాహుజవిట్శూద్రవిమలహర్మ్య, కూటసంస్థాపితస్వర్ణకుంభదీప
జాలభాసితబ్రహ్మాండగోళకంబు, ధరణిస్వర్గంబు పెనుగొండపురవరంబు. 48

సీ. ప్రవహించు నేవీటిప్రాగ్భాగమున మించి శ్రీమత్తరంగ వాసిష్ఠగంగ
దర్శించు నేవీటిదక్షిణంబున దుగ్ధకాసారపుర మేలుఘనుఁడు శివుఁడు

పాలించు నేవీడుపశ్చిమంబునను గౌరీశ్వరుం డైనరామేశ్వరుండు
యోజించు నేవీటికుత్తరంబున నుండి యంబుజాక్షుండు జనార్దనుండు
తే. అట్టిపురవర మఖిలవిద్యాధురీణ, వైశ్యవంశపరాక్రమవర్ణనీయ
సముచితాక్షరసంపూర్ణశాసనాగ్ర, కీర్తనీయంబు అమ్మహాగిరివరంబు. 49

వ. మఱియు నభ్రంకష ప్రభూత శుభ్రశాతకుంభకుంభ శుంభత్సుధా ధవళ
ప్రాసాదవివిధబంధబంధురంబును, గంధసింధుర ఘటాకటతటీఘటిత గళన్మదధారా
కదంబజంబాలితరాజమార్గంబును, నిరర్గళశోభాశోభితంబును, దీర్ఘికాలంఘన
జంఘాలవిశుద్ధసత్త్వలక్షణలక్షితోత్తమతురంగమప్రకరబంధురంబును గౌతమీ
స్నాన విధూత నిఖిల కలుష విరహిత సత్కర్మానుష్ఠాన నిష్ఠాగరిష్ఠ వేదశాస్త్ర పురా
ణేతిహాసాఖ్యాయికాఖ్యాన కావ్యాలంకార నిరవద్యవిద్యావైశద్యవైదుష్యమేధా
ధురీణధరాసురవరాకీర్ణంబును, శరణాగతభరణాధికరక్షావిచక్షణ దుష్టశిక్షాకరణ
ప్రవీణశౌర్యాదిగుణరాజివిరాజమాన మహాకులీనరాజన్యమాన్యంబును, గర్పూర
కస్తూరికాది సమస్తవస్తువిస్తారితచీనిచీనాంశుక ప్రకరసుకరక్రయవిక్రయప్రకరణ
నిర్వహణచణవైశ్యజనంబును, మధురవాక్య కవితాసమర్థసుకవిసార్థ మనోహరం
బును, రంభోర్వశీసదృశలావణ్యవిభ్రమ కళాకుశలగాణిక్యమండితంబును, వికచ
ప్రసవసుగంధబంధురమదాంధపుష్పంధయవధూమధురనిరంకుశఝుంకారశ్రవణలో
లుప పుష్పలావికానికాయనికేతనంబును, నవోత్కంఠకలకంఠశుకచంచరీకమనో
హరరసాలతమాలహింతాల నారికేళచంపకప్రముఖభూరుహోద్యానహృద్యంబును,
కుముదకువలయారవిందసౌగంధికసౌగంధ్యపరిమళమిళితశీతలసరోవరవిరాజితంబును
బరిపంథిభయద ప్రాకారసముచ్ఛ్రియ పరివేషగండూషితబ్రహ్మాండమండలంబును,
గూలంకషాఖాతవిషమ పరిఖాశ్లాఘనీయంబును, రంగత్తరంగమంగళసముత్తుంగ
గంగాతరంగిణీపశ్చిమతటప్రసిద్ధకపిలమల్లేశ్వరాగణ్యభక్తజనశరణ్యాకారుణ్యకటాక్ష
పక్షితంబును, నిఖిలసంపదావాసభాసురంబును నై యొప్పు నప్పెనుగొండపుర
వరంబునందు. 50

క. రాజకళాధరభక్తులు, రాజోపమహర్మ్యయూథరంతలు విద్యా
భోజులు దనరిరి వసుధన్, రాజితపెనుగొండనగరరాజద్వైశ్యుల్. 51

సీ. శ్రీనగరేశ్వరశీతాంశుశేఖరపాదసరోరుహభ్రమరమతులు
గోగజహయతిలభూగృహముఖ్యషోడశమహాదానాదివిశదమతులు
దేవగేహారణ్యదీర్ఘికాకావ్యనిధానాదిసప్తసంతానఘనులు
వాణిజ్యకృషివృద్ధివరధేనురక్షణచతురాఢ్యజీవనశాలియశులు
తే. యజనదానాధ్యయనకర్మభజనపరులు, జగతిఁ బెనుగొండపురవరశాసనాంకు

లనుచు సన్నుతిఁ గాంచి నిరంతరంబు, నలరుదురు వైశ్యు లతిధర్మనిరతులగుచు. 52

సీ. వితరణగుణధైర్య విశ్రుతభుజశౌర్యవిభవమహైశ్వర్యవిజయయుతులు
ధర్మకర్మాధారనిర్మలవ్యాపార సతతమహోదారశాంతమతులు
వినయదశామూల విశదయశోలోల విపులగుణావాలవిమలమతులు
పరమసత్యజ్ఞానభవ్యవిద్యాస్థాన పటుబుద్ధినవమానభాగ్యఘనులు

తే. నాఁగఁ బెనుగొండ యనుమహానగరమందు, నలరుదురు వైశ్యులతిధర్మనిరతు లగుచు
సకలగుణముల దానవిశ్వాసనియతి, ధర్మదాక్షిణ్యగుణములఁ నరమె పొగడ. 53

క. రాజితమూర్తిజనార్దన, రాజీవోదరునిపాదరాజీవాళుల్
భ్రాజితసాత్త్వికులు ధరన్, రాజితపెనుగొండనిలయరాజద్వైశ్యుల్. 54

## షష్ఠ్యంతములు.

క. సంధ్యానివారణచణులకు, సంధ్యాజపహోమముఖ్యసత్కర్ములకున్
వింధ్యావాసినిపదసంబంధ్యామోదాభిలోలబంభరములకున్. 55

క. కరుణాకరులకుఁ బండిత, వరపారంపర్యభాగ్యవర్ధనులకు ని
ర్భరకీర్తి సతీప్రియులకు, సరసగుణాఢ్యులకు నీతిచాతుర్యులకున్. 56

క. నగరేశ్వరభక్తులకును, నగరాధీశులకు సర్వనగరాఢ్యులకున్
నగరాంకస్థిరమతులకు, నగరస్వాములకు బాలనగరాఖ్యులకున్. 57

క. శివపూజాతత్పరులకు, వివిధపురాణేతిహాసవేత్తలకును స
త్కవిగాయకకల్పకులకు, నవరసరసికులకు బాలనగరాఖ్యులకున్. 58

క. భవ్యులకును నీతికళా, కావ్యులకు సుధాంబురాశిగంభీరులకున్
దివ్యాధిపవైభవులకు, నవ్యయశస్కులకు బాలనగరాఖ్యులకున్. 59

క. ధన్యుల కూరుజకులమూ, ర్ధన్యులకు సమస్తవస్తుధనధాన్యరమా
ధాన్యాగ్రహారబహులతర, కన్యాదానప్రవీణకరుణాత్ములకున్. 60

# ప్రథమాశ్వాసము.

---

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నారచియింపంబూనిన వైశ్యపురాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన సర్గప్రతిసర్గవంశ మన్వంతరవంశానుచరితంబు లనుపంచలక్షణంబులు పురాణంబునకుఁ గారణంబులుకావున మున్ను నైమిశారణ్యంబున ననేకమునిగణంబులుగొలువ సుఖాసీనుండగు సాలంకాయనమునీశ్వరునకు వైశ్యమునులు సాష్టాంగనమస్కారంబు లొనరించి కృతాంజలులై మదీయవంశవృద్ధానుచారవిశేషలక్షణంబు లశేషంబును గృపాయత్తం బగుచిత్తంబునం గ్రొత్తక్రొత్త లగు సుధాసదృశకథాపూరంబులు తిరంబులుగా నానతీయవలయు ననిన నమ్మహానుభావుండు భూతభవిష్యద్వర్తమాన జ్ఞానమహనీయుం డగుటంజేసి మున్ను గీర్వాణభాషం బురాణరూపంబుగా నుపన్యసించె. నాపురాణంబు నఖిలజనవేద్యంబుగా నాంధ్రభాషం బ్రబంధంబు నిర్మించెద నందు సృష్టిప్రకారం బెట్టిదనిన. 61

శా. సర్వోత్కృష్టుఁడు సర్వనేత్రుఁడు మహాశబ్దాదిసంయుక్తుఁ డా
శర్వుం డవ్యయుఁ డీశ్వరాఖ్యుఁడు ప్రపంచం బెల్లఁ గల్పించుచున్
దుర్వారుం డయి సంహరింపుచు మహాస్థూలాతిసూక్ష్మప్రభా
ఖర్వజ్ఞానధురంధరుండు గలఁ డోంకారాత్ముఁ డీశుం డనన్. 62

వ. అమ్మహానుభావుని మహనీయప్రభావం బచింత్యం బగమ్యం బమేయం బవ్యక్తంబు వేదంబులు నవాఙ్మానసగోచరం బగుటంజేసి చిక్కువడి భయంబునఁ దద్వ్యావృత్తింబలుకుఁ గావున నస్మదాదులకుఁ దత్ప్రభావం బెఱుంగ నశక్యంబ గనశక్యం బగుట సందియంబులేదైనను భక్తవత్సలుం డన్నవాక్యపరిపాటింజేసి పరబ్రహ్మవేత్త లగుమునీంద్రు లుపన్యసించిన చిరంతనకథాశ్రవణజనితజ్ఞానవిశేషంబునం జేసి సంక్షేపమార్గంబునం జెప్పెద వర్తమానసౌరమానసంవత్సరంబులు కృతయుగంబునకుఁ బదునేడులక్షలు నిరువదెనిమిదివేలు, త్రేతాయుగంబునకుఁ బండ్రెండులక్షలుందొంబదియాఱువేలు, ద్వాపరయుగంబునకు నెనిమిదిలక్షలు నఱువదినాలుగువేలు, కలియుగంబునకు నాలుగులక్షలు ముప్పదిరెండువేలు. ఈ యుగచతుష్టయంబుఁ గూడ నొక్కమహాయుగం బమ్మహాయుగంబులు డెబ్బదియొక్కటి చనంగా నొక్కమన్వంతరం బీమనువులు పదునలుగురు చన నొక్కయింద్రకల్పం బయ్యింద్రకల్పంబు లిర్వది చనంగా బ్రహ్మ కొక్కదివసం బగు నేతద్దివారాత్ర

క్రమయుక్తం బగువత్సరశతం బతనిపరమాయుష్యంబు శతబ్రహ్మకల్పంబులు చన దీర్ఘాయుష్యుం డనుమునీంద్రున కొక్కదినంబగు నమ్మునీంద్రు లిరువదికోట్లు చన [1]రోమహర్షున కొక్కరోమం బూడు నారోమజులు ముప్పదికోట్లు చనన్ నాదిమీనంబునకుం బొరచిప్ప దొలంగు మీనంబులు పదికోట్లు చనంగ నష్టావక్రున కొక్కదొంకు చక్కనగు నష్టావక్రు లెనుబదికోట్లుచనఁ బాదలోచనునకు నొక్కనిముసమాత్రం బగు నాపాదలోచను లేఁబదికోట్లు చన శ్రీమన్మహాదేవున కొక నిముసమాత్రం బగుననిన నమ్మహాత్ముండు కాలాతీతుం డగుట కేమిసందియంబు? అతండు సృష్టిసంపాదనాయత్తచిత్తుం డై నిజజ్ఞానానలభస్మీభూతపంచభూతప్రపంచుం డై సగుణత్వంబునఁ బ్రసన్నుం డగుచు సంకల్పించిన తదనంతరంబ. 63

చ. వెరవగు నీశ్వరాజ్ఞఁ బ్రభవించిరి బ్రహ్మయు విష్ణుదేవుఁడున్
హరుఁడు చరాచరాత్మకచయంబుల కుద్భవరక్షణక్రియా
హరణగరిష్ఠు లై తనయహంకృతి మించి విరించి లోకముల్
పరగ సృజింపఁగాఁ దలఁచి భవ్యమహత్త్వముఁ జూపునయ్యెడన్. 64

చ. శిరమున నంబరస్థలముఁ జిత్తమున న్విధుఁ డాననంబునన్
సురపతి వహ్నివిప్రులును సూర్యుఁడు గన్నుల సర్వదిక్కులున్
బరువడిఁ గర్ణరంధ్రములఁ బ్రాణములన్ బవనుండు బాహులం
దరయఁగ రాజరాజియు సమంచితనాభి మహాంతరిక్షమున్. 65

క. ఊరుతలంబుల వైశ్యులుఁ, జారణనుతినొప్పుచరణసరసీజములన్
భూరమణియు సచ్ఛూద్రులు, గారవమునఁబుట్టి రట్టిఘనతరమహిమన్. 66

వ. మఱియు నీభూతధాత్రివలన నతల వితల సుతల రసాతల పాతాళ నాగ భూర్భువస్సువర్మహాజన తప స్సత్యాదిలోకంబులును త్రయస్త్రింశత్కోటిదేవతలును ద్వాదశాదిత్యులు, నేకాదశరుద్రులు, నవబ్రహ్మగ్రహనిధానంబులు, నష్టదిక్పాలకవసుదిగ్గజంబులును, సప్తమాతృకమహాముని సాగరశైలద్వీపంబులును మహానదీనదంబులును, షడుత్తరపంచాశద్దేశంబులును, రక్షఃపక్షియక్షగంధర్వసిద్ధవిద్యాధర కిన్నర కింపురుషాది నానాఖేచరవిశేషంబులును భూజలవనకుధరాంతరిక్షచరాచరాత్మకంబు లగుసమస్తస్థావరజంగమాదివిశేషంబులు గలిగె నని సాలంకాయనమహామునీంద్రుం డానతిచ్చిన విని యత్యంతసంతుష్టాంతరంగు లై యవ్వైశ్యమునులు సాష్టాంగనమస్కారంబు లొనరించి ముకుళితకరకమలు లై బ్రహ్మోరుసంభవు లగువైశ్యు లెందఱు? వారిసతు లెందఱు? వారికి జాతకర్మాదివిధానంబు లెవ్వ రొనరించిరి? తదనంతరకథావిశేషంబు లేరూపంబు లానతీయవలయు నని యడుగుటయు. 67

---

1 రోమజు, లేక రోమశు.

## ఆశ్వాసాంతము.

ఉ. హీరమరాళకాశవృషభేశఫణీశ్వరశర్వరీశవా
క్షీరదమేఘసారఘసుగంధసమున్నతపుష్పమాలికా
హారపటీరమారహరయాదవరామసుధాంబురాశిడిం
డీరవిశాలకీర్తులు వణిక్ప్రవరుల్ మహిమాధ్యులిమ్మహిన్. ౬౮

మాలిని:—

నిజకులభవకన్యానిర్జితారాతిభవ్యుల్
సుజననివహసేవ్యుల్ శోభనోత్సాహదివ్యుల్
కుజననివహదూరుల్ కుంఠితారిప్రచారుల్
నిజకులహితకర్ముల్ నిర్మలుల్ బాలవైశ్యుల్. ౬౯

గద్యము. ఇది శ్రీ సరస్వతీచరణకమలనిష్యందమకరందబిందుసందోహ మధురధురీణ మధుకరాయమానమానస సరసకవితావిలాస శ్రీభాస్కరాచార్యనామధేయప్రణీతం బయిన వైశ్యపురాణంబునందు దేవతాప్రార్థనంబును సృష్టినిర్మాణంబును వైశ్యకుల సంభవంబు నన్నది ప్రథమాశ్వాసము.



శ్రీగణేశాయ నమః.

శ్రీశారదాంబాయై నమః.

# శ్రీ వైశ్య పురాణము

## ద్వితీయాశ్వాసము.



రాజరాజవిలసద
గారులు దుగ్ధాంబురాశిగంభీరులు జం
భారిసమభోగధీరులు
నారీమన్మథులు బాలనగరప్రవరుల్. 1

వ. ఆకర్ణింపుం డని సాలంకాయనమునీంద్రుండు వైశ్యర్షుల కిట్లనియె. 2

మ. ఎలమిన్ బద్మజుదక్షిణోరుతలమం దేర్పాటపద్నల్గురు
జ్వలమూర్తుల్ మనుజోత్తముల్ తదితరస్థానోరులం దందఱై
జలజాక్షు ల్వరవర్ణినీమణు లతిస్వచ్ఛాంగశృంగారిణుల్
కులశీలాన్విత లుద్భవించి రెలమిన్ గోత్రావళీరక్షకై. 3

ఉ. ధాతయుఁ బుత్త్రమోహజనితప్రియభంగుల జాతకర్మముల్
చాతురి నామధేయములు చౌళవిధానములున్ ఘటించి వి
ఖ్యాతశుభోపనీతులుగ గౌరవనీతికళారసజ్ఞతా
ధీతసమస్తవేదు లగుధీరులుగాఁ గరుణించి యంతటన్. 4

క. ఆద్యానుక్రమగతి నన, వద్యస్థితి వర్తమానవనితాతతులన్
విద్యానిధు లగువైశ్యుల, కుద్యోగతఁ బెండ్లిచేసె నుత్కంఠ దగన్. 5

క. ఆప్తత చతుర్దశోత్తర, సప్తశతఖ్యాతగోత్రజంపతులకు సం.
గుప్తిగ విలసిల్లెడునా, దీప్తవ్యవహారసరణి ధీరతఁ జెల్పెన్. 6

క. పరకృషిగోరక్షణములు, నిరతముగా ధనసమృద్ధి నిగుడించి మదిన్
గరుణయు వితరణగుణమును, సరసీరుహగర్భుఁ డొసఁగె సంతోషమునన్. 7

వ. మఱియు యజనాధ్యయనదానకర్మత్రయంబును గర్భాధానపుంసవననామకరణా
న్నప్రాశనచౌలోపనయనవివాహాదిషోడశకర్మమర్మజ్ఞానంబును, దేవబ్రాహ్మణతటాక
వననిక్షేపాది సప్తసంతానమహాధర్మంబులును, నణుమాత్రపదార్థసంచయప్ర

వర్ధన) నిష్ఠాకౌశలంబును, మహావ్యవహారక్రియాగాంభీర్యధైర్యంబులును, నిఖిల
పట్టణాంగణప్రచారప్రచురసమస్తవిస్తారితప్రభావంబును వైశ్యాన్వయయోగ్యంబు
లగుధనకనకమణివస్తువాహనాదివివిధాధిక పరీక్షాధికారిత్వంబును నుపదేశించి భూలో
కంబునఁ బ్రతిష్ఠించిన. 8

సీ. బ్రహ్మాజ్ఞఁ దలమోచి భార్యాసమేతులై భూమండలంబునఁ బుట్టముగను
సకలజనానందసంపదైశ్వర్యంబు లవ్యాహతఖ్యాతి నతిశయిల్ల
వివిధనీతివిశేషవిద్యాప్రభావంబు లారూఢవాక్ప్రౌఢిఁ లచ్చుపడఁగ
సప్తసంతానాదిచారుధర్మంబులు సత్కీర్తిమహితులఁ జతురముగను

తే. వెలయ నొనరించి బహుమానవివిధగతుల, సత్యసంధాధురీణులై సర్వమాన్యు
లగుచు సౌభాగ్యభోగవిహారు లగుచు, నధిక యౌవనసౌఖ్యంబు లనుభవించి. 9

చ. కొడుకులు కూఁతులున్ సఖులు కూరిమి బాంధవు లాప్తవర్గ మిం
పడరఁగ నెల్లవేళల నిజాజ్ఞ వహించి వశప్రదీప్తులై
చిడుముడిపాటు లేక తమసేవ యొనర్పఁగ సంపదాఢ్యులై
వడిగలనాఁడె చిత్తము శివస్థిరభక్తిని గూర్పఁగాఁ దగున్. 10

చ. [1]తనుజులు దుర్మదంబునఁ బవంపడి భార్యలు బుద్ధి చెప్పిన
న్వినుచు విభక్తులై మిగుల నేసరి కష్టపుఁగూఁడు పెట్టఁగా
[2]మునుగుచు నాత్మపత్ని తను మూఁతులు ముంప నశక్తకార్యులై
చెనఁటితనంబునం బడక శేషవిభూషణుఁ గొల్చు టొప్పగున్. 11

క. జర యరయఁ బాపరూపిణి, జర యెట్టిబలాఢ్యు నైన జవహీనునిఁగా
ధరఁ జేయుఁ గానఁ దలఁపున్, హరచరణాంబుజములందు నర్పింపఁ దగున్. 12

గీ. అనుచు నిశ్చయించి యంగనాసహితులై, కణఁకఁ గమలగర్భుకడకు జేరి
యతనిపాదములకు నతిభక్తితో మ్రొక్కి, విన్నవించి రధికవినయ మెసఁగ. 13

క. శరణము కమలాసన మీ, చరణము మా కనుచు మిమ్ము సమ్మతిఁ గోరన్
వర్ధగురుమతిఁ బనివింటిమి, పరమకృపా శివునిఁ గొలుచుపథ మెట్లనినన్. 14

క. విని బ్రహ్మదేవుఁ డిట్లను, ఘను నప్పరమేశుఁ దలఁపఁగను సీతరమా
వనజోదరాదు లైనను, మనములఁ దలఁపోయరానిమహిమలవానిన్. 15

క. ఐనను నిజవరభక్తా, ధీనుండగుఁ గాన మీరుఁ ద్రినయనుఁ దచల
ధ్యానాస్పదుఁ డగు భక్తిం, బూని మహామునులసేవ పుణ్యాత్మకులై. 16

---

1 తనయులుఁ దమ్ములున్ సతులుఁ దమ్మునెదిర్చియుఁ బుద్ధిసెప్పఁగా, వినకతి మూర్ఖులై.

2 మునుకొనియాత్మపత్నితనుమూఁతులు వొడ్వ నశక్తశౌర్యుఁ లై.

క. నిజభక్తాధీనుం డగు, త్రిజగన్నుతుఁ డైనశివుని ధీరసమాధిన్
భజియించిన గోచరుఁ డగు, విజయముతో మునులరీతి వెలయుఁడు హితులై. 17

గీ. మంత్రవిధులఁ దెలిసి మహితాత్మవంతులై, గురుకటాక్షభంగి గొమరు మిగిలి
ఘనతపస్సమృద్ధిఁ గనవచ్చు శివుకృప, ననిన నట్లకాక యనుచు మ్రొక్కి. 18

వ. బ్రహ్మజ్ఞానవిశేషముం గైకొని యమ్మహాత్మునకు సాష్టాంగనమస్కారంబు లాచరించి తదాజ్ఞావిశేషంబున. 19

మ. చని సందర్శన మాచరించిరి మనస్సంపూర్ణ పుణ్యాపగా
వనజోద్యన్మకరంపబిందులహరీ వర్షప్రకర్షస్ఫుర
ద్వనబృందాంతరమందమందపవనవ్యాపారలీలోల్లస
న్మునికన్యానటనాభిశోభితతపోముఖ్యాశ్రమశ్రేణులన్. 20

వ. మఱియు నమ్మహామునీశ్వరవరతపః ప్రభావదీపితపావనాపగాసమీపబంధురసంధ్యామంటపంబులును సమిత్కుశఫలాహారస్ఫుటపటుక్రీడారూఢమహానోకహచ్ఛాయానిషణ్ణమృగనాభిశోభితధ్యానస్థానప్రదేశంబులును, నానామునికుమారికానికర కరకిసలయకలితకనకకలశ సలిలాభిషేక వర్ధమాన పల్లవితకోరకితకుసుమిత ఫలితవివిధ ద్రుమవిశ్రాంత శుక పికమయూర మధుకర మిథున విహరణ నిపుణ తరుణ మలయపవనకించిచ్చలితవికచప్రసవవిసరపరిమళ మిళిత బహుళమహీధరగుహాగేహంబులును మునికుమారోదితఋగ్యజుస్సామాథర్వణశిక్షాకల్పవ్యాకరణనిరుక్తచ్ఛందోజ్యోతిషవివిధతర్కతత్త్వజ్ఞానశాస్త్రఘోషఘుమఘుమాయమానసువర్ణవర్ణోదీర్ణాభ్యర్ణపర్ణశాలాజాలస్థానంబులును, నిరంతరాహుతిగంధగంధితహోమధూమపావనపచనోపచారప్రచురత్రైర్థిక మధ్యదర్భాసనాసీనయమనియమాసన ప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధ్యష్టాంగయోగ నిరతకశ్యపాత్రిమౌద్గల్య శ్రీవత్సమార్కండేయ గౌతమాంగిరసనారదపారాశర్యవాలఖిల్యవామదేవసుతీక్ష్ణ పులస్త్యదుర్వాసోమాండవ్యశాండిల్యఋశ్యశృంగవసిష్ఠభరద్వాజసాలంకాయన ప్రముఖమునిసంఘంబులం గనుంగొని వినయభక్తిపూర్వకంబుగా సాష్టాంగనమస్కారంబు లాచరించి ముకుళితకరకమలులగుచు, వారలనుద్దేశించి యిట్లనిరి. 21

క. వెలయఁ గృతార్థుల మైతిమి, సలలితముగ వైశ్యకులము సాఫల్యంబై
వెలసె సుకృతాదిగతులం, గలిగె భవద్దర్శనమున ఘనతరభంగిన్. 22

గీ. సకలదురితహరము సద్భక్తిసుకృతంబు, పూర్వజన్మమహితపుణ్యఫలము
భావిభోగభాగ్యవరకృపా సంప్రీతి, తరము బ్రహ్మమునులదర్శనంబు. 23

వ. అనుచు ననేక ప్రకారంబుల నమ్మహానుభావు లగుమునుల మనఃప్రీతిగా వినుతించిన.

క. విని తద్భాషారచనలు, మన మలర ననుగ్రహించి మన్నించి తగన్
మునినాయకులును వైశ్యుల, ఘనముగ నాశీర్వదించి కరుణ దలిర్పన్. 25

క. ఏ కారణ మిటు వచ్చితి, రే కాలము పుణ్యవిధుల కిరవగుపురుషుల్
మీ కాగమఫలభాగ్యము, చేకుఱుః బరమార్థ మనినఁ జెప్పిరి భక్తిన్. 26

శా. భూలోకం బతిగర్వదుర్వహమహాభూతవ్యథాక్షోభదు
శ్శీలావాలము రోగసంశయభయోత్సేకంబునై శూన్యకృ
జ్జాలాభీలము మత్సరాగ్రహమహాశాపాశబంధంబులన్
జాలిం బొందెడి మర్త్యకోటికి శివజ్ఞానంబు సౌఖ్యం బిలన్. 27

క. హాలాహలవిషవర్ష, జ్వాలాభీలాగ్నిఁ బనరి సంభ్రమదివిష
జ్జాలాక్రందన ముడుపం, జాలినశివుఁ గొల్చుగతిఁ బ్రసాదింపుఁ డొగిన్. 28

వ. అని వైశ్యబుషులు విన్నవించిన మునివరు లకుంఠితప్రేమంబునఁ దమవాక్యంబు లంగీకరించినఁ బ్రమోదభరితహృదయులై దినదినంబును వారలకు శుశ్రూషావిశేషంబు లొనరించుచుఁ గ్రమక్రమంబున సేవించిన వారలభక్తియు సదాచారనియమంబును బరీక్షించి సంతోషించి వైశ్యులకు శివుండు ప్రత్యక్షం బగునట్లుగాఁ బంచాక్షరీమంత్రం బుపదేశించి తత్సాధనమంత్రపూజాసంతర్పణ జపహోమచక్రోద్ధారణవిధులును నవచక్రంబులును సప్తమండలంబులును వశాక్షరరహస్యంబులు మొదలగు పరమయోగరహస్యజ్ఞానంబులు దెలిపెన నిజగురుకారుణ్యలబ్ధజ్ఞానసమన్వితులై యమ్మునులచే వైశ్యర్షులు పుణ్యనదీనదసప్తకులమహీధరనైమిశారణ్యాది పుణ్యవనస్థానంబులకుం జని విహితాష్టాంగయోగనిరతులై శ్రీమన్మహాదేవు నుద్దేశించి తపం బొనరింపం దొడంగిరి. 29

ఉ. కొందఱు వన్యమూలములఁ గొందఱు రాలినశుష్కపర్ణముల్
కొందఱు వాయుతోయములఁ గొందఱు పక్వఫలప్రకాండముల్
కొందఱు పంచగవ్యములఁ గొందఱు శాకములన్ భుజించుచుం
గొందఱు భక్తితత్పరతఁ గొందలమందక ధీరచిత్తులై. 30

క. నాలుగుదిక్కుల మంటలు, సోలక [1]లోఁగ్రోసి మండి నటనలు సలుపం
దూలక రవిమండలమునఁ, గీలించినదృష్టి [2]సంప్రకీర్తన మెఱయన్. 31

సీ. తేఱిచూడఁగరాని తీవ్రాతపంబునఁ బర్వతాగ్రంబులఁ బ్రతిభ దనర
నుడుగనిజడివాన లడరంగ బెగడైన పెనుమ్రానినీడలఁ బెండువడక
పడి వహ్ని నైనను వడఁకించుచలిలోన నిండినకొలఁకుల నేపుమీఱ
నాహారనిద్రలు ననిశంబువర్జించి విఘ్నకారులచేత బెగడువడక

---

1 లోఁగఁజూచి. 2 తోఁబ్రకీర్ణత.

తే. సురమహీరుహశాఖలఁ జరణయుగము, లలరఁ గీలించి యుగ్రతఁ దలయుఁగ్రిందు
గాఁగఁ జేతులు గ్రాలఁగఁ గణఁగి ఘోర, తప మొనర్చిరి పరమేశుఁ దలఁచియచట.

వ. మఱియు ననేకప్రకారంబుల ఘోరతపం బాచరించి మృడుం గానక సకలవన పుణ్యకులకుధరస్థానంబులనుండి తపంబు సేయువారలందఱుం గూడి విచారణ కర్తలై యిట్లని వితర్కించిరి. 33

క. సంతోషప్రదుఁ డగుచును, జింతింపఁడు మనల శివుఁడు చిత్తములోనన్
ఇంతేల తడవు సేసెనొ, యెంతయు నెఱుఁగింపవలయు నిది గురువులకున్. 34

వ. అని వైశ్యమునులందఱుఁ జింతాతత్పరులై కదలి మునిసంఘంబులకడకుం జని యిట్లని విన్నవించిరి. మహాత్ములారా! మీ రానతిచ్చినవిధంబునఁ బరమరహస్యోప దేశంబునఁ దపంబు చేసినఁ బరమేశ్వరుండు కరుణింపని తెఱం గెఱింగింపుఁ డనిన నమ్మహామునులు దివ్యజ్ఞానంబునం జూచి యిట్లనిరి. 35

క. మీమీయిష్టార్థంబులు, మామందఱఁ బ్రతినచేయ మాననియతితోన్
మీమీనిష్ఠకు మెచ్చుచు, సామీప్యపదం బొసంగు శంభుఁడు వేగన్. 36

వ. అని మఱియు నిట్లనిరి. 37

క. మీకులమువారికెల్లను, నీక్రియ నార్జింపకున్న నిహపరసుఖముల్
ప్రాకటముగఁ బ్రాపింపవు, శ్రీకలిమియు లేదు మిగుల సిద్ధం బరయన్. 38

వ. అని మునీంద్రు లానతిచ్చిన నట్లకాకయని యంగీకరించిన నందఱ నాశీర్వచించి మీకుఁ బరమేశ్వరుండు పరమకృపాయత్తచిత్తుండై వేగంబ ప్రత్యక్షంబుగావుత మనిన వైశ్యమునులు సంతోషించి పుణ్యంబు లగునిజతపస్థానంబులకు నరిగి ఘోర తపం బాచరించిన. 39

సీ. పద్మాసనస్థులై పాయకుండుటఁజేసి [1]పెట్టెను బుట్టలు నిట్టలముగఁ
[2]బుట్టలఁ గోళ్లను బుట్టిన కీచకసంధిరంధ్రంబులఁ జతురముగను
వర్షధారలు సొచ్చి వాటమై ముఖనేత్రనాసాశ్రవస్సుల నటనఁదాఁకఁ
బొడమిన గర్భాగ్ని భుగభుగధ్వనులతో దొరఁగెడి మిణుఁగురుల్ తొంగలింప
తే. విపులఁ జిచ్చురకోలలవిధము దోఁప, మింటఁ బుంఖానుపుంఖము లంట మెఱసి
కడిమి సుడివడి ఘనతారకములఁ దాఁకఁ, దప మొనర్చిరి తరుణేందుధరునిఁగూర్చి.

వ. మఱియు నాతపంబువలన. 41

క. [3]మృడుఁ గొలుచు నుగ్రతపమున, జడిసెం గులగిరులు సప్తజలధులఁ గలఁగెన్
[4]గడిమి నుడుగణము సెదరెను, గడువడి సుడిగొనుచు ధరణి గడగడ వడఁకెన్.

---

1 పెట్టెఁబుట్టలను బిపీలికములు. 2 పుట్టగొప్పలలోనఁ బుట్టినకీటక. 3 మృడుఁ గూర్చి సేయుతపమున. 4 వడినుడుగణములురాలెన్, గడువడితోఁ బుడమియంత.

వ. అయ్యవసరంబున నాఖండలుండు వైశ్యమునులతపంబున కదరిపడి యంగార పాషాణకంటకసర్పసింహగజవ్యాఘ్రంబు మొదలుగాఁగలవానిచే విఘ్నంబు లాచరించినఁ దద్విఘ్నంబులం జలింపక యున్నంత నాఖండలుండు చలించి నిజగురువగునంగిరసుపుత్రు వీక్షించిన నతండు తనయోగదృష్టిచేత వారలసమాచార మెఱింగి శచీవల్లభున కిట్లనియె నయ్యా వా రూరుజులు, శంకరునిగూర్చి మోక్షార్థులై తపం బాచరించుచున్నవా రనిన విని యతండు కొంతకాలం బూరకుండి మనంబున సంశయించి దిక్పాలసమేతుండై కదలి కైలాసంబునకుం జని యందు దేవర్షిప్రమథగణసహితుండై యున్నశంకరునకు నమస్కరించి కరకమలంబులు ముకుళించి నిలిచె. అంత శంకరుం డూరవ్యులతపంబునకుఁ బ్రసన్నహృదయుండై బ్రహ్మవిష్ణుదేవర్షిప్రమథగణంబులు దిక్పాలకులు మొదలుగాఁగలవారికిఁ గామరూపంబులిచ్చిన నందఱు నన్నిరూపు లై రట్టిసమయంబున. 42

క. అందఱయాశ్రమభూముల, నందఱువైశ్యులకు వరదుఁ డయ్యెడికొఱక్
అందఱు దివిజులు గొలువఁగ, నందఱకును నన్నిరూపు లరుదుగ నయ్యెన్. 43

సీ. శార్దూలచర్మంబు మార్దవచేలంబు భూతియుఁ గస్తూరి పొలుపుమిగులఁ
బాములహారము ల్పద్మారిఖండంబు సీమంతరేఖయుఁ జెలువువనర
మిన్నేటినటనయు మేలిమిసేసయు ఫణికుండలము దంతపత్రికయును
సూక్ష్మస్తనంబు విస్ఫురితకుచంబును మహనీయసౌందర్యమహిమ లలర

తే. నర్ధనారీశ్వరాకృతి నమరఁ దాల్చి
పరఁగ శూలాంకుశాభయవరదహస్త
సరసిజాతుం డగుచు మించి సదమలమతిఁ
జారు తేజోమయుం డై నశంకరుండు. 44

గీ. వెండికొండభంగి విశదకాంతుల మించు
నందికేశు నెక్కి నటన మెఱయ
వరకృపామృతార్ద్రవరకటాక్షంబులు
భక్తవరులమీఁదఁ బరఁగి చెలఁగ. 45

వ. మఱియు, విఘ్నేశ్వరనందినాథభృంగిరిటమహాకాళవీరభద్రకుమారచండీశ్వరాంగద చారుకర్ణవిజయకర్ణవీరకర్ణఘంటాకర్ణత్రిముఖచతుర్ముఖపంచముఖానేకముఖైకకరద్వికరదశకరశతకరసహస్రకరసింహముఖాద్యనేకప్రమథగణసమేతుఁడై హరిబ్రహ్మేంద్రప్రముఖదిక్పాలకసురగణపరివృతుఁడై త్రయస్త్రింశత్కోటిదేవతాగణంబులును యక్షరాక్షసపక్షిగరుడగంధర్వసిద్ధసాధ్యకిన్నరకింపురుషులును రంభాద్యప్సరస్త్రీనికాయంబును గొలువఁ జండీశ్వరతుంబురునారదాదులు కైవారంబులు సేయ భూనభోంతరాళంబులు గ్రందుకొన నిఖిలవేదవేదాంగసంగతజయజయధ్వానంబులుచెలంగ

వజ్రవైడూర్యగోమేధికపుష్యరాగ మరకతమౌక్తిక ప్రవాళకనకపుష్పవర్షంబులు గురియ ఘంటాశంఖకాహళమృదంగనిస్సాణభేరీవిశేషఘోషంబులు మెఱయ నవాఙ్మానసగోచరుం డైనయప్పరమేశ్వరుండు వైశ్యఋషులకుఁ బ్రత్యక్షం బైన వారు వల్మీకంబులనుండి వెలువడి పరమానందకందళితహృదయారవిందు లగుచు సవినయంబుగా సాష్టాంగనమస్కారంబు లాచరించి, కరకమలంబులు ముకుళించి నిటలతటంబులం జేర్చి యిట్లని వినుతించిరి. 46

దండకము. శ్రీమన్మహాదేవ దేవాధినాథా భవానీమనోనాథ లోకత్రయాధార సర్వేశ్వరా శర్వ సర్వజ్ఞ సర్వాత్మకా నిర్వికల్పప్రభాఖర్వ దోర్గర్వదుర్వార సర్వంసహారథ వ్యోమకేశా దినేశాయుతస్వప్రకాశాధికభ్రాజితాడంబరా ! యీశా మహేశా వరప్రేర మాయాంధకారాతి ధీశా గిరీశా నిలింపానుకంపా సుధాగాంగసత్సంగగానప్రియా పంచవక్త్రప్రకాశా మహాదేవ పంచాక్షరీమంత్రనిష్ఠావది ష్టాహిభూషా మణివ్యక్త భక్తప్రియా నీమహత్త్వం బచింత్యం బనంతం బభేద్యం బనాద్యం బమేయం బజేయం బపారం బఘోరంబు చోద్యంబు నీపాటపద్మంబు లేదైవము ల్గానఁగానేర్తురే ముందు గోవిందుఁడుం బ్రహ్మదేవుండు నాద్యంతశోధక్రియాబుద్ధిఁ గ్రోడంబు హంసంబునై మేదినీమండలవ్యోమభాగంబులం జొచ్చి శోధింపఁగా విశ్వబాహుండవై విశ్వనేత్రుండవై విశ్వవక్త్రుండవై విశ్వదేహుండవై యెద్దియుం గానరానీక విశ్వంబునెల్లం బదాంగుష్ఠకోణంబునం ద్రొక్కి చెక్కన్న నీయొక్కచిత్రప్రభావంబు లేశంబునుం గానఁగాలేక యత్యంతచింతాభరక్రాంతి సంక్రామితస్వాంతులై యెద్దెసం గానఁగాలేక యుష్మత్కృపామేయమాయాంధకారంబులోఁ బ్రుంగుడై సంగడంబేది యన్యోన్యరూపంబులుం గానఁగాలేక శంభో శరణ్యా నమశ్శంకరా యాక్షరా యాక్షయాయ స్వభూ విశ్వకర్త్రే నమో విశ్వరూపాయ హర్త్రే నమో విశ్వహర్త్రే నమో విశ్వవిశ్వంభరాయ ప్రసిద్ధాయ ప్రభాభవ్యనవ్యస్వరూపాయ భీమాయ తుభ్యం నమః కాలకాలాయ కామప్రకామాయ కారుణ్యరూపాయ తుభ్యం నమో శిత్రివేషాయ నీహారశూకాణురేఖాతిసూక్ష్మప్రభాభావదివ్యస్వభావాయ తుభ్యం నమో ధూర్జటే నీలకంఠా త్రయీరక్షణా క్షీణకల్యాణమూర్తే నమో. దీవ్యత్కృపా యాతికోపాయ నిశ్శేషజన్మత్రయత్రాణలింగాయ దివ్యచ్ఛరచ్చంద్రకోటి ప్రకాశాంతరేశం గిరీశం మహేశం భజే నీలకంఠం భజే యన్నఁ బ్రత్యక్షదేవుండవై కాచి రక్షింపఁగా నేర్తు వెల్లప్డు నీవే భవత్తత్త్వ మెవ్వాఁడు గానన్సమర్థుండు మృత్యుంజయా నీప్రసాదంబునన్ జన్మ సాఫల్యమయ్యెన్ ధరా

హాయముతో యాభ్రసోమార్క వైశ్వానరాత్మాష్టమూర్తే కృపాసాంద్రనాగేంద్ర భూషోజ్జ్వలా మామకాభీష్టసిద్ధిల్ ప్రసాదించి రక్షింపు శ్రీవిశ్వనాథా నమస్తే నమస్తే నమః. 47

క. అని సంస్తుతించి పలికిన, విని సంతోషించి శివుఁడు విశ్వాధీశుం
డను నెద్ది యభీష్టము మీ, కెనయంగాఁ గోరుఁ డిత్తు నేవరమైనన్. 48

వ. అని సకలలోకాధీశ్వరుం డైనయీశ్వరుం డానతిచ్చినఁ బరమానందకందళిత హృదయారవిందు లై యవ్వైశ్యముసు లందఱుఁ బునఃపునః ప్రణామంబు లాచరించి నిటలతటఘటితకరకమలు లై నమస్క్రియాపురస్సరంబుగా నిట్లనిరి. 49

క. మాకులమువారి కెల్లను, నీకరుణయ కలుగనిమ్ము నిత్యస్థానం
బా కైలాసనివాసముఁ, జేకొను మావిన్నపంబు శివు)మె యభవా. 50

వ. అని యిట్లు వేఁడినవైశ్యర్షులం గాంచి మీరు ధర్మార్థకామంబులు కోరక మోక్షాపేక్షు లగుటకు సంతోషించితి నని కుబేరునిం గని వీరికి సాలోక్యసామీప్యం బొసంగితి వీరలం దోడ్కొని రజతశైలంబునకు రమ్మనిన నతండు వల్లె యని పుష్పకవిమానంబున నెక్కించుకొనిపోవ దానిందలంచి యాకర్షించి. 51

సీ. ఖచితమహారత్నకనకసౌధంబులు ధగధగద్ధగయని దనరి వెలుఁగ
దివ్యభూషణఘోషదివ్యకాంతానందఘనలసత్కంకణధ్వనులు సెలఁగ
ఘణఘణధ్వనిజుష్ట ఘంటోరుదుందుభిఘుమఘుమారావంబు ఘూర్ణముగను
పటునటత్కామినీపదమంజరీమణిఝణఝణత్కారపుంజములు మెఱయఁ

తే. బుష్పవర్షంబు గురిసెడు బుష్పకంబు
నందు వైశ్యులనెల్లను సమర నిలిపి
శివునికై లాసశిఖరికిఁ జిత్రగతులఁ
గొనుచు విచ్చేసె నాశ్చర్యఘోష మమర. 52

వ. అపుడు వైశ్యమునిసంఘంబులు పుత్త్రమిత్రకళత్రబాంధవులతో దివ్యదేహంబులు దాల్చి యప్పరమేశ్వరునిదివ్యశ్రీపాదంబులు గొలుచుచుఁ గైలాసంబున వసియించి రని సాలంకాయనమునీంద్రుఁ డానతిచ్చిన యవ్వైశ్యవరుల వివిధకథావృత్తాంతం బడుగుటయు. 53

చ. హరిహరపద్మగర్భచరణాంబుజలోలుపచంచరీకములో
ఖరకరతేజు లాశ్రితనికాయనిధానము లంబికామనో
హరకరుణావిరాజితులు యాచకపాలనకామధేనుని
ర్భరఘనదానబాలనగరప్రవరుల్ సువిచారు లిమ్మహిన్. 54

మాలిని. పరిభవగుణదూరుల్ భావజాకారసారుల్
నరవరజనమాన్యుల్ న్యాయవిజ్ఞానధన్యుల్
నరనుతపటుకీర్తుల్ నవ్యగంభీరమూర్తుల్
పరహితసమవశ్యుల్ వర్ణితాచారవైశ్యుల్. 55

గద్యము. ఇది శ్రీసరస్వతీచరణవిలాససరసీరుహనిష్యందమకరందసందోహమాధురీధురీణ మధుకరాయమానమానససరసకవితావిలాసవిభాసమాన భారతసౌభాగ్యభాగ్యోదయ బొల్లనాచార్యపుత్ర భాస్కరాచార్యనామధేయప్రణీతంబైన వైశ్యపురాణంబను మహాప్రబంధంబునందు బ్రహ్మదక్షిణవామోరువుల నేడునూటపదునలుగురు సతీయుక్తులై వైశ్యులు జనించుటయు వారలు బ్రహ్మపంపునఁ దపంబున కరుగుటయు మునిదర్శనంబును బంచాక్షరీమంత్రోపదేశంబును నీశ్వరానుగ్రహంబును గైలాసంబున కరుగుటయు ననుకథం గల ద్వితీయాశ్వాసము.

శ్రీగణేశాయ నమః.

శ్రీశారదాంబాయై నమః.

# శ్రీవైశ్యపురాణము

## తృతీయాశ్వాసము.



రజతాద్రీశపదాం
భోరుహమదచంచరీకముఖ్యులు కరుణాం
భోరాసు లార్యు లనఘులు
నారాయణసుతులు బాలనగరప్రాభుల్. 1

వ. ఏకచిత్తంబున నాకర్ణింపు మని సాలంకాయనమునీశ్వరుం డవ్వైశ్యఋషుల కిట్లనియె, న ట్లమ్మహాదేవుండు వారలఁ గైలాసంబున నుంచుం డనిన వారద్దేవుని దివ్యచరణధ్యానపరాయణు లగుచు మందారవనసమూహమధ్యస్థలంబులను జంద్రకాంతశిలానికేతనస్థానంబులను సురాపగాతటనికటసైకతస్థలంబులను నిరంతరవృత్తిఁ జరించుచు దేవమునిగంధర్వసిద్ధవిద్యాధరాదిమహాప్రమథవరులతోడ సఖ్యంబులొనర్చుచుఁ బుత్రపౌత్రకళత్రయుతులై యుండి రిట్లు బహుసహస్రాబ్దంబులు చనిన యనంతరంబున నొక్కనాఁడు. 2

సీ. చిత్రకంఠుం డనఁ జెలువారుగంధర్వుఁ డభవుని సేవింప నరుగుచుండి
సోమకాంతాఖ్యవైశ్యునిపుత్త్రిఁ ద్రిభువనకీర్తనీయచరిత్రఁ గీర్తికన్యఁ
బథమునఁ గనుఁగొని పంచాస్త్రపంచాస్త్రనిర్భిన్నహృదయుఁడై నేర్పు దక్కి
తమకంబుతోడ నత్తరలాక్షి వెంటనె ధామంబునకు నేగి దానితల్లి

తే. దండ్రులను గాంచి తనయాప్సితంబు చెప్పి, కన్య నిమ్మన్న వారు నాఖచరవరుని
యాత్మ నొప్పింపఁజాలక యాప్తులకును, జెప్పి యిచ్చెద మనియాశఁ ద్రిప్పి రతని.

గీ. ఇట్లు త్రిప్పిత్రిప్పి యేచి యవ్వైశ్యుండు, ఖచరనాథుఁ జూచి కన్యనీయఁ
గూడ దరుగు మనిన గురుతరక్రోధర,క్తాక్షుఁ డగుచు నప్పు డాతఁ డనియె. 4

గీ. ఓరి పాపకర్మ యూరుజాధమ నీవు, నిన్నుఁ గూడుబంధునిచయములును
గాలుఁ దుర్గ్రి జేగి కన్నతో నొక్కరా,జన్మకతన ననుచు శాపమిచ్చె. 5

క. శాపదిభూన్నొంది యాతఁడు, కోపాటోపమున నోరి గుణహీన దురా
లాపము లఱచితి వీ వాభూపాలుఁడ వై జనింపు భూలోకమునన్. 6

వ. అని యవ్వైశ్యవరుండు మఱియు నిట్లనియె, నిక్కన్యకనిమిత్తంబు భూలోకంబున రాజవై పుట్టి వైశ్యులశాపంబునం బొలయు మని ప్రతిశాపం బిచ్చె నంత గొంతకాలంబునకుఁ బరమేశ్వరుండు గౌరీకళ్యాణం బవధరించె నాసమయంబున.

ఉ. శ్రీనుతవజ్రరత్నమణిచిత్రసువస్తువు లెల్ల నాదిగాఁ
గానుక లర్థిఁ దెచ్చి శుభకారణవైభవ మొప్పఁ జేయుచు
న్మానుగఁ గొల్చియున్న జనమాన్యుల నొక్కొకలోకవాసులం
బూని కటాక్షదృష్టిఁ బరిపూర్ణులఁ జేసి యనంతరంబునన్. 8

చ. నిరతము సేవచేయుచును నిశ్చలుఁ డైనకుబేరుఁ జూచి యా
పరుస సమస్తలోకములవారు నుపాయనదత్తహస్తులై
కర మనురక్తిఁ గొల్చి నిజకార్యఫలాఢ్యతఁ బొంది పేచనన్
ధరణిజనంబు లిట్లు భుజదర్ప మెలర్పఁగ రా రదేటికో. 9

వ. అని యానతిచ్చినం గుబేరుం డిట్లనియె. 10

క. గురుతరకాంచనవాహన, వరమణివాసోవిశేషవస్తువిశేషా
స్థిరమతిమంతులు వైశ్యులు, ధరణీస్థలి నెందు లేరు తరుణేందుధరా. 11

గీ. మిమ్ము మెచ్చఁ గొల్చి మీపాదపద్మంబు, లమర సేవఁ జేసి యమరు లగుచు
ఘనవచస్సమృద్ధిఁ గైలాసవాసులై, యున్నవారు వైశ్యు లుర్వి లేరు. 12

వ. అని విన్నవించిన నప్పరమేశ్వరుండు నిజవివాహోచిత సమస్తవస్తుపరికరంబు లొనఁగూర్చుచున్నయవ్వైశ్యబుధులం జూచి యథోచితంబుగా ననుగ్రహించి నానామణివాహనవస్తువితానపరీక్షాశూన్యం బై బూలోకం బున్నది గావున మీ రచ్చటికిం జని సుఖంబుండవలయు నని యానతిచ్చిన. 13

గీ. అట్ల కాక యనుచు నత్యంతభక్తితో, నలరి వైశ్యవర్యు లర్థితోడ
శంభుపాదములకు సాష్టాంగనమ్రులై, విన్నవించి రధికవినయ మెసఁగ. 14

చ. తరుణశశాంకశేఖర! విధాతృముఖామరరాజరాజికిం
దిరముగఁ జేరరానిభవదీయపదాంబుజయుగ్మసేవ మా
కిరవుగ నిచ్చినాఁడవు మహేశ్వర ధాత్రిఁ జరింప నేర్తుమే
సురతరుపుష్పగుచ్ఛముల సొక్కినతేఁటికి జిల్లెడేటికిన్. 15

వ. అని విన్నవించిన వైశ్యబుధుల కంబికామనోహరుండు నగి యిట్లనియె మున్ను మీకరవిందభవుండు సెప్పినరహస్యప్రకారంబునను గంధర్వునిశాపంబునను వచ్చిన కీడు మేలగు మదీయస్థానంబున నుండుటం జేసి మీవెంబడి వచ్చి నగరేశ్వరుండనై యుండెద నిందుకు సందియంబు లేదు నమ్ముం డని మఱియు నిట్లనియె. 16

గీ. భక్తులెచట నున్న బద్ధానురక్తితో, నచట మేము నుందు మహా[illegible]
గాన మీరు ధరకుఁ గమనీయగతి నేగి, మహితభక్తియుక్తి మనఁడు మిగుల. 17

సీ. భూమండలంబునఁ బుణ్యాలయం బైనశుద్ధదేశంబున నొంపుదనరఁ
బురములు నిర్మించి వరరత్నహాటక వివిధగేహంబుల విశ్రమించి
వాణిజ్యకృషివృద్ధి వర్యగోరక్షణ జీవనభంగులఁ జెన్ను మిగిలి
సంతతవిశ్రాణసంపత్ప్రదావాస బహువైభవంబులఁ బ్రబలు లగుచు
తే. మమ్ము భక్తిని సేవించి మనుఁడు మీరు, నగరులను పేరధాత్రిలో నెగడుఁ జెలమి
మేము నగరేశ్వరఖ్యాతి మించి మిమ్ము, ఘనతఁ బాలింతు మేవేళఁ గరుణతోడ.

వ. అనుచు నప్పరమేశ్వరుండు పుణ్యస్థానసిర్ణయంబునకుఁ బరమేష్టియు సకలవస్తు
నిర్మాణంబునకు విశ్వకర్మయు నిఖిలధర్మవ్యవహారార్థంబులకు ధనదుండును మీకు
సహాయం బగునట్లు చేసెదము, మీరు నందికేశ్వరుకర్ణరంధ్ర మార్గంబునం బ్రవేశించి
వెడలి భూలోకంబునకుం జనుం డని యానతిచ్చిన వైశ్యవరు లప్పుడు. 19

## వైశ్యవరులు భూలోకంబున కరుగుదెంచుట.

క. గోకర్ణరంధ్రపథమున, గోకర్ణాభరణునాజ్ఞఁ గువలయమునకున్
గోకర్ణజు లటు గదరి, గోకర్ణేశుండు బ్రహ్మఁ గూర్మిం బలికెన్.

గీ. నీవు నిత్యమహిమ నిపుణత్వమున మించి, విశ్వకర్మ ధనదవిభులు గొలువఁ
బుష్పకంబు నెక్కి పొలుపార వైశ్యుల, భువికిఁ గొనుచుఁ జనుము బుధులు పొగడ.

వ. అనిన బ్రహ్మదేవుండు మహాప్రసాదం బని తదాజ్ఞావిశేషంబున. 22

సీ. మహితహాటకరత్న మహనీయకుట్టిమ ప్రాకారతోరణ ప్రబల మగుచు
వజ్రగోమేధిక వైడూర్యమణిసిల ముక్తాఫలశ్రీసమూహ మగుచు
వివిధాద్భుతాపాదివిపులవాతాయన ఘనకుటీసౌందర్యకలిత మగుచు
సంగీతశృంగారసంగరంగోజ్జ్వల కాంచన మయరత్నకలిత మగుచు.
తే. మహిమచే మించి దేదీప్యమాన మగుచు, నున్నపుష్పక మందున్నయా[illegible]
నిలుపుకొని వచ్చి ధాత్రికి నీరజాత, భవుఁడుఁ దత్కర్తయు నర్థపతియుఁ గొలువ.

## పర్వతద్వీపనదీనదవిస్తారవర్ణనము.

మ. ఇలలో నేఁబదియాఱుదేశములలో నేపారునంధ్రస్థలిం
జెలువొందు న్నవఖండసారము మహాశ్రీగౌతమీవాహినీ
ఫలితానేకపదార్థభూమి ఘరఁగుం బ్రాగ్వారిభాగంబునన్
జలధిప్రాంతమునందు నొక్కసరసీసారంబు తీరంబునన్. 24

వ. పుష్పకంబు డిగ్గి భారతీవల్లభుండును విశ్వక[illegible]
లును నత్యంతకుతూహలస్వాంతులై పదాఱవవన్నెపసిఁడి [illegible]

బిసకిసలయస్థలీరభసంబు లగుహంసంబులు పద్మినీకుచద్వయప్రాయంబు లగు చక్రవాకంబులును మహాజలచరంబు లగుమకరంబులును బరిభ్రమణవిభ్రాజితచ్ఛవిజీవితంబు లగురాజీవంబులుం గలిగి చెవుల కింపగు చెలువు గావింప నింపొసవు నక్కొలనివలన వివిధాశ్చర్యంబులు గనుంగొనుచుఁ దన్మధ్యస్థలంబున. 25

చ. కమలిని నేకనాళమునఁ గాంచనదీధితు లుల్లసిల్లుచు
న్విమలము లైనపుష్పములు వేడ్కఁ ద్రయంబటు గానవచ్చినం
దమకము నొంది చిత్త మని తద్వణిగన్వయనాథు లబ్బునం
గమలజ యీవిధం బయినకారణ మే మిది యానతీఁదగున్. 26

వ. అని పరమేష్ఠిని పితామహుం డడిగె ననినవిని యబ్బాలనగరంబువారలు సాలంకాయనమహామునీంద్రున కిట్లనిరి. మహాత్మా! యిమ్మహాహ్రదం బేమునీశ్వరతపఃప్రభావంబున నగాధోదకంబును నతివిస్తీర్ణంబును నత్యద్భుతంబును నయ్యె నది యట్లుండఁగాక మాపూర్వులు కైలాసంబునుండి భూలోకంబునకు వచ్చి రనియానతిచ్చితిరి. కైలాసంబు లెన్ని యేయేభూధరంబులు గనుంగొనిరి. భాగీరథీప్రవాహంబు లెన్ని. నగంబులలో నేనగంబునకుఁ బర్వతరాజనామధేయంబు గలిగె నీసందేహంబు దొలంగ నానతీవలయు నని యడిగిన వారల కమ్మునివరుండు చెప్పందొడంగె. భూలోకంబునకు ముప్పదిరెండుకోట్ల యోజనంబులపొడవు పరాత్పరుండగు శివుండు వసియించుకైలాసంబు కర్బురనగంబుమీఁదను ద్రిమూర్తులపురంబులలో నొక్కటి కైలాసంబు మేరువునకుఁ బశ్చిమంబునఁ గైలాసం బనం బరంగిన దొక్కటియు నీతెఱంగున మూఁడుకైలాసంబులు గలవు. భాగీరథీనదులు సహస్రంబులు బ్రహ్మలోకంబున నుండి సితకేసరకుధరంబునకు లంఘించి యచ్చటనుండి గంధమాదనపర్వతంబుపైంబడి యిలావృతకింపురుషవర్షంబుల కెడగల్గి భద్రాశ్వవర్షంబునకు వచ్చి హిమవత్పర్వతవిదారణం బొనరించి యచ్చట మోక్షద్వారం బనం బ్రఖ్యాతిం గాంచి దక్షిణముఖం బై వరణ అసి సరయువు లనునదుల నతిక్రమించి వచ్చి యమునాసరస్వతీపుణ్యనదులం గలిసి త్రివేణీసంగమం బనం బరఁగి యచ్చటనుండి తూర్పుజలనిధిని సహస్రముఖంబులై కలసిన భాగీరథీప్రవాహమహిమం బిది యని వినిపించిన వారును మహానందభరితులై పుణ్యకుధరంబు లానతిం డనిన వినుండని మునిచెప్పందొడంగె. ప్రాక్పశ్చిమసముద్రంబుల నంటి లక్షయోజనంబులనిడుపు గలిగి సపాదలక్షకుధరంబులలో పేరుపడి నెగడినట్టి హిమవన్నగంబును నిషధమహీంధ్రంబును వింధ్యభూధరంబును మాల్యవంతంబును బారియాత్రంబును గంధమాదనంబును హేమకూటంబు ననంబడుసప్తకులపర్వతంబులును దధిక్షీరజలనిధిమధ్యంబున మానసోత్తరం బనుకుధరంబుమీఁద నింద్రాగ్నియమనైరృతి వరుణవాయుకుబేరేశానపురంబులు గలవు. మేరువున కూర్ధ్వభాగఁ

బున నధోభాగంబునఁ బదునాలుగులోకంబులు నుండు నీధరణీధరంబులలో మేరువు సమధికంబు. వీనియావల నన్నింటి నాక్రమించినచక్రవాళపర్వతంబు గలదు. వీనియన్నిటియందు హిమవంతంబు ప్రఖ్యాతిగాంచె ననిన విని యమ్మహా మునిశేఖరునకు బాలనగరంబు లిట్లనిరి. హిమవన్నగంబున కేమినిమిత్తంబున నాధిక్యంబు గలిగె ననిన వారలకు నమ్ముని యిట్లనియె. తుహినభూధరంబు దేవకార్యంబునకు హితంబాచరించెఁ గావున ఖ్యాతివహించె ననిన విని యాకథ యానతీవలయు ననిన నమ్ముని వారల కిట్లనియె.

## హిమవత్పర్వతమహిమానువర్ణనము.

మ. కలఁడత్యుత్తముఁ డుత్తరక్షితి దెసం గైలాసవాసోన్నతుం
డలఘూద్యద్గుణదేవతాత్ముఁ డగునీహారాచలాధీశ్వరుం
డలరుం ధాత్రికి మానదండ మనఁగా నవ్యాహతఖ్యాతిసొం
పులఁ బూర్వాపరసంధిసింధుల మహాపూర్ణాంగుఁడై యెప్పుడున్. 28

క. అతిశయరత్నోత్పత్తికి, దతిశం దగునతనిసొంపు దనరంగ హిమం
బతిశయ మగుసౌందవకళ, లక్షణ మలరం గరంగి లఘువగుభంగిన్. 29

క. ధరఁ దాల్పఁజాలు ననియును, గరముగ యజ్ఞాంగవస్తుకారణ మనియుం
బరికించి శైలరాజ్యము, నరుదుగ యజ్ఞాంగఫలము నబ్జజుఁ డిచ్చెన్. 30

మ. హిమవంతుం డచలేశ్వరుం డగుమహోవ్యాదోన్నత.ప్రౌఢితో
సుమహత్త్వప్రతిభాస్వభావమహితస్ఫూర్తిప్రతాపప్రభా
సమజాసిద్ధవిహారకందరకుటీసర్వౌషధీకల్పక
ద్రుమకాధస్థితకామధేనుకనకోరుస్వర్ణశ్రేణిచేన్. 31

శా. కాంతారత్నము భక్తవత్సల జగత్కల్యాణి రుద్రాణి వే
దాంతార్థస్ఫురితత్త్వనిశ్చితకృపావ్యాసంగచిత్తాబ్జ నే
కాంతస్థానమున న్మహానియతుఁడై యాత్మప్రజాప్రార్థన
స్వాంతుండై మదిలోఁ దలంచుచుఁ దపోవర్ధిష్ణుఁ డైనంతటన్. 32

## పార్వతీపరమేశ్వరులు తపంబు సలుపుట.

క. లీలన్ హిమగిరినాయకు, పాలిటఁ గృపగల్గి పాలపాపయుఁబోలెన్
మేలై శర్వాణి నవీ, నాలసగతితోఁ బ్రసన్న యయ్యెం గడఁకన్. 33

వ. అంత నప్పార్వతియు లబ్ధోదయయై చంద్రరేఖయుంబోలె దినదినప్రవర్ధమాన యగుచు సిద్ధసాధ్యనికాయంబులు గొలువఁ జెలఁగు మిగిలియున్నసమయంబున.

చ. తొడుగనిభూషణంబు తనుతుష్టికి సమ్మదకారణంబు సొం
పడరెడు చిత్తజాత కలితాపఘనప్రసవంబు మేలుసం

పడ మగు మార్దవంబు కృతభావవిధానమనోజ్ఞభంగితో
బెడఁగగు జవ్వనంబు దగు పెంపునఁ బార్వతి యుండె నింపుగాన్. 35

చ. వినుతవిశేషమై తగినవీథుల నిర్ఝరకేళిఁ దేలుచున్
ఘనమృగనాభిగంధములఁ గమ్మనిగాడ్పులు చల్ల చల్లనై
చనరిన శైలరాజసుత ధామమహాస్థలియందుఁ దన్నుఁదాఁ
గనుఁగొను వేడ్కఁ నందె శితికంఠుఁ డుపక్రమవిక్రమోన్నతిక్కిన్. 36

వ. తదనంతరంబ పరమజ్ఞానవంతుం డగుహిమవంతుండు సఖీసమేత యగు నప్పార్వతిని బరమేశ్వరునకు శుశ్రూషావిశేషంబు లొనరింప నియోగించిన సంతోషితస్వాంత యగుచు ననేకప్రకారభయభక్తియుక్తహృదయారవింద యై యమ్మహాదేవు నుపచరించు చున్న సమయంబున.

ఉ. తారకదానవుండు భుజదర్ప మెలర్ప జగత్త్రయంబు సం
హారము సేయఁబూనినభయంబున బెగ్గిరి యింద్రముఖ్య బృం
దారకు లబ్జసంభవుని డగ్గఱి మ్రొక్కుచు సంస్తుతించి వి
స్తారనిజోగ్రబాధలు పదంపడి సర్వము విన్నవించినన్. 38

వ. వినిపద్మాసనుండును బద్మామనోహరుని మనంబున నిలుపుకొని యాదానవుండు షణ్ముఖునిచేతం గాని హతుండు గాఁడని దివ్యదృష్టి నెఱింగి వారల కిట్లనియె.

క. హరునకు శైలతనూజకుఁ, బరువడి జన్మించునతని బాహాటోప
స్ఫురణం దారకుఁ డడఁగును, మరుచేఁ దద్యోగవిధము మానుగఁ గల్గున్. 40

వ. అని కమలగర్భుం డానతిచ్చిన విని సర్వదేవతాసహితుండై యాఖండలుండు నిజపురంబున కరుగుదెంచి యప్సరోగణంబులు గొలువ సుఖాసీనుండై పేరోలగం బుండి సురాచార్యు రావించి యతనికిఁ దమవృత్తాంతం బెఱింగించినవాఁడై సుమశరు రావించిన. 41

## మన్మథుఁడు శివతపోభంగంబునకై వచ్చుట.

ఆ. చిలుక తేజి నెక్కి చెఱకుసింగిణి పుష్ప, శరధి సంధిలంగ సరసగతుల
రతివసంతు లలర రభసంబు పెంపున, మనసిజుండు వచ్చె మహిమ మెఱయ. 42

క. వచ్చిన సురపతిఁ గనుఁగొని, యచ్చపుఁగృపతోడఁ జూచి యర్ధాసన మీ
వచ్చిన మ్రొక్కుడు నతఁడుం, జెచ్చెర నేకాంత మాడఁ జేరుచు బలికెన్. 43

మ. త్రిదశాధీశ్వర జంభభంజన భవద్దివ్యత్పదాంభోజము
ల్ముదమందం గనుఁగొంటి నంచితకృపాముఖ్యుండ నై మించితి
న్మది నూహించినకార్య మెద్ది నను నేమాడ్కిం దలంపయ్యెనో
యిదె కొల్వం బనివింటిఁ జేతు నిఁక నే నేయూనతైనం దగన్. 44

క. నీపదము గోరి యెవ్వఁడు, తాపసుఁడై నియతభంగిఁ దప మొనరించుం
గోపప్రస్ఫురితాధర, కోపనలం బట్టి వారిఁ గ్రొవ్వడఁగింతున్. 45

మ. తగుసీనిత్యకృపావిశేషమహిమన్ ధన్యుండ నా కెప్పుడీ
జగతిన్ సాటివసంతుఁ డొక్కసఖుఁడుం జాలు న్సహాయంబుగా
నొగిఁ బుష్పాస్త్రము లిక్షుచాపమును నేనున్ జృంభణం బూర్చి వే
తెగి తూలింతుఁ బినాకితాల్మియును నాసీప్తుల్ ప్రకాశింపఁగాన్. 46

క. అనునామన్మథుపల్కులు, విని మనమున సంతసిల్లి వేగ సుమాయు
క్తునిఁగా నప్పరమేశ్వరు, నని సాధింపుము మవర్థ మని హర పలుకెన్. 47

గీ. అట్లుకాక యనుచు నాజ్ఞావిశేషంబు
శిరమునందుఁ దాల్చి చెలువు పసరఁ
గణఁగి కొంతమేర కినుకతోఁ జనఁజన
మతి గలంగుచు రతి మదను కనియె.

శా. జిష్ణుం డానతి యిచ్చె నంచు మదిలోఁ జింతింప కిట్లేగిన
న్విష్ణుప్రీతియుఁ గాదు పుష్పశరముల్ క్ష్వేళాగ్ని భక్షాతివ
ర్ధిష్ణుం డైన మహేశు నొంపఁ గలవా ధీశక్తి నూహించి తే
యుష్ణీషంబునఁ గట్టవచ్చునె మదప్రౌఢోగ్ర వేదండమున్. 49

వ. అని యనేకభంగుల వాచాకౌశలంబున మరుండు జయంబు గోరి నయంబుగా బల్కిన నారతిపలుకులు చులుకనగాఁ దలంచి కినుకవోడమిన మనంబున వినక తనపతి కార్యంబు నిశ్చయంబుగా నవలంబింపవలయు నని యెట్టకేలకు నొడంబడఁబలికి వసంతుం జూచి మనబలంబుల సన్నాహం బొనరించి శుకస్యందనం బతిత్వరిత గతిం దెమ్మనిన నట్లచేయుచు నతనుండు విజృంభించుసమయంబున. 50

మ. పగిలెం దాపసధైర్యదుర్గములు కంపంబందెఁ బాంథావళుల్
వగలం దూలె వియోగిసీజనమనోవర్ధిష్ణువర్గంబు వే
చిగురెత్తెన్ హిమశైలనాయకవనశ్రేణీతతుల్ మిక్కిలిన్
దిగులొందెం జెదరెం గలంగెఁ దగఁ దన్వీపూరుషస్వాంతముల్ 51

వ. అని సాలంకాయనముని యానతిచ్చిన తరువాతివృత్తాంతం బెట్టయ్యె నని వైశ్యఋషు లడుగుటయుం.

ఉ. సామజవైరివిక్రములు సంపదుదంచితరాజరాడ్గృహ
శ్రీమహిమాభిరామధనశీలురు పండితవర్గపాలకుల్
స్వామిజనార్దనాంఘ్రిపదసారసమత్త మధువ్రతంబు లా
శామహనీయకీర్తిఘను లర్యులు వైశ్యవరేణ్యు లిమ్మహిన్. 53

మాలిని. మధురమృదులవాచామంజుల శ్రీవిచారుల్
బుధనుతగుణశీలుల్ పూర్ణసంపత్ప్రకారుల్
మధురిపుపదభక్తుల్ మంళాచారసక్తుల్
విధురుచిదరహాసుల్ వేశ్య పెన్గొండవాసుల్. ౫౧

గద్య. ఇది శ్రీసరస్వతీచరణ సరసీరుహమకరందనిష్యంద సందోహమాధురీధురీణమధు
కరాయమానమానసరసకవితావిలాసబొల్లనాచార్యపుత్రభాస్కరాచార్యనామధేయ
ప్రణీతం బైన వైశ్యపురాణంబునందు శివునికటాక్షంబున వైశ్యులు కైలాసంబున
సంచరించుటయుఁ జిత్రకేతుం డనుగంధర్వుండు వైశ్యులశపించుటయు వైశ్యు
లతనికిఁ బ్రతిశాపం బిచ్చుటయు వైశ్యులు భూలోకంబున కరుగుదెంచుటయుఁ
బర్వతద్వీపనదీనదవిస్తారవర్ణనంబును హిమశైలోత్కర్షయుఁ బార్వతీపరమేశ్వరుల
తపోమహిమయుఁ దారకాసురబాధాకథనంబును మదనుండు పరమేశుతపంబు
చెఱచుటకై వచ్చుటయు ననుకథలం గలది తృతీయాశ్వాసము.

శ్రీగణేశాయ నమః.

శ్రీశారదాంబాయై నమః.

# శ్రీవైశ్యపురాణము.

## చతుర్థాశ్వాసము.



క. రామామణిహృదయాం
భోరుహభాసురమురారిభూనుతపాద
శ్రీరాజవరులు లోల
న్నారీమన్మథులు బాలనగరప్రవరుల్. 1

వ. ఆకర్ణింపుఁడు సాలంకాయనమునీంద్రుండు వైశ్యఋషుల కిట్లని చెప్పెను. 2

ఉ. అర్యమవర్యు లిట్లనుచు నామునితోడను బల్కి రామహా
ధైర్యమహార్యగహ్వరముదగ్రతపం జని యంత మాఱుఁ డే
కార్య మొనర్చె వేగ వినఁగావలె నానతియి మ్మటన్నఁ జా
తుర్యము మీఱఁ బల్కెను కుతూహలవృత్తిని దేనె లొల్కఁగన్. 3

క. వినుఁ డని పల్కెను మారుం, డనుమానము మనములోన నత్యద్భుతమై
పెనుచుచు ముప్పిరిగొనఁగాఁ, జని గౌరీభర్తు లున్నచక్కికిఁ జెలువన్. 4

ఉ. విద్రుతపత్రసత్త్వవనవీథిఁ గనుంగొనె భర్గు దేవదా
రుద్రుమవేదికన్ భయదరూపమృగాజినచర్మవాసుసన్
రౌద్రభుజంగరాడ్వలయరమ్యకపర్దుఁ ద్రినేత్రశోభితున్
భద్రసముద్ర యోగజయభాస్వరముద్రుని సాంద్రరుద్రునిన్. 5

వ. అంత నక్కాంతుండు సంతోషితస్వాంతుండు గాక బిట్టులికిపడి నట్టేటఁ బుట్టి
మునింగినభంగి నిట్టట్టు తొలంగరాక కట్టెదుట నున్నముక్కంటికి జక్కటిచాయ
నుండనోపక యోసరిల్లి యుల్లంబు జల్లనఁ గరపల్లవంబులు చల్లనై సొంపొదవు
పొదరిండ్లఁ దూఱి సేవచేరు సమయంబున నంబికయుఁ బంబినవేడ్కఁ త్ర్యంబ
కునకంబుజంబుల నభిరామంబగుదామంబు సమర్పించుసమయంబున. 6

క. ఆసందునఁ బుష్పాస్త్రము, వే సూటిగ నాటఁ జెఱకువింటను దంటై
భాసురగతి శివుధైర్యము, నాసించి మనోజుఁ డేసె నద్భుతభంగిన్ 7

వ. అప్పుడు. 8

గీ. శివుడు గిరిజమోము చెలువంబుఁ దగఁ జూచె, శివుని శివయుఁ జూచి సిగ్గువడఁగ
హరుఁడు నటకుమున్న నాత్మసత్త్వంబును, దాల్మి నూలుకొలిపెఁ దక్షణంబ. 9

వ. శివుండాతపోవిఘ్నకారణం బెఱింగి యత్యుగ్రకోపంబున. 10

## మన్మథుఁ డీశ్వరునిచే దహింపఁబడుట.

లయగ్రాహి.—

ఫాలశిఖిలోచనపుజ్వాలలు రయంబున విశాలముగమిణుఁగుఱులురాలిదివిఁగ్రాలన్
గీలువడి తొట్టి లయకాలపుమహాశనులు ప్రేలిపడి తాఁకుగతి జాలి దనుదాఁకన్
గాలి మరుఁ డంతటను గోటపడి దేవతలు కాలగళ కాలహర చాలు శరణన్నన్
తూలగతి నాపదను దూలుచు మహాభయతఁ దేలి రతిచుట్టుకొని సోలిధరఁగూలెన్.

క. హరుఁడు న్నంతట నంది,శ్వరభృంగిరిటప్రముఖ్యసర్వగణంబుల్
వరజయఘోషము లులియఁగ, గరముగఁ గైలాసగిరికిఁ గడఁకం జనియెన్. 12

వ. అంతటఁ గొంతతడవున కారతీకాంత చింతాక్రాంత యగునవసరంబున వసంతుండు
దెలిపినఁ దెలిసి గద్గదస్వరంబున. 13

క. చిలుకలరథమును జెలువగు,వలపమ్ములుఁ జెఱకువిల్లు నళిసిగుణమున్
జలమునఁ బ్రోగై గ్రాఁగిన, బలుపగుభస్మంబుఁ జూచి పడఁతుక పలికెన్. 14

## రతీదేవివిలాపించుట.

క. శైవద్రోహము చేసిన, నేవలనఁ బ్రమాద మగుట యెఱుఁగుదు వెఱిఁ గా
కావనిదివిజులమాటలు, భావంబునఁ బట్టి యిట్టిపాపం బయ్యెన్. 15

వ. అనుచు ననేకప్రకారంబుల శోకాయత్తచిత్తయై కొంతతడవునను దీనానన
యగుచు నమ్మహానుభావు నుద్దేశించి యిట్లనియె. 16

క. కరుణాకర శివ శంకర, శరణాగతరక్షణాంక శరణము శరణం
బరుదుగ ద్రోహము చేసితి, మఱియున్ శమియించు రోషమంతయుఁ బెలుచన్.

క. హర గంగాధర కరుణా,కర కైలాసేంద్ర వైరిఖండన భక్తా
గ్రరసికరక్షణ కల్మష,హర సురవినుత దయఁ బ్రోవు మభవ పురారీ. 18

వ. అని వినుతించుచు దుఃఖార్ణవమగ్నయై యున్నరతి కాకాశవాణి యిట్లనియె. 19

గీ. భర్గుకోపభంగిఁ బొట్టిల్లె నింతయు, దుఃఖము డుగు మింత తూలనేల
ఘనుఁడు శివుఁడు వేగ మనసిజు బ్రదికింప, వచ్చువాఁడు నమ్ము వనజనయన. 20

వ. అనిన రతీకాంత శోకంబుడిగి తదేకనిష్ఠాగరిష్ఠయై శివునిరాక కెదురుచూచుచున్న సమయంబున, 21

క. వనజభవుం డింద్రుండును, మనసిజసతినుతికి మౌనిమండలి గొలువన్
గనికరమున వే శర్వుఁడు, వనితామణికడకు వచ్చె వాత్సల్యమునన్. 22

వ. ఇట్లువచ్చినశివుం గనుంగొని ప్రణమిల్లి దీన యగుచు నుతియించి రతీదేవియమ్మహాత్మున కిట్లనియె. 23

క. ఆచక్రవాళమధ్యధ, రాచక్రములోన భర్గ రక్షించు పతిన్,
ఖేచరు లెంచగ నీకును, నాచంద్రార్కముగఁ గీర్తి యలరున్ ధాత్రిన్. 24

వ. మఱియును శర్వ సర్వజ్ఞ సర్వేశ్వరా త్రిపురాంతకా యని యనేకవిధంబుల స్తుతియించిన రతీదేవిని గరుణించి శివుం డిట్లనియె. 25

గీ. ఏడ్వకేడ్వ కబల యీ రేడుజగముల, వినుతి కేను మెచ్చి మునులఁ గూడి
వచ్చినాఁడ నిప్పు డిచ్చెద నీప్రాణ, నాయకునకు నాయు వాయతముగ. 26

## ఈశ్వరానుగ్రహంబున మన్మథుండు జీవించుట.

వ. అని మఱియును. 27

చ. హరుఁడు కృపావిశేషమహిమాస్పదుఁడై సురరాజరాజవా
క్పరిణతచిత్తవృత్తిపరిపాటి మనోజుఁ బ్రతిష్ఠ సేసి సొం
పరుదుగఁ బ్రాణవంతునిగ నద్భుతసత్వసమేతుఁగాగ నిం
పరుదుగ సర్వమాన్యునిగ నర్థిగఁ బాలన చేసి నిల్పినన్. 28

గీ. చిలుకరథము నెక్కి చెఱకుసింగిణిఁ బువ్వు, శరములు ధరియించి చతురగతుల
రతివసంతు లలర రమణమై వర్ధిల్ల, శివపదాబ్జయుగముఁ జేరి మ్రొక్కె. 29

వ. నిలిచిన వారిం గనుంగొని కరుణాయత్తచిత్తుండై మన్మథుని దీర్ఘాయుష్మంతుగా ననుగ్రహించి శివుం డంతర్ధానంబు చేసె నని సాలంకాయనముని వైశ్యబుషులకుం జెప్పిన విని వారలు వందనంబు లాచరించి యవ్వలికథ యొఱింగింపు మనిన వారల కమ్మునివరుం డిట్లనియె. 30

క. మదనునిచేతకు నప్పుడు, మదనారాతియుఁ గలంగి మౌనినివహముల్
ముదమందఁగఁ గైలాసము, సదనమునకుఁ జేరి మిగులఁ జలచిత్తుండై. 31

గీ. అమ్మహాదేవుఁ డారీతి నరిగినపుడు
మంచుగుబ్బలికూఁతురు మదిఁ గలంగి
చెలులఁ గికురించి తిరుగంగఁ దెలియరైరి
తెలియలేకున్న వారు నద్దేవిఁ జూచి,

## పార్వతి తపం బాచరించుట.

వ. ఆమ్మహాదేవి తలిదండ్రులు ననుపెంచినం గని నిజవాంఛితం బెఱింగించి వారియను
మతంబున సఖీసహితయై వనంబున కరిగి ఘోరం బగుతపంబు సేయుచున్నఁ బెద్ద
కాలంబునకు నీశ్వరుండు ప్రసన్నుండై రూపాంతరంబు దాల్చి. 33

సీ. బంగారుతీఁగెలు బాగుగాఁ బెనిచిన ముప్పిరిగొని యొప్పుముంజిఁ జుట్టి
చెంగావిసుసెంపు శృంగార మలరిన నట్టికాపీనంబు కడఁకఁ జుట్టి
దగదగ యనిమించి దట్టమైతనరిన పసిఁడిజందెము క్రొత్తబాగు దనర
నమితతేజస్ఫూర్తినధికమై వెలసిన కృష్ణాజినము మేనఁ గీలుకొనఁగ
తే. భూతిరుద్రాక్షలు దరించి పొలుపు మిగులఁ, జారుదండకమండలుధారి యగుచు,
గపటవటువేషభావంబుగడలుకొనఁగ, శంకరుఁడు వచ్చెమిగుల నాశ్చర్య మెసఁగ.

క. వచ్చినఁ గనుఁగొని పార్వతి, యచ్చపుభయభక్తు లలర నర్ఘ్యాదివిధుల్
చెచ్చెర నొనరించిన మది, మెచ్చుచు నట విశ్రమించి మెల్లనఁ బలికెన్. 35

గీ. తగినపురుషుఁ గూర్చి తప మొనర్చెదవేని, దగును దపము సేకుఁ దథ్య మరయఁ
దృణము వెదకఁ జనరు మణులనె వెదకుదు, రనఁగ జగతి వినవె యబలనీవు. 36

క. తరుణీ మృదులశరీరవు, భర మగు నతిఘోరతపము భామలకేలా
వరయౌవనసమయంబునఁ, గరమున భోగించుకంటెఁ గలవే తపముల్. 37

వ. అనిచెప్పిన వటువునకు గిరిజ యిట్లనియె. 38

గీ. తపము చేయకున్నఁ దగినట్టిపురుషుండు, గలుగునే సతులకు ఘనమునీంద్ర
శివుఁడు ప్రాణవిభుఁడు శివభక్తి సులభుండు, పరఁగ నతఁడునాకుఁ బ్రాణవిభుడు.

వ. అనిన నమ్మహాదేవుం డంబిక కిట్లనియె. 40

గీ. శంభుఁ డవ్యయుఁడు సంగంబు లొల్లండు, నిస్పృహుండు హృదయనిశ్చలుండు
మదనసంహారుండు మహదుగ్రనేత్రుండు, సాధ్యుఁ డనఁగరాదు చాలుఁదపము.

సీ. కుల మిట్టి దనరాదు గుణవంతుఁ డనరాదు పుట్టు వెన్నఁడు లేనిభూతవిభుఁడు
శాంతాత్ము డనరాదు సౌందర్యమా లేదు విషము కుత్తుకనుండు వీతదయుఁడు
పాణిస్థలంబున బ్రహ్మకపాలంబు బట్టి బిక్షం బెత్తు భాగ్యమూర్తి
కట్టఁ గోకయు లేనిఘనసంపదాఢ్యుండు మూఁడుకన్నులవాఁడు ముదుక తబిసి
తే. ముసలియెద్దెక్కు వేదురుమోమువాఁడు, పునుకపేరులుగళమునఁ బూర్ణమైన
వేషధారిని బతియన వెఱగుపడుచు, జనులు హాస్యంబు సేయరే జలజనయన. 42

వ. అని యనేకప్రకారంబుల నీశ్వరుదూషించిన నప్పార్వతి కర్ణపుటంబులు మూసి
కొని నమశ్శివాయ యనుచు నవ్వటువును వారింపుం డనుచుఁ దనసఖులకు సంజ్ఞ
చేసిన నతం డచ్చటనుండకచని. 43

సీ. నందికేశ్వరు నెక్కి నటన సొంపారంగ నాగభూషణములు నవ్యముగను
వ్యాఘ్రాజినాంశుకవ్యక్తి సొంపారంగఁ బాణిపద్మంబులఁ బరఁగు వరము
నభయంబు శూలంబు నద్భుతడమరుసు విలసిల్ల శృంగారవిభవ మెసఁగఁ
జంద్రకళాజాత సౌందర్యమొప్పార నమితతేజస్ఫూర్తి నపహసింప
తే. దివ్యవిభ్రమకాంతులు తేజరిల్లి, నిఖిలభూషణలాంఛన నియతుఁ డగుచుఁ
బ్రమథతతిగొల్వ నెంతయుఁ బ్రమద మెసఁగ, హరుఁడుగిరిజకు బ్రత్యక్షమయ్యె నంత.
వ. అయ్యవసరంబున నప్పార్వతీకాంత మహాదేవుని గనుంగొని పరమసంతోషంబున
నిట్లని వినుతించె. 45

క. జయజయ విశ్వాధీశ్వర, జయజయ సర్వజ్ఞ భర్గ శాశ్వతమూర్తీ
జయజయ శంకర పాలయ, జయజయ విశ్వప్రకాశ శర్వ నమస్తే. 46

వ. అనుచుఁ బ్రణమిల్లిన. 47

చ. వినుతు లొనర్పఁగా వినుచు విశ్వగురుండు సదాశివుండను
న్వనజదళాక్షి పార్వతి భవద్ఘననిత్యతపోనిరూఢికిన్
మనమున సంతసించితిని మత్పటుమూర్తి విశేషలీలనీ
వనిశము నర్ధభాగమున నత్యనురక్తి వసింపు మింపుగాన్. 48

వ. అని పలికి సబహుమానంబుగా నంబికను దనకరాంబుజంబునం జేరం బిలిచినఁ బర
మానందంబు నొందుచు నప్పార్వతి లజ్జాతిశయంబునఁ బ్రణామపూర్వకంబుగఁ
గృతాంజలియై మదీప్సితం బెఱింగిన సర్వజ్ఞుండవు నేవిన్నవింపంబనిలే దైనను
మదీయజనకుం డైనహిమగిరిం బ్రార్థించి నన్నుఁ గల్యాణం బవధరించి యనంతరంబ
తోడ్కొని కైలాసంబునకు విచ్చేయుండనిన శివుం డొడంబడి యట్లసేయంగల
వాఁడ నని నిజస్థానంబున కరిగె నంతఁ బార్వతియు సఖీజనసహిత యై నిజనివా
సంబునకుం జనియె నంత నిక్కడ.

క. ఆరీతి గౌరితోడను, నోరూరఁగ విన్నమాట నువ్విళ్లూరన్
పేరోలగమై కొలువునఁ, దారాద్రివిభుండు మౌనితండముఁ బిలిచెన్. 50

వ. అట్లు పిలిచిన మహాప్రసాదం బని వారలు వచ్చినం గనుంగొని.

గీ. భర్గుఁ డపుడు తనకుఁ బార్వతీకన్యను, మహిమ మిగులఁ బెండ్లిమాట లాడ
సప్తఋషులఁ బంపె సంభ్రమం బేపార, శుభమనోరథంబు సొంపుదనర, 52

శా. ఆరీతిం జని యంత నమ్మునులు నీహారాద్రికిన్ వేగ సొం
పార న్వచ్చుచుఁ గాంచి రభ్రమున గంగాంభః ప్రఘోషోన్నత
స్ఫారోత్తుంగ తరంగ సంకులమహాచాతుర్యముల్ మిక్కుటం
బారూఢార్భటిఁ బర్వఁగాఁ గదలి శాయాకాశమార్గంబునన్ 53

మ. పరమోత్సాహముతోడ వచ్చుచును సొంపైయున్నయయ్యద్రిఁ జే
రిరి చేరంగను నన్నగాధిపుఁడు వారి న్వేడ్కఁ దోడ్కొంచుఁ బెం
పరు దారన్ నిజమందిరంబుకడ వింతైయున్న సౌధంబుద
గ్గఱ సింహాసనచక్రమధ్యమున బంగారంపు టీరంబునన్. 54

క. మించినభక్తిని వారల, నుంచుచును గిరీంద్రుఁ డనియె నోహో భాగ్యం
బంచితముగ ఫలియించె ను, దంచితముగ ననుచు వారి నందఱి నరసెన్. 55

సీ. అర్ఘ్యపాద్యవిధుల నర్చించి వేవేగ, సముచితాసనముల సరస నొసఁగి
మహితశాంతగతి నమస్కారములఁ జేసి, విన్నవించె నధికవినయ మెసఁగి 56

ఉ. మీరు మహానుభావులరు మీకు నసాధ్యము లేద యెచ్చటన్
భూరికృపావిశేషమునఁ బుణ్యునిగా నను గారవించి మీ
రారయవచ్చినారు దయ నానతియిం డది యిష్టమెయ్యదో
నేరుపుతో నొనర్చెదను నిశ్చలభక్తిదయానురక్తులన్. 57

వ. అనిన నగ్గిరిసార్వభౌమునకు నమ్మహామును లిట్లనిరి. 58

శా. కైలాసాచలవాసుఁ డూర్జితమహాకారుణ్యపుణ్యుండు నా
ఫాలాక్షుం డకలంకుఁ డర్ధ్పసఖభ్రాజిష్ణుఁ డుద్యత్కళా
శ్రీలావణ్యుఁడు నైనయీశ్వరునకుం జెన్నొంద మీపార్వతిన్
వాలాయంబుగ నిచ్చి కీర్తిమహిమ న్వర్ధిల్లు మశ్రాంతమున్. 59

వ. అనిన విని యమ్మహీధరవల్లభుండు సంతసిల్లి నిజభార్యాయుక్తుండై యింతకంటె మనకు భాగ్యం బెయ్యది యని యమ్మహేశునకుం దనతనయ నిచ్చుట కియ్యకొనియె నంత మహర్షు లానందంబు నొంది కైలాసంబున కరిగి తద్వృత్తాంతం బంతయు సదాశివునకు విన్నవించిన సంతసిల్లి యమ్మహాదేవుండు నందికేశ్వరు నవలోకించి వైవాహికోచితద్రవ్యంబులు సంపాదింపు మనిన నతం డట్లనేయ నుద్యోగించె నిక్కడ హిమవంతుండు నిజపురంబు విచిత్రంబు సేయించి నిజకుమారీవివాహోచితసకలసామగ్రీసంపాదన ప్రయత్న నిశ్చయుఁ డయ్యెనంత. 60

శా. శ్రీనందీశ్వరుఁ డర్థిఁ గూర్ప విలసచ్ఛృంగారభంగీమహా
స్వానందప్రమథాధినాథులు నిజాహంకారము ల్మీఱఁగా
నానావాహనవాహితాత్ములగుచున్ నాగేంద్రభూషాంగులై
యానిత్యప్రభుఁ గొల్చినిల్చిరి శుభవ్యాసంగ చిహ్నంబులన్. 61

చ. గరుడుని నెక్కి శార్ఙ్గి కడఁకం జనుదెంచె రమాసమేతుఁ డై
సురుచిరశంఖచక్రపరిశోభిగదాధరహస్తపంకజ

స్ఫురితరుచిప్రకాశితప్రసిద్ధపురందరనీలదేహుఁడై
పరమమునీంద్రసంఘము లపారము గొల్వఁగ శంభుపెండ్లికిన్. 62

వ. తదనంతరంబ సాంగవాహనాయుధశక్తిభూషణశృంగారులై బ్రహ్మాదిదేవతాగణం
బును దిక్పాలురును రంభోర్వశీమేనకాద్యప్సరసలును గొలిచి నర్తనంబులుసలుపఁ
బంచమహావాద్యంబులు మ్రోయ నందివాహనారూఢుండై వివిధరత్నమయకనక
కిరీటకేయూరాదిసమస్తభూషణభూషితుఁడై చండీశాదిప్రమథులు కైవారంబులు
సేయ సదాశివుండు కదలుటయుఁ దద్భారంబునకు ధరాచక్రం బుత్తరంబు గ్రుం
గినఁ గుభసంభవుం గనుంగొని దక్షిణమలయపర్వతంబునఁ దద్భారనిర్వహణార్థంబు
పొమ్మని నియమించి తాను వచ్చునంతకు నిక్కడహిమవన్మహీధరంబు. 63

ఉ. మేరువు గంధమాదనము మేచకము న్నిషధంబు వింధ్యమున్
వారణచందనాచలశివప్రియరోహణరత్నపుష్పభూ
భారవహాదిశైలములు భాగ్యపరంపర లుల్లసిల్లుచున్
ధీరతఁ గల్పవృక్షసురధేనుసమూహము గొల్వ భక్తితోన్. 64

క. ఎదు రేగుదెంచి శివునకు, ముదమున మ్రొక్కుచును శీతభూభృత్పతి స
మ్మదమునఁ గానుక లొసఁగెను, సదమలనవరత్నకనకసందోహములన్, 65

వ. అప్పు డమ్మహాజనసంకులం బత్యద్భుతం బయ్యె, నంత న మ్మహాదేవుఁ డో
డ్కొని వచ్చి నిజమందిరసౌధప్రదేశంబున నునిచె. శుభముహూర్తం బాసన్నం
బగుటయు. 66

## గౌరీకల్యాణము.

శా. కల్యాణోచితసర్వలక్షణకళాకాంతోరుభూషల్ జగ
త్కల్యాణిన్ హిమశైలరాజతనయం గాంతామణిం బార్వతిన్
గల్యాణార్థి వివాహమయ్యె శివుఁ డాకౌతూహలోత్సాహకృ
త్కల్యాణాధ్వను లుల్లసిల్ల శుభమాకల్పాంతరస్థాయిగాన్. 67

వ. అట్టిమహోత్సవంబున సురలు కుసుమవర్షంబులు గురియించిరి దేవదుందుభినినదం
బులు మ్రోసె. త్రయస్త్రింశత్కోటిదేవతాగణంబులుం దక్కినసమస్తజనంబులు
బరమానందంబుం బొంది యాసమయంబున వేదాంతోపనిషద్వచనంబుల నమ్మహా
దేవుని స్తుతియించి రనంతరం బమ్మహీధరవర్యుఁడు సవినయంబుగా సమస్తంబు
నీశ్వరునకు సమర్పించినఁ గైకొని పార్వతీసహితుండై సర్వదేవమునిగణంబులు
గొలువ నందివాహనారూఢుం డై మహావిభవంబునఁ గైలాసగిరిం జేరి పర
మానందంబుఁ బొందియుండె మఱునాఁడు నానాదిగీశులుం దెచ్చిన కట్నం

బుల పరీక్షాధికారంబునకుఁ గుబేరు నియోగించి ముందర హరిసురజ్యేష్ఠులకుఁ
గట్నంబు లిచ్చి యితరజనంబుల కొసంగుటయుఁ గుబేరుముఖంబుగా నడచె నంత
మీవారు వచ్చినం జూచి ధనదుం డెఱింగి శివున కిట్లనియె. 68

శా. ఊరవ్యు ల్పరమేశ నీపదమున న్మోహించి నిష్టాపరే
ష్టారూఢిం దప మాచరించి కరుణాత్మా భర్గ నీచిత్తమె
ట్లారీతి న్నను నట్ల చేయు మన నెంతేప్రొద్దు చింతించి గౌ
రీరామామణినాయకుం డనియె వారిం జూచి యుబ్బొంగుచున్. 69

వ. పరమేశ్వరుండు దరహసితవదనారవిందుండై సమస్తజనంబులు విన నిట్లనియె. 70

క. పరమపదస్థానం బగు, వరకైలాసంబునందు వర్తింపంగా
గురుతీవ్రఖచరచాపం, బిరవుగ నీవైశ్యమునుల కెల్లను గలిగెన్. 71

గీ. అట్టిశాపమహిమ నబ్జజువచనంబు, దెలిసి వీరి ధాత్రి నెలవుకొలుప
బుద్ధి పుట్టె నాకుఁ బూర్వపురాకృత, కర్మ మెట్టివారుఁ గడపరాదు. 72

క. అనినను విని శివశివశివ, యనుచును వందనము చేసి రందఱు విని య
వ్వనజభవాదుల కైనను, గని విని తెలియంగరాని కైవల్యంబున్. 73

క. వెరవొప్ప నిచ్చి యిపుడా, ధరణీస్థలి కేగుమనుట దయదప్పుట మీ
చరణయుగవిహితసేవకు, మరగినమామనసు ధరకు మరగదు రుద్రా. 74

వ. అని మీవార లప్పరమేశునకు విన్నవించిన. 75

క. అచ్చటికథ మును పే మీ, కచ్చుపడం దెలిపి తనిన నామునితోడన్
సచ్చరితు లిట్టు లని రమ, రచ్చట శివుతోడ నప్పు డాడినమాటల్. 76

గీ. తెలియఁ బల్కి నారు తిరిగి వచ్చెడువేళ, నెచటి నెచటి మహిమ లేమి గనిరి
వినఁగఁ బలుకు సకలవిశ్రుతబహువేద, చయ మెఱింగినట్టి సంయమీంద్ర. 77

వ. అని విన్నవించిన మీవారల కమ్మహాత్ముం డిట్లనియె నట్లమ్మహాదేవుపాదపద్మంబులు
చిత్తంబున నిడికొని నిర్భీతులై యిట్లనిరి, మహానుభావా భూలోకంబున కరుగు
టకు మాచిత్తంబు లొప్పకయున్నవి. మేము చనుట కొప మనిన నప్పరమేశ్వ
రుండు వారలకిట్లనియె. 79

మ. జగతిం బావనభూస్థలిం బ్రకటితా స్వద్దత్త లీలోల్లస
న్నగరాష్టాదశపాలనప్రభువులై నానాప్రకారంబులన్
నగరస్వాము లనంగ నుండుఁడు మహానందంబు సంధిల్లనే
నగరేశేశ్వరమూర్తిఁ గైకొని ప్రసన్నత్వంబునుం బొందెదన్. 79

వ. అనిన వైశ్యమును లక్ష్మహాదేవున కిట్లనిరి. 80

గీ. స్వామియాజ్ఞాప్రకారంబు సంతతంబు, శిరమునను దాల్చి యుండుదము ధరణిలోన
నెట్టులోర్తుము సకలలోకేశి యైన, సర్వమంగళపాదదర్శనము మాని. 81

వ. అనిన నద్దేవుం డిట్లనియె. 82

క. అనిశము మదీయసంగతి, వనజాంబక గౌరి వింధ్యవాసిని యనుపే
రను నిల్చి మిమ్ముఁ బ్రోచుచు, ఘనసంపద లిచ్చి యధికకారుణ్యమునన్.

క. నియతప్రౌఢిన్ సమధిక, ప్రియమున బ్రహ్మాంశభవుఁ డభిమార్థదుఁ డై
జయ మొసఁగి భాస్కరార్యుఁడు, దయతో మీకును బురోహితత్వము చేయున్

క. కుల మభివృద్ధిగ దీవన, లలరించుచు నలువ భాస్కరార్యుండును నై
యిలలో జనియించి భవ, త్కులగురువై మెలఁగు బ్రదుకఁగోరియు నెపుడున్.

వ. అని యానతిచ్చిన మహాప్రసాదం బని మ్రొక్కి నీడ్కొని విష్ణుదేవుని సన్ని
ధికిం జని. 86

శా. ఆనందంబున వైశ్యశేఖరులు సాష్టాంగప్రణామంబులన్
శ్రీనాథుం గరుణావలోకన శుభక్రీడావిహారోన్నతు
న్నానావైభవసద్గుణాఢ్యుని జగన్నాథున్ జయోపేతు సు
జ్ఞానస్వాంతుని వే నుతించి రభివాంఛాదానచాతుర్యునిన్. 87

సీ. శ్రీరమ్యసంతతోదారవిభాసిత సకలలోకోద్భవస్థానచతుర
ప్రణతార్థివాసవప్రముఖదేశకిరీట వరమణి విలసితచరణకమల
కౌస్తుభమాణిక్యకమలాలయా కాంతి లలితవక్షస్థలోల్లాసిహృదయ
సద్భక్తలోకవాంఛాఫలప్రద దేవ యార్తరక్షాపరాయణ ముకుంద

తే. పుండరీకాక్ష వైకుంఠ భువనవంద్య
యనఘ దాసానుదాసుల మైనమమ్ము
గరుణ భావించి రక్షించు కమలనాభ
ఘనతలక్ష్మీకటాక్షంబు కలిగియుండ. 88

మ. అని భక్తి న్నుతియించువైశ్యులఁ గృపార్ద్రాలోకనప్రౌఢి ని
ట్లనియె న్మీరు సుపర్వశిల్పికృతనవ్యాష్టాదశగ్రామపా
లనవిఖ్యాతి ననేక కాలము మహోల్లాసంబుతో భూస్థలిన్
ఘనులై యుండుఁడు సర్వమాన్యు లయి లోకస్తుత్యచారిత్రులై. 89

క. దనుజారి యిట్లను జనార్దననామముతోడ మీపురంబున రమతో
ఘను గూడియుండుదు వరముల నొసంగుచు నహరహంబు లోకము మెచ్చన్.

గీ. భక్తు లున్నచోటఁ బరమానురక్తితో
హరుఁడు నేము నుందు మహరహంబుఁ
గాన మీరు ధరకుఁ గమనీయగతి నేగి
మహితభక్తియుక్తి మనుఁడు మిగుల.

క. శ్రీమన్నారాయణుఁడు మహాముదమున నొసఁగినట్టియద్భుతవరముల్
ప్రేమంబునఁ గొని గౌరిర, మామహిళలకును నెఱింగి మహిమ దలిర్పన్. 92

క. హరిహరులహృదయకమలము, లరయంబున నిల్పి భక్తుల నుతించి సురా
గ్రరమణులం బొగడి సుధీ, వరుల నుతించుచును గదలువారై యచటన్. 93

వ. అంత నవ్వైశ్యవరు లమ్మహాదేవుకడకుం జని మాకు సహాయంబు గావలయు నని ప్రార్థించిన మీకు విశ్వకర్మను బ్రహ్మను, సహాయం బిచ్చితి నని పలికిన వీరొక్కని.

మ. చని వేగంబున వార లగ్గిరికి సాష్టాంగంబు గావించి గొ
బ్బున శైలంబులు జాహ్నవీనదులు తెంపున్ దేవతావర్తమ
ధ్యనటత్కౌతుకయక్షరాక్షసమునివ్యాపారముల్ చూచుచున్
గని రాచెంత వియన్నదీజనితరంగత్తుంగవీచ్యోఘముల్. 95

క. ఆచిత్రవిచిత్రంబుల, కాచాతుర్యముల కలరి యవగాహను లై
వే చనుదెంచిరి యీవలఁ, జూచుచు హిమవన్నగంబుఁ జూచిరి వేగన్. 96

క. నగపతికిని మ్రొక్కుచు హిమ,నగ మటుదాఁటి కదలి సనాతనబుద్ధిన్
నగపతిస్థైర్యు లయోధ్యా,నగరం బటుఁ జూచుచును వినమితప్రభులై. 97

వ. మఱియు హరిద్వారంబును సింధుసరయూనదులును త్రివేణిసంగమంబును నాసి
కాత్రియంబకంబును గాళేశ్వరంబును వృద్ధగంగాతీరంబును జూచి పుష్పకంబు
డిగ్గి రని సాలంకాయనముని తరువాతివృత్తాంతంబు సెప్పఁటకై యుపక్రమిం
చుటయు. 98

ఉ. పండితభాస్కరార్యనుతభాస్కరు లంచితభోగశాసనా
ఖండలు లంగనామసుమకార్ముకు లూర్జితనవ్య శేముషీ
కుండలిరాట్సమాను లవికుంఠితధైర్యులు బ్రహ్మపాలనో
ద్దండదయాపయోధు లతిధార్మికు లుత్తమవైశ్యు లిమ్మహిన్. 99

మాలిని. సగణనగరశంభుస్వామిపాదాబ్జసేవా
నిగమవిధివిధేయుల్ నిత్యధర్మాద్యుపాయుల్
సుగుణగణవిశాలుల్ శోభనోద్యోగశీలుల్
ప్రగణిత పెనుగొండప్రఖ్యు లారవ్యముఖ్యుల్. 100

గద్య. ఇది శ్రీసరస్వతీవిలాసచరణసరసీరుహనిష్యందమకరందబిందుసందోహమధురధురీణమధుకరాయమానమానససరసకవితావిలాస బొల్లనాచార్యపుత్ర భాస్కరాచార్య నామధేయ ప్రణీతం బైన వైశ్యపురాణంబునందు మన్మథుం డీశ్వరునిచే దహింపఁబడుటయు రతీవిలాపంబును మదనపునర్జీవనంబును బార్వతీదేవితపోనిష్ఠయు శివుండు వివాహార్థంబు సప్తర్షులఁ బంపుటయు శివునివివాహంబును శివుండు పత్నీసమేతుండై కైలాసంబున కరుగుటయు గంగాదినదీప్రభావంబును నను కథలం గలది చతుర్థాశ్వాసము.

శ్రీగణేశాయ నమః.

శ్రీశారదాంబాయై నమః.

# శ్రీ వైశ్యపురాణము

## పంచమాశ్వాసము.



మద్ద్వినవకసంఖ్యా
గ్రామగ్రామణులు కీర్తిరమణులు సత్య
ప్రామాణికులు మరుద్ద్రిమ
నామప్రాభవులు బాలనగరవరేణ్యుల్. 1

వ. ఆకర్ణింపుఁడు. 2

క. అక్కథకుం డిట్లనియె వణిక్కులనాయకులకు మృదునీతికళాస
మ్యక్కులనాచాతురి పెం, పెక్కఁగ వినుఁ డనినయంత నిట్లని రర్యుల్. 3

మ. అగరాజాత్మజనాయకుం డనినయట్లారాత్రి వేవేగ నా
సాగసౌసూర్యరథంబు వచ్చుగతితో సొంపొందుచుం జిత్ర మా
నిగమాధిష్ఠితధర్మరూపమయమా నీపుష్పకారూఢులై
గగనంబందున రాదొడంగిరి మహాకౌతూహలం బొప్పఁగన్. 4

క. ఆరీతి నదీనదవిస్తారాహార్యాధిపతిని దర్శించుచు మా
వా రంతటఁ బూర్వాంబుధి, తీరంబునఁ బుష్పకంబుడిగి యట మఱియున్. 5

క. ప్రాదమధ్యంబున నేమని, ముద మొప్పఁగ నిల్చి రిష్టమున మఱి వా ర
య్యెడి పనిగా నడచి రదియు, విదితముగాఁ దెల్పు వేదవేదాంతనిధీ. 6

వ. అనిన వైశ్యబుషులకు సాలంకాయనబుషి యిట్లనియె నట్లక్కాలనం గలయా
శ్చర్యంబు లవలోకించి బ్రహ్మ కిట్లనిరి. 7

చ. కమలిని యొక్కనాళమునఁ గాంచనదీధితు లుల్లసిల్లుచున్
విమలము లైనపుష్పములు వేదకృత్రయం బటు గానవచ్చినం
దమకము నొంది చిత్రగతిఁ దద్వణిగన్వయనాథు లుబ్బునం
గమలజ యివ్విధంబయిన కారణమే మది యాన తీఁదగున్. 8

వ. అనిన వైశ్యులకు విరించి యిట్లనియె. 9

చ. కలఁడు పులస్తినాఁగ మునికాంతుఁడు యజ్ఞముసేయ భక్తికై
యెలమి మహేశ్వరుండు గిరిజేశ్వరి శార్ఙ్గియు నేను గొల్వఁగా
నలఘుత నగ్నికుండమున నద్భుతభంగిఁ బ్రసన్నుఁడై మనం
బలరఁగ వేఁడు వాంఛితపదార్థము లన్న నతండు మ్రొక్కుచున్. 10

ఉ. ప్రాకటమైనవాక్యములఁ బ్రస్తుతి సేసి విశేషభక్తితో
నాకు మనోరథార్థములు నవ్యముగాఁగ ననుగ్రహించి నీ
వేకత సర్వలోకములు నిచ్చ యెఱింగి కృతార్థుఁ డొటకుం
జేకొని సన్నిధై యిచటఁ జెన్ను వహింప నవశ్య మెంతయున్. 11

వ. అని ప్రార్థించి పలికిన నమ్మహాదేవుం డప్పద్మమూలంబున జ్యోతిర్మయలింగంబై పృథివికి మూలస్థానం బనం బరఁగి మల్లికార్జునేశ్వరుండను బులస్త్యేశ్వరుండు నను నామంబులఁ బ్రకాశించియుండె నయ్యగ్నికుండంబువలన జ్వలనజ్వాలాజాలంబులు జలంబులై మహాపుణ్యనిలయం బయ్యె నిది పులస్త్యతీర్థంబు దీనిసమీపంబున మీకొక్కనగరంబు నిర్మించెద నని విశ్వకర్మం జూచి పట్టణంబు నిర్మింపు మనిన
తక్షణంబ. 12

## పెనుగొండపట్టణవర్ణనము.

ఉ. ద్వాదశసూర్యవీథుల నుదారత షోడశసోమవీథులన్
మోదమెలర్పఁగాఁ గనకముఖ్యగృహంబు లనేకభంగులన్
ఆదరమొప్పఁ గేతనమృగాధిపగోపగజాయసంజ్ఞచే
నాదివిగాఁగ నవ్యగతి నంచితవర్గవిధిన్ సృజించినన్. 13

క. వివిధామరగేహంబులు, వివిధామరభర్మహర్మ్యవేదీతతులు
న్వివిధోద్యానవ్రజములు, వివిధపురద్వారభద్రవేదీతతులన్. 14

వ. ఈరీతిని గౌతమీతీరంబునఁ బురంబుసృజియించె నంత విరించియు నవ్వైశ్యవరుల జటావల్కలంబులు పరిహరించి పత్నీసమేతంబుగా మంగళస్నానంబులు సేయించి దివ్యభూషణవస్త్రంబులు ధరియింపంజేసి ఘనకుధరం బనుపేరుగల శారదాపీఠంబు సప్తగోదావరీతీరంబున నియమించి యట వసియించు బ్రహ్మమండలంబులఁ బిలిపించి యమ్మహాగణంబు విన నీభాస్కరాచార్యులవా రేకవింశతిపీఠంబులవారు నాయం శంబున నవతరించినవా రని వారలకుం దెలిపి వారలముందర నీవైశ్యవరుల కుల గురువులను బురోహితులను నియమించి కృతార్థులుగండని వైశ్యవరులకు నొప్ప గించి వారలచే వరంబులిప్పించిన యనంతరంబ యప్పురంబునకుఁ బశ్చిమభాగంబున భూసురవిసరంబును బ్రాగ్భాగంబున రాజన్యసందోహంబును దక్షిణోత్తరభాగం

బుల సచ్ఛూద్రనివహంబులను దక్కినవర్ణంబులవారల యథోచితస్థానంబుల నుండ
నియమించి కోరినవరంబు లిచ్చినయనంతరంబ. 15

క. యక్షేశ్వరుఁ డతిముదమున, నక్షయముగ ధనము లిచ్చి యవనీస్థలి మా
క్షితాంశంబున మిమ్ముఁ, రక్షింపుదు నని వరంబు రయమున నిచ్చెన్. 16

వ. మఱియును. 17

గీ. మరకతమణిదీప్తమహిత మై మించిన, మనుజకేతనంబు మహిమ నిచ్చి
దానధర్మకీర్తిధనదాంశు లన, మీరు, వసుధ వెలయుఁ డనుచు వరము లొసఁగె. 18

చ. పురమున కొప్పుఁ దూర్పునను బోల్పుగ గౌతమి దక్షిణంబునం
బరుదుగ నంబురాశి సదహంకృతి చెల్వగుపశ్చిమంబునం
బరఁగినగోస్తనీనదివిభాసిత మైతగు నుత్తరంబునన్
ఆరయ వసిష్ఠగంగయు సమాగత మైనహ్రదంబు నెప్పుడున్. 19

క. సీమాంతరములు దీర్చుచు, సామర్థ్యంబునఁ బురంబుఁ జతురత్వమునన్
శ్రీమత్క్షేత్రంబుల న్నారామంబు లనేకవిధుల రచియించి తగన్. 20

క. ఆరామంబుల మహిమల, కారాజీవాసనుండు నద్భుతవృత్తిన్
ధీరత వర్ణన సేయఁగఁ, జారుతరంబయి తనర్చు శంభునికరుణన్. 21

సీ. తరుమూషికాదంతదళితంబులై జాఱి పడి నారికేళసత్ఫలము లంటఁ
దాఁకినపడి నోడి దండడి వ్రాలెడి పనసపండులచేత భగ్నమైన
యిక్షుకాండంబుల యేర్పులసందుల మొదల మిత్రించినముత్తియముల
బెడఁగుగా మించెడివడగండ్ల వర్షంబు పొరిఁబొరిఁ గురిసిన పోల్కిఁగాఁగ
తే. చెక్కులందంద తాకిన సుక్కుదక్కి, యెగయుహంసలముక్కులఁ దగిలెడుపడి
రాజనపుమళ్లనీళ్లలో రమణఁ దిరుగు, శఫరదంపతు లనఁగల్గు సంతతంబు. 22

వ. మఱియు నవ్వనంబునం గలనారంగమాతులుంగపున్నాగదాడిమాఖర్జూరచందన
మందార వాసంతికామల్లికామంజరీకుంజ నిష్యందమకరందధారాప్రవాహలోల
కల్లోలమ్మాలాక్రీడద్వరాళీమరాళీపత్రచాలనచాతుర్యధుర్యంబు లగుమందానిలబృం
దంబుల కానందంబు నొందు నిందిందిరబృందంబులపాటలం గలపాటలంశుల
సీవలఃక్రీడలం దేలి వేడుకలం గూడి కష్మపూఁబొదరిండ్లకెలంకుల విహరణం
బొనరింప నింపెసంగుమధురగంధర్వదంపతీసముంచితవిపంచికాగానంబులఁ బ్రోది
సేయుకలకంఠనినదంబుల ముదంబులం గలిగి యుండంద నందనవనచైత్రరథంబులం
బోలునారామంబులుగలిగి యొప్పుచుండు నప్పట్టనప్రాంత సంవృతభూభాగంబుల.

సీ. శ్రీరామవంకియుఁ జిటిబలుగుత్తియు శ్రీకేసరియుఁ శక్తిశ్రీధరంబు
నీశ్వరప్రీతియు నేసుఁగుకొమ్మును బోడసంపంగియుఁ నోదవతియుఁ

గస్తూరినికరంబుఁ గర్పూరభోగియుఁ గావలికాంభోజి కనకగిరియు
దేవాన్న మెలిమియు దేవగన్నియకొట్టి, సీరుచెంచలియు శృంగారభోగి
తే. వంకి ప్రాసంగి సంపంగి వారణాశి, కామధేనువు నారేళి గంద్రగోళి
వెదురుమలయంబు బుడమయు వెలువడంబు, రాచమెచ్చును ములఁవంకి రాజనములు.

క. సెనగయు గోధూమంబ్బును, మినుములు ముద్గంబు కంది మెంతియు మిరియం
బనుములు మొదలగుసస్యము, గొనకొని శివుకరుణఁ గొండకోటులఁ బండున్. 25

వ. మఱియు బహువిధవిశేషంబులకు బహుగోత్రసమృద్ధం బగుటంజేసి పెనుగొండ
యనునామం బొనర్చి పులస్త్యతీర్థోపరిస్థలంబున దివ్యయంత్రశిలాస్తంభనిర్మిత
ప్రాసాదప్రాకారవలయంబులగు దేవాలయంబులు నిర్మించి యనంతరంబ. 26

క. ఈలోకంబుల కెల్లను, మూలస్తంభం బనంగ ముఖ్యప్రతిభన్
మూలస్థానమహేశ, స్థూలకళావాహనంబు సొంపు దలిర్పన్. 27

క. నెగడినశైవాగమవిధి, నగణిత మగుమహిమ లెసఁగ నతిభక్తిరతుల్
నగరేశ్వరదేవేశ్వరుఁ, డగ సొంపలరం బ్రతిష్ఠఁ దద్దయుఁ జేసెన్. 28

క. వెలయ జనార్దనదేవుని, గలితమహత్త్వప్రభావుఁ గమలాధీశున్
విలసితవైష్ణవవిధులను, జలరుహగర్భుఁడు ప్రతిష్ఠచతురతఁ జేసెన్. 29

గీ. అరయవింధ్యవాసి ననుమహాశక్తియు, గురుతరాక్షికమల కోనకమల
వివిధదుర్గలు బహువిధభైరవులు నర్థిఁ, బౌరదేవు లనఁగఁ బ్రబలి రంత. 30

క. హరుఁ డట నగరేశ్వరుఁ డై, గిరిజయు నావింధ్యవాసకృష్ణుం డరయం
బరఁగ జనార్దనుఁ డయ్యెను, గరుణించుచు లక్ష్మి కోనకమలగ వెలసెన్. 31

వ. మహాగణపతిపురస్సరంబుగ నేతద్దేవతాప్రతిష్ఠ లొనరించి విరించి యిట్లనియెం. 32

సీ. అఖిలలోకారాధ్యుఁ డైనట్టి శంభుండు నగరేశ్వరఖ్యాతి నెగడినాఁడు
కైవల్యసుఖదాయి కమలాధిపతి శౌరి హరిజనార్దనుఁ డయి యలరినాఁడు
శర్వాణి పార్వతి సర్వమంగళ గౌరి వింధ్యవాసిని యన వెలయుచుండుఁ
గమలాక్షి శ్రీలక్ష్మి కాంతాశిరోమణి కోరిక లొనగూర్చు కోనకమల
తే. ఘనతఁ బెనుగొండపురవరంబు నను మీకు, పరము లొసఁగుచు నందురు వైభవముగ
భవ్య మైనట్టినామూర్తిఁ బ్రబలినాఁడు, భాస్కరాచార్యవర్యుండు ప్రతిదినంబు.
వారి సేవించి వెలయుఁ డీవిశ్వమునను. 33

వ. మఱియు నానాదేవతాసికంబులకు ద్విజస్తుతినియోగంబులనిర్ణయించిన యనంతరంబ
యావైశ్యజనులు విరించి కిట్లనిరి. 34

క. మాకోరికి సఫలంబుగ, నేకాలము నిచటనుండుఁ డెంతయు వేడ్కన్
మాకులము వారి కెల్లను, బ్రాకటముగ గురువు లగుచు బ్రాహ్మణవరులై. 35

వ. అని ప్రార్థించినఁ జతుర్ముఖుం డౌఁగాక యనుచుఁ గోరినవరంబు లిచ్చి యనంత
రంబ ధర్మ,ధనద,పాంచాల,నిరవద్య,జగన్నాథ, క్షీరకాసార, దెందులూరు, ఏలా,
ఘంటసాల,త్రిగుణిత, ఘనభీమ,విశాల,కళింగ,నృసింహ, వీరనారాయణ, ఆచంట
నగరంబు లనుసీసప్తదశగ్రామంబులుం బెనుగొండకు గ్రాసగ్రామంబులుగా నత్యంత
శోభితంబై తనర్చె న ట్లప్పద్మసంభవుకృపాతిశయంబున. 36

క. కోటికి నెత్తిన పడగలు, కోటీసి యొకొక్కనింటఁ గొమరొందు ననన్
బాటిగను నిత్యలక్ష్మి, పేటిగ వర్ణింపవచ్చుఁ బెనుగొండపురిన్. 37

క. ఎంచఁగ నానగరంబులు, వంచింపక తిరిగి లేని వసుధాస్థలముం
గొంచక తిరిగినఫల మని, పంచాస్యుఁడు విశ్వకర్మ ప్రతిన యొనర్చెన్. 38

క. అక్కడఁ గోరి కుబేరుని, నిక్కఁగ యడుగంగ నేల యిలఁగో వైశ్యుల్
రొక్కము చవుకించుదురా, పెక్కులు వర్ణింప నేల పెనుగొండపురిన్. 39

ఉ. మాడలునూఱుజీత మొక మానిసికి న్నెలనాళ్లకట్ట డా
మాడకు నూఱుచిన్నములు మానుగఁ జిన్నమునూఱుకాసులున్
వాఁడని క్రొత్తమంచిగలవర్తులు కాసుకు నూఱుసన్నపుం
బ్రోడలు లెక్క ప్రాసఁగులు పోఁకకుఁ బుట్టెఁడు పట్టణంబునన్. 40

క. ఆందోళికాదివాహన,సందోహారూఢవృత్తి సత్ప్రభువునకున్
నిందితునకు నీచునకును, దండడిఁ బెనుగొండపురిని దలప్రక్కలగున్. 41

ఉ. ఈవణిగ్గ్రహారమిల నేనృపుఁ డైనను సర్వమాన్యసం
భావమునొంది రక్షణము భక్తి నొనర్చినయేని కోటివే
ల్గోవుల నిచ్చుపుణ్య మగు లోలత నీపురమీక త్రోచినన్
గోవధ చేసినట్టియతిఘోరపుఁ బాపము పొందు వారికిన్. 42

వ. మఱియు నట్టిపెనుగొండపురంబు కైలాసంబునుంబోలె నవ్యాహతసకలసంపదల
సొంపుమిగిలి యభ్యుదయపరంపరాభివృద్ధి యగుచు మహాసమృద్ధం బయ్యె నయ్య
వసరంబున విరించి విశ్వకర్మకుబేరభాస్కరాచార్యులకు నవ్వైశ్యుల నప్పగించి
కులసంరక్షణంబునకు నియమించి పుష్పకారూఢుండై నిజనివాసంబున కరిగె నంత
నిక్కడ బ్రహ్మోరుసంభవులు దినదినప్రవర్ధమాను లగుచు నిత్యోత్సవంబుల వెలుం
గుచుఁ జతుర్దశోత్తరశతసంఖ్యాతవైశ్యమునినిష్ఠాభిజాత్యపవిత్రంబు లగుగోత్రం
బులును దద్బ్రహ్మోపదిష్టశివమంత్రజపపరాయణులు నై నిత్యంబు నన్యోన్యవ్యవ
హార ధర్మపాలనంబునఁ గృషివాణిజ్యగోరక్షణవృద్ధిజీవనంబుల ననుసంధించుచు
శ్రీనగరేశ్వరజనార్దనుల కారుణ్యవిశేషంబునఁ బుత్త్ర పౌత్త్రాభివృద్ధిఁ గలిగి వెలసి
రని సాలంకాయనముని యానతిచ్చిన విని యవ్వైశ్యఋషు లిట్లనిరి. 43

గీ. అందుఁ జిత్రవిచిత్రంబులైన తెఱఁగు, దెలుపుమని వేఁడ వారికిఁ దెలుపఁదొడఁగె
సరసభాషామనీషవాచానిరూఢి, సంభ్రమం బొప్పఁ జెవులకుఁ జవులుపుట్ట. 44

వ. ఇట్లు కృతత్రేతాద్వాపరయుగంబులు చనినసమయంబున. 45

క. సోమాఖ్యుం డగువైశ్యుఁడు, ధీమహిమాఢ్యుం డటంచుఁ దెలియఁగ మహిలో
నేమమున వైశ్యవంశ, శ్రీమంతుం డతఁడు కుసుమసెట్టై పుట్టెన్. 46

సీ. గంధర్వపతి చిత్రకంఠుండు సొంపున వైశ్యశాపము నొంది వసుధ నతఁడు
సోమవంశంబున సురరాజభోగి యై రాజరాజనరేంద్రరమ్యపురిని
శుభముహూర్తగ్రహశుభదృష్టి వేళలఁ బరమపాతివ్రత్యభావ యైన
సర్వలక్షణ యగుశర్వాణిదేవికి వంశవర్ధనవిష్ణువర్ధనుండు
తే. పరఁగ జనియించి జగ మెల్లఁ బాలనంబు, సలుపుచుండెను శ్రీరామచంద్రు మాడ్కి
తల్లిదండ్రుల గురువుల దైవములను, భక్తిఁ గొలుచుచుండెను రక్తితోడ. 47

వ. అట్టిసమయంబున. 48

సీ. వైశ్యాన్వయఖ్యాత వారిధిచంద్రుండు పరమమాహేశ్వరభక్తియుతుఁడు
చాతుర్దశోత్తరసప్తశతఖ్యాత చిరగోత్రమూర్ధాభిషిక్తఘనుఁడు
నగరేశ్వరేశ్వరు నమ్మినభక్తుండు విహితమాహేశ్వర్యవిభవయుతుఁడు
సకలధర్మాధారసంసారవర్తనుం డుద్వాహకులగోత్రుఁ డూర్జితుండు
తే. వసుధఁ గుసుమాఖ్యుఁ డన మించి కుసుమగంధి
యనఁగఁ దనపత్నియును దాను ననుదినంబు
బుధజనంబులఁ బోషించి పొలుపు దనర
ధర్మశాస్త్రంబు వినుచుండుఁ దత్త్వభంగి. 49

క. గుడియును జెఱువును వనమును, నడరఁగ నల్లిండ్లు నిధియు నంచితకృతియున్
బెడఁగుగ నొనరిచి యంతట, నుడుగక పుత్రార్థి యగుచు నుద్యమ మెసఁగన్. 50

సీ. ప్రాసాదగోపురప్రాకారములతోడ నమరఁ గట్టించె దేవాలయములు
ధర సార్వకాలంబుఁ బరిపూర్ణజలముగాఁ జెఱువులు త్రవ్వించెఁ జిత్రగతుల
సహజమాధుర్యమౌ బహుఫలాంచిత మైన వనములఁ వేయించె వరుసతోడఁ
బూని షోడశమహాదానంబు లొనరించె, నధికసత్ప్రీతిని నిధులు నిలిపెఁ
తే. జెలఁగి బ్రహ్మప్రతిష్ఠలు చేసియంతఁ, దనచరిత్రంబు జగ మెల్ల వినుతి సేయఁ
గృతులఁ జెప్పించి దిక్కులఁ గీర్తి నిలిపెఁ, గులములోపల జగజెట్టి కుసుమసెట్టి. 51

క. కుసుమప్రభునికులాంగన, కుసుమాంబయును దానధర్మకుశలత మెఱయన్
వసుధాజనములు పొగడఁగ, నసదృశగతి మెలఁగుఁ బతికి ననురూపముగన్. 52

సీ. పసిఁడికలశములఁ బరిమళోదకముల సద్భక్తిఁ బతికిని జలకమార్చి
తడియొత్తి లాతిమెత్తనివస్త్రము ల్గట్టుకో నిచ్చి గంధంబు మేనఁ బూసి
నిష్ఠఁ గులోచితానుష్ఠానములతోడ దేవపూజావిధి దీర్చి యంత
సరవితో నాదిత్యసత్కార మొనరించి బంధుజనంబులు పంక్తినుండ
తే. సలలితామృతభోజ్యంబు సరవిఁ బెట్టి, కుశలచారిత్ర యైనట్టికుసుమగంధి
యతులవిఖ్యాతిఁ బతిహితం బాచరించు, సకలబంధుజనంబులు సంతసింప. 53

వ. అంత నొక్కనాఁడు. 54

చ. పొసఁగిన పట్టెమంచమునఁ బువ్వులపాన్పున వేడ్క మీఱఁగా
రసికత భర్తయుండ ననురాగముతోడను వీడెమిచ్చి తాఁ
బసగలతాళవృంతమునఁ బై చెమటార్చి పదాంబుజాతముల్
పిసుకుచు విన్ననై మనసు భీతిఁ జలించుచు నుండె నమ్రయై. 55

సీ. సకలదుఃఖాంబుధి శమనోదకం బైన తనయుగర్భంబులోఁ దాల్తు నొక్కొ
యఖిలతమోబృందహరుఁ డైనసూనుని గన్నులఁగాంక్షతోఁ గాంతు నొక్కొ
యమృతాభిషేకసౌఖ్యప్రాపకం బైన బాలుఁ గౌఁగిటఁ జేర్పఁ బోలు నొక్కొ
ముద్దుఁబలుక్కుల చేత మురిపెంబుఁ బుట్టించి తనయుండు మనసును దనుపునొక్కొ
తే. పుత్రసంతానవతు లైనపువ్వుఁబోణు, లెన్నఁ డిట్టుల మనసులో నెన్నకుందు
రకట దయసేయఁడయ్యెను హరుఁడటంచుఁ, జింతనొందుచునుండెను జిగురుఁబోఁడి.

ఉ. అంత నెఱింగి తజ్జ్ఞుఁడగు నాకుసుమాఖ్యుఁడు నాదరంబునం
గాంతను జూచి పల్కె ననుకంప దలిర్పఁగ నీమనంబునం
జింతవహించిన ట్లునికిఁజెప్పుము నీకు మనోరథార్థముల్
సంతసమంద నిచ్చెద విచారము మానుము దైన్యమేటికిన్. 57

ఉ. దీనులఁ బ్రోవవైతివో సుధీమతి వేల్పులఁ గొల్వవైతివో
పూనిక నాడితప్పితివొ భూసురకోటికి నిష్టమైనయా
దానము సేయవైతివొ పదంపడి బంధుజనంబు నిన్ను దా
సీనము చేసిరో మనసు చింతకుఁ గారణ మేమి చెప్పవే. 58

వ. అని కుసుమవిభుండు కులాంగన నూఱడించి పలికిన విని కుసుమగంధి పతికి నిట్ల
నియె. 59

సీ. రహి మించుచున్న యీరత్నభూషణముల నెల్లకాలము ధరియింపఁగలిగె
ననుభవించితిని దివ్యాన్నపానంబులు భక్ష్యభోజ్యంబులు ప్రతిదినంబు
నిత్యదానంబులు నిష్ఠతో నొసఁగితి బ్రాహ్మణోత్తములకుఁ బ్రతిదినంబు
బాంధవజనులకు బహుపదార్థంబుల నిచ్చితిఁ గులకాంత లెల్లఁ బొగడ

తే. సిరుల మించితి మీపాదసేవచేసి, భాగ్యసంపదఁ గలరె నాపాటిసతులు
ఎక్కుడైయుంటి నా కింక నొక్కకొదవ, పుత్త్రలాభంబులేమికిఁ బొక్కుచుందు.

సీ. అనుదినంబును దేవతారాధనక్రియాపరతంత్ర నై యుంటి భక్తితోడ
ముత్తైదువుల కెల్ల మ్రొక్కి చెప్పినరీతి వ్రతముల నోఁచితి వరుసతోడ
అనివారితంబుగ నతిథిజనంబుల కన్నంబుఁ బెట్టితి హర్ష మొదవ
బహుదక్షిణలు పెట్టి గ్రహయజ్ఞములు పెక్కు లొనరించితిని విప్రజనులతోడ

తే. పుణ్యకర్మోచితస్నానభూరిదాన, ధర్మముల నాచరించితిఁ దత్త్వమతినిఁ
బొందలేనైతి నేమిటఁ బుత్త్రలాభ, మనుచుఁదలపోయుచుందు నాయాత్మలోన.

సీ. సత్పుత్త్రవతిగాఁగ శైశవక్రీడల సొంపుగాఁ గన్నులఁ జూడ లేదు
బాలురమాధుర్యభాషావిశేషముల్ వీనుల కింపుగా వినఁగలేదు
వెలయఁగ నాఁడుబిడ్డలకు నల్లుండ్రకు నిష్టపదార్థము లీయలేదు
కమనీయధర్మార్థకామమోక్షములకు నాస్పదం బైనపుణ్యంబు లేదు

తే. నైహికాముష్మికఫలంబు లందరాదు, హరునికృపచేత సకలసౌఖ్యములు గలిగి
నసఘ సత్పుత్త్రుఁ డేయుపాయమునఁ గల్గు, నావిధానంబుఁ దెలిసి నా కానతిమ్ము.

వ. అనినఁ గుసుమసెట్టి యిట్లనియె. 63

క. ఈలోకసుఖముకంటెను, నాలోకసుఖంబె మేలు నాత్మజుకొఱకై
యేలా నీకు విచారము, చాలదు ధర్మంబు మనకు జలజాతాక్షీ. 64

క. అనుటయు సతి పతి కిట్లను, ఘనదానతపోజపములఁ గలిగినఫలముల్
విను మది లోకాంతరమునఁ, దనయుం డిహపరసుఖంబుఁ దప్పక యిచ్చున్. 65

వ. అనినఁ గుసుమగంధికిఁ దత్పతి యిట్లనియె. 66

సీ. అఖిలధర్మంబుల నాచరింపఁగ వచ్చు ననఘుఁడై మానుషయత్నమునను
దేవాసురుల కైన భావింపఁగారాని తనయసంప్రాప్తి నా దైవికంబు
నీమనోహర మైన నిజపుత్త్రసంలబ్ధి కలుగునుపాయంబుఁ దలఁచువాఁడ
వెలయు సంతతిలబ్ధి విద్వజ్జనులచేత దెలిసి తదీయోపదేశమునను

తే. సకలజనసన్నుతోదార సత్కుమార, లాభ మొనరింతు హృదయవిలాస మైన
యుక్తిసాధింతునని కాంతనూఱడించె, మృదులమాధుర్యవాగ్వృత్తిసదయుఁ డగుచు.

క. అనిపలికినఁ గుసుమాంబిక, మనమున సంతోషపూరమగ్న యగుచు స
త్తనయులఁ గాంచెడి వేడుకఁ, దనపతి దైవంబుగాఁగఁ దలఁచుచు నుండెన్. 68

వ. ఆరాత్రి సుఖశయానులై నిద్రించి మఱునాఁ డుదయంబున మంగళపాఠకగానం
బులవలన మేల్కాంచి కుసుమసెట్టి శివస్మరణ నేయుచుఁ గాశీక్షేత్త్రాదిపుణ్యస్థానం
బులను హేమకూటశ్రీశైలాదిపర్వతంబులను గంగాదినదులను హరిబ్రహ్మలను

నారదమార్కండేయగౌతమకపిలభృగువసిష్ఠాదిమునుల నరుంధతీలోపాముద్రాది పుణ్యాంగనలను నలహరిశ్చంద్రాదిమానవేంద్రులను దలంచి లేచి యగ్రభాగంబున బృందావనకపిలధేనువులం గని నమస్కరించి ప్రాతస్స్నాన సంధ్యావిధులం దీర్చి సర్వాభరణభూషితుం డై శుభముహూర్తంబున బ్రాహ్మణాశీర్వాదంబులు గైకొని వారలకుఁ దాంబూలంబు లొసంగి బంధుజనపరివృతుం డై నగరేశ్వరజనార్దనస్వాములకు నుతిపూర్వకంబుగా దండప్రణామంబు లాచరించి సమస్తమంగళాలంకృతం బైన నగరేశ్వరస్వామి భోగాగారముఖమండపముం జేరి. 69

మ. పరమజ్ఞానగరిష్ఠులన్ బహుతపఃప్రారంభగంభీరులన్
గరిమాధఃకృతభోగిపుంగవులఁ దర్కప్రౌఢతామాన్యులన్
గురువేదాదిపురాణశాస్త్రవిలసద్గోష్ఠీపరిజ్ఞాతలన్
వరధర్మాత్మకులం గృపారససుధావాష్టిప్రులన్ విప్రులన్. 70

సీ. బహుకాంతిభాస్కరు భాస్కరాచార్యుని బద్మనాభనిభునిఁ బద్మనాభు
భీమప్రతాపుని భీమనాథుని వామదేవుని నమ్మహాదేవు శివుని
సారస్వతాఖ్యుని షణ్ముఖు సర్వదేవాఢ్యుని గణనాయకాఖ్యు రుద్రు
శంకరాచార్యుల శంభువిరూపాక్షు బ్రహ్మ నీలగ్రీవు భైరవేంద్రు
తే. వంశు లైనట్టి ద్విజులను నధికభక్తి, యుతుల వైశ్యుల సాధుల నొప్పమిగులు
విదితనగరేశకల్యాణవేదియందు, నమ్మహాసభఁ జూపట్టెఁ గుసుమసెట్టి. 71

## కుసుమసెట్టి పుత్రకామేష్టియత్నము.

వ. అట్టిదివ్యసభం గాంచి యాకుసుమసెట్టి ప్రదక్షిణపూర్వకంబుగా దండప్రణామంబు లాచరించి కృతాంజలి యై యిట్లనియె. 72

క. సంతానముసంసారికి, సంతానం బై తనర్చు సంతతమును స
త్సంతాన మెట్లుగలుగును, సంతసమున నానతిండు సభవా రనినన్. 73

వ. వారలయందు భాస్కరాచార్యుం డిట్లనియె. 74

ఉ. నీవు మహానుభావుఁడ వనింద్యచరిత్ర సుధర్మబుద్ధిచే
నేవిధి నైన సంతతుల నేఁడిటిలోపల నా టొనర్చినన్
దేవహితంబు గావున సుదీర్ఘతఁ జేసినలోకమందు సం
భావనఁ బొందఁ జాలుదువు పాపలు లేరని చింత లేటికిన్. 75

వ. అయినను బుత్రాపేక్ష నడిగితివి గావునఁ దొల్లి యనేకక్షత్రియులు సంతతిలేని వారై పుత్రకామేష్టి యాచరించి సంతానంబు వడసిరి యొప్పుదేని నీయధ్వరం బాచరింపుము తద్విధం బెట్లనిన నొకలక్షశాలితండులంబులును బదిలక్షలు నానా ఫలంబులును ననేకసమిత్కుశపుష్పంబులును సప్తముఖంబుల భద్రగజతుండం

బులచందంబున నాజ్యం బతిప్రాజ్యంబుగా నాహుతుల నొసంగవలయును. మఱియుఁ బదివేలగోదానంబులును షోడశమహాదానంబులును చేయవలయును. దీనం జేసి పుత్రవంతుండ వయ్యెద వనిపలికిన మహాప్రసాదం బని మ్రొక్కి యొక్కశుభ ముహూర్తంబున యజ్ఞశాల గంగాతీరంబున నమర్చి యాభాస్కరాచార్యు నాచార్యకంబునకు నియమించి కొందఱు విప్రుల నుపద్రష్టలఁగాను గొందఱ బుత్త్విజులఁగాను దక్షిణభూసురుల యజ్ఞాంగకర్తలఁగాఁ బ్రార్థించి మహాయంత్ర దీర్ఘికల నాజ్యంబు వట్టించి యపరిమిత సమిత్కుశఫలశాలిజాలాక్షతప్రసవక్రముక నాగవల్లీ దళపంచగవ్యపల్లవామృత పుణ్యతీర్థనానావిధరత్నసువర్ణచీనిచీనాంబరసుగంధమాల్యాదియజ్ఞోచితసమస్తవస్తువులను బహువిధకుండమండపంబులను యూపస్తంభంబు మొదలుగాఁ గలయజ్ఞోచితవస్తువుల సమకూర్చి పుత్రకామేష్టి సేయం దొడంగిన. 76

సీ. స్ఫుటతరభంగిని బుణ్యాహవాచన ఘోషంబు లంతంతఁ గొమరుమిగుల
సంగీతస్వరశుద్ధసామగానంబులు బ్రాహ్మణజనములు పాడుచుండ
శాంతిసంపద నొప్పు సద్బ్రాహ్మణుల మించు మంజులాశీర్వాదమహిమ లలర
మహితనానావేదమంత్రంబులును మూర్తిమంతంబులై దీప్తిమంతములుగ
తే. సప్తజిహ్వల ననలుండు సర్వగతుల
నొనర హవ్యసారంబు లాహుతి గొనంగ
భద్రగజతుండసదృశమౌ భవ్యధార
గురిసె నయ్యగ్నిమత్కుండకుహరభూమి. 77

వ. ఇవ్విధంబునఁ బుత్త్రకామేష్టి సేయుచుండ సప్తాహంబులు చనిన యనంతరంబ. 78

చ. అనలుఁడు శ్వేతకేతుఁడు మహాధ్వర మొప్పఁగఁ జేయుచుండఁగా
ఘనముగ నాజ్యధార లధికంబుగఁ గ్రోలి యజీర్తి నొందునాఁ
డనఘు మహాప్రతాపుఁ డగునర్జును సొంపున నార్తి దీఱె న
ట్లనుపమశౌర్యుఁ డొక్కఁడుఁ గలండె యటంచుఁ బ్రసన్నమూర్తి యై. 79

వ. ఇట్లు చింతించి యనలుండు కైలాసంబునకుం జని. 80

చ. హరునకు విన్నవించిన మహాకృప నొంది సదాశివుండు దా
నరుదుగ నాత్మశక్తి నఘహారిణి మౌక్తికతారహారిణిన్
గర మనురక్తిఁ జూచి సుతకారణ మధ్వర మొప్పఁ జేయు నా
వరవణిగన్వయాఢ్యున కవశ్యము నీవు ప్రసన్నమూర్తి వై. 81

క. కామితఫలముల నొసఁగుము, శ్రీమహితుఁడిగా నొనర్చు శీఘ్రం బనినన్
సోమకళాధరునాజ్ఞా, సామర్థ్యం బెఱిఁగి శక్తిసంభ్రమ మెసఁగన్. 82

శా. విద్యుత్పుంజము లేక మై యలరెనో విస్ఫారవజ్రాహతిన్
ఛేద్యంబై తెగి మేరుశృంగ మిలపై భీమోద్ధతిం గూలెనో
చోద్యం బంచుఁ గ్రతుస్థలస్థితజనస్తోత్రంబు లొప్పారఁగా
సద్యోద్యోదిత మయ్యె నుజ్జ్వలరుచి న్శర్వాణి నిర్వాణియై. 83

గీ. అగ్నికుండమధ్యమాంతరంబున నిల్చి, యద్భుతంబు గాఁగ హరునిపత్ని
తగఁ బ్రసన్న యైనఁ దా నంతటను మ్రొక్కి, శిరమునందుఁ జేర్చి కరయుగంబు.

క. జయజయ సకలాభీష్టద, జయజయ లోకైకమాత జయరిపుఘాతా
జయజయ భవాని పావని, జయజయ ననుఁ బ్రోవు మింక జలజాతముఖీ. 85

దండకము. జయజయ శివే మహాలక్ష్మి గీర్దేవతే శక్తి కంకాళి హుంకారిణి ప్రాణరక్షా
కరాళి త్రినేత్రి త్రిశూలి త్రివేదస్వరూపే భవాని శ్రియం దేహి మే పాహి
మాం దేవదేవి త్రయీసర్వదే నిర్వికల్పే సమస్తాపదుద్ధారిణి ధ్యానదీనాపటిష్ఠే
గరిష్ఠే వసిష్ఠాదిసంసేవ్యమానాంఘ్రిపద్మే శరణ్యే నమస్తేస్తు తే దేవి తుభ్యం
నమస్తే. 86

వ. అనుచు ననేకప్రకారంబుల స్తుతించిన కుసుమాఖ్యుం జూచి యంబ యిట్లనియె. 87

క. సంతసమున నీకాంతకు, సంతానము గల్గు ననుచు సంతసమెసఁగన్
సంతానార్థప్రద మగు, సంతానఫలద్వయంబుఁ జతురత నొసఁగెన్. 88

వ. ఇట్లు మహాశక్తి ప్రత్యక్షంబై వరం బొసంగి యంతర్ధానం బైనఁ గుసుమాఖ్యుండు
సంతసిల్లి భూసురాశీర్వాదయుక్తంబుగా మంత్రపూతంబుగాఁ దనధర్మపత్నియగు
కుసుమాంబ కాఫలద్వయం బిచ్చుతఱి నొక్కఫలంబు సమూలంబుగ నుండె మఱి
యొక్కటి మూలంబు వదిలియుండె నందున కార్యులు సంశయించుచుండ నామె
తత్ఫలద్వయం బనుభవించె. తదనంతరంబు ఋత్విగ్గణంబులకు ననేకబ్రాహ్మణు
లకు భాస్కరాచార్యులకు నిష్టంబు లైనవస్తుసంపద లొసంగి సుఖం బుండె
నంతఁ గుసుమగంధి గర్భంబుఁ దాల్చి. 89

క. అనఘసురద్రుమఫలములు, వినుతముగా ననుభవించి విభ్రమగరిమన్
దిననాథుఁ బగిది నొప్పెను, ఘననిధి రత్నైకరత్నగర్భయుఁ బోలెన్. 90

ఉ. చెక్కులు పల్చఁబాఱె నునుజిట్టుములయ్యె మొగంబు వాడెఁ జ
న్ముక్కును నల్పునొందె నడుముం దరులుం జెలువారె నారుసోం
పెక్కెఁ గనుంగవ న్మెఱుఁగు లేర్పడె నొప్పె మనంబు కోరుకుల్
పెక్కువిధంబులం బొదలెఁ బ్రీతిగ నాతికిఁ జీరచిక్కెనన్. 91

క. పొత్తికడుపు మెఱుఁ గెక్కెం, జిత్తము జడనుపడఁ దోఁచెఁ జెలికత్తెలతో
మెత్తనినడ మెలఁగఁగఁ గని, మెత్తని పాన్పునను నిదుర మెలఁగఁగఁ జేయన్.

క. కొమ్మకుఁ బులు పెంపయ్యెను, గమ్మని మన్నంతకంటెఁ గడుఁజవి కెక్కెన్
దమ్మిమొకమ్మున నెక్కెన, తుమ్మెద లనఁ జన్నుదోయి తుదలొప్పారెన్. 93

క. విశదముగ వైశ్యసంతతి, శశాంకునకు నెఱుఁగఁజెప్పి సఖులింపున స
ర్వశుభంబులుఁ గూర్చిరి త, చ్ఛిశువుఁ గన స్వేదఱుచులుచెలి కేలుంపుక్. 94

గీ. మూఁడునెలలు చలిమిముద్దులు వెట్టిరి, కలుపుగూళ్లు నాఱు నెలలు వెట్టి
రిడిరివివిధరుచుల నెనిమిదియవనెల, సతికిఁ జూలు నెలలు జరగునపుడు. 95

గీ. తొలుతఁ బొదలె నెడమవలను నాసుదతికిఁ, బిదపఁ గుడిని దిరిగె వెలఁదికంతఁ
జంట జీలు గలిగె సతికి నానాఁటికిఁ, బుత్త్రుఁ డేమొ యంచుఁ బొంగుచుండ. 96

క. ఆసతి కాఘనుఁ డష్టమ, మాసంబునఁ గెంట్లెమును నమరఁ బెట్టి మహో
ల్లాసంబున నుండఁగ నవ, మాసంబులు నిండె గర్భమహిమ యెలర్పన్. 97

ఆ. చన్ను విరియఁ బొదలె జఘనంబు ఘనమయ్యెఁ
బలుకఁ గష్టమయ్యెఁ బడఁతి కపుడు
రాజయోగ్య మైనరతనంబు డాఁచిన
పసిఁడిపెట్టె యనఁగఁ బరఁగెఁ గడుపు. 98

గీ. నాభి నెఱియ విరిసె నడుము నొవ్వఁ దొడంగె, సతులు వేగ మంత్రసానిఁ దెచ్చి
కూడి మెలఁగ దండికుట్లను బొదలక, నాతి యంత సుప్రసూత యయ్యె. 99

ఉ. తేజ మెలర్ప నా ప్రథమదిక్సతి చంద్రుని జంద్రికాప్రభన్
భూజను లెల్ల మెచ్చఁ గడుఁ బొల్పుగఁ గాంచినరీతి నాతియున్
వేజలజాప్తుఁ డాదిస్థిరవేళ గ్రహంబులు నుచ్చయందు వి
భ్రాజితు లైనవేళఁ గనె భానుఁడుఁ బుత్త్రుని బుత్త్రికామణిన్. 100

క. మందానిలములు వొలయఁగ, బృందారకపుష్పవృష్టి ప్రియమునఁ గురియన్
మందరనినదముతో సుర, దుందుభులును మ్రోసె నపుడు ధూర్జటి కరుణన్. 101

వ. అంత నక్కుసుమసెట్టి. 102

క. నందనుసిసూతికాగృహ, మందులకుంజనియు స్నాన మాడియు నంతన్
నందితుఁడై పుత్త్రోత్సవ, మందఱు వొగడంగఁ జేసె నాగమఫణితిన్. 103

వ. ఇవ్విధంబునఁ బక్షాంతంబు గడపి జాతాశౌచాంత్యదివసంబునఁ బుణ్యాహవాచన పూర్వకంబుగా నామకరణంబు సేయుతఱి నశరీరివాక్యంబుల శిశుం డాకుమారునికి విరూపాక్షుండును నక్కన్యకు వాసవి యనియు నభిధానంబుల నొనరింపు మని యానతిచ్చిన గగనవాణి వాక్యంబుల కందఱునాశ్చర్యంబు నొంది యాకుసుమసెట్టి యుఁ బుత్త్రుల కశరీరివాగ్గదితాభిధేయంబు లిడి యామహోత్సవంబున బంధువులకుఁ

గట్నంబు లిడి భూసురాశీర్వాదపూర్వకంబుగా మంత్రాక్షత లందికొని వారి కనేక
వస్త్రభూషణగంధమాల్యతాంబూలంబు లొసంగి యనిచి బంధుయుక్తంబుగా
భోజనంబు లాచరించి సుఖంబుండెఁ దదనంతరంబున దినదినప్రవర్ధమాను లగుచు
నాకుసుమసెట్టిపుత్రికాపుత్రులు పార్వతీమైనాకులను లక్ష్మీచంద్రమసులనుంబోలి
శైశవక్రీడావిలాసంబులఁ దల్లిదండ్రులకు సంతోషంబొనర్చుచు సమస్తబంధుపరిజనో
పలాలనంబునం బ్రవర్ధమాను లగుచుండి రాసమయంబున. 104

క. కుసుమాఖ్యశ్రేష్ఠిసుతుం, డసదృశలావణ్యగరిమ నలరుచు నుండన్
రసికులు నౌనని మెచ్చఁగ, మసలెడిపుత్త్రకుని జూచి మది నూహించెన్. 105

క. ఇంచుగ నైదేండ్లయ్యెను, నంచితముగ వీని కక్షరాభ్యాసము సే
యించెద నని యూహించుచు, మంచిముహూర్తంబు నడుగ మహోన్నతుఁడై.

క. భూసురవర్యుల నప్పుడు, భాసిల్లఁగఁ బిలువఁ బంచి ప్రాజ్ఞుల నత్యు
ల్లాసమున నుండి యెంతయుఁ, దా సరగునఁ బిలిచెఁ బురహితబ్రాహ్మణులన్ 107

క. భాస్కరతేజుం డగునా, భాస్కరపండితుని బిలిచి పరఁగంగ మహా
జస్కరు లీయర్భకునకు, సంస్కారము సేయుఁ డనుచు సద్వినయముతోన్. 108

వ. అని యివ్విధంబునం బ్రార్థించిన గంధమాల్యాంబరాదిభూషణంబుల నలంకరించి
బాలునిచే నమస్కరింపం జేసి కనకంపుఁ బళ్లెరంబులోఁ దండులంబులుంచి యందు
షడక్షరంబులు లిఖియింపంజేసి సమానవయస్కు లగుకొందఱు బాలుర సహపాఠకు
లుగాఁ గూర్చి విద్యాభ్యాసంబు సేయించుతఱి నాడింభకునకు నీతిధర్మజ్ఞానబీజంబు
లుపన్యసించుచుండ రెండుసంవత్సరంబులు జరగుసమయంబున. 109

గీ. కురుకుమారుల కెంతయుఁ గుంభజుండు
సకలవిద్యలఁ గఱపినచందమునను
నన్నివిద్యలఁ దగవిరూపాక్షునకును
సఫలముగఁ జెప్పె భాస్కరాచార్యవరుఁడు. 110

వ. అంత సకలవిద్యాపారంగతుం డైనశిష్యుని బరీక్షించి కుసుమసెట్టి కిట్లనియె. 111

గీ. కుసుమసెట్టి కపుడు కొడుకును జూపించి, వీనివిద్యఁ జూడు విమలయశుఁడ
యనిన సంతసిల్లి యావైశ్యవరుఁడును, వినియె విద్యలెల్ల వీను లలర. 112

వ. ఇట్లు సంతసిల్లి తనకులసతిని బిలిచి కుమారుఁడు విద్వాంసుఁడయ్యె నిఁక నుపనయ
నంబు గావింతమనిన సంతసిల్లె నంత. 113

సీ. భూసురోత్తములను బొందుగాఁ బిల్పించి మంచిలగ్నము విచారించవలయు
నన నట్లకాక యౌననుచు నాచార్యుని రప్పించి యూరప్పుఁ డొప్పుతోడఁ
బంచాంగములు చూచి బాగుగా మాఘశుద్ధంబునఁ బంచమిఁ దనరు లగ్న
మని విన్నవించిన నావైశ్యుఁ డప్పుడు బంధుల రాఁబంచి పరమప్రీతిఁ

గీ. బురము శృంగార మొనరించి భూరిమహిమ, గృహ మలంకరణంబును రహినొనర్చి
పితృపితామహు లత్యంతప్రీతిఁ దనర, వడుగు గావించె సజ్జనవరులు మెచ్చ. 114

గీ. భాస్కరాచార్యుఁ డప్పుడు పరఁగ వేద
విధిని సర్వంబుఁ గావించి వేడ్క మీఱ
భవతిభిక్షామటంచును బలుకఁదల్లి
దండ్రియును భిక్ష పెట్టిరి తనయునకును. 115

వ. మఱియు బంధుజనంబు నానావిధభూషణంబు లిచ్చిన నవి యాచార్యున కొసంగి సకలభూసురోత్తములకు దక్షిణాతాంబూలంబులు నొసంగి నాలుగుదినంబులుఁజరగిన యనంతరంబున బంధుజనంబులకుఁ గట్నంబు లిచ్చి యనిపి యబ్బాలుఁ డధ్యయనాదుల నఖిలవిద్యాపారంగతుండగుటయు నక్కుమారునకు వివాహంబుసేయందలంచి భాస్కరాచార్యుల రావించి సప్తదశపురంబులం దున్నవైశ్యకన్యకలం గాంచి సర్వలక్షణసముపేత యై మనోహారిణి యగుకన్యకం జూచి యడిగిరమ్మనిన నాక్షణంబునన కదలి సుశకునంబులం గాంచి యాయాపురంబులం గలకన్యల నరయుచు హేలాపురంబునకుం జని యాత్రేయగోత్రోద్భవుం డైనయరిదిసెట్టికూఁతురు రత్నవతి యనుకన్యం గాంచి యతనితో నిట్లనియె. అష్టాదశపురంబుల కధీశ్వరుం డైనప్రభాసగోత్రోద్భవుం డగుకుసుమసెట్టికుమారుం డైన విరూపాక్షునకు నీకూఁతురు రత్నవతి నిచ్చి వివాహంబు సేయు మన నతం డిట్లనియె. 116

గీ. కుసుమసెట్టికొడుకు కులదీపకుఁడు వాని, కడుగవచ్చుమీర లార్యవరులు
ఇంతకంటె మాకు నెయ్యది తగుచోటు, నిర్ణయింపు లగ్ననిశ్చయంబు. 117

వ. అనిన భాస్కరాచార్యుం డత్యంతానందకందళితహృదయారవిందుండై క్రమ్మఱఁ బురంబున కేతెంచి కుసుమసెట్టిమందిరంబునకురా నతండు ప్రత్యుత్థితుండై వందనం బాచరించి యడుగులుఁగడిగి యున్నతాసనాసీనుం జేసి పదునేడుపురంబులం గలవైశ్యులసేమం బడిగి మీరరిగినకార్య మాయత్తంబాయెనా యని యడిగినఁ దమబందుగు లాప్తులందఱు నేమంబె. హేలాపురంబునకరిగి కన్నియలం గాంచి యందు నాత్రేయగోత్రసంభవుం డగునరిదిసెట్టికూఁతురు రత్నవతి సర్వలక్షణానవద్యాంగిం గని యావైశ్యోత్తముమందిరంబునకుం జని యతనిచే నర్చనలు గైకొని తగినగద్దియపైఁ గూరుచుండి యాతనిం గని ప్రభాసగోత్రోద్భవుం డగుకుసుమసెట్టి కుమారునకు నీకొమరితె నిమ్మన నతం డత్యానందుఁడై యొడంబడి లగ్నంబు నిశ్చయింపు మనియె. నీవృత్తాంతంబు నీకెఱింగింప వచ్చితి నని పలికిన నాకుసుమసెట్టి భార్యాసమేతంబుగా సంతోషించి "శుభస్యశీఘ్రు" మ్మనునార్యోక్తి గలదు కావున మీ రాలస్యంబుసేయక కొందఱు వైశ్యవృద్ధుల వెంటంగొని చని లగ్న

నిశ్చయంబు సేసి నిశ్చయతాంబూలంబుఁ బెట్టి రమ్మన నాభాస్కరాచార్యుం
డాప్రకారంబున వెడలి హేలాపురంబునకుం జని యరిదిసెట్టి మందిరంబుం
బ్రవేశించి యాతఁ డత్యంతసంతోషంబున నంపఱకు నాసనార్ఘ్యవిధు లిచ్చి
కూర్చుండ నియమించినఁ గొంతసే పిష్టప్రసంగంబులు సేసి యాచార్యుం డతనిం
గనుంగొని. 118

గీ. కుసుమసెట్టిసుతుఁడు కోమలదేహుండు, ప్రవిమలాత్మకుండు భవ్యయశుఁడు
రూపవంతుఁ డగువిరూపాక్షుఁ డీఁక నీదు, తనయ రత్నవతికిఁ దగువరుండు. 119

వ. కావున 'శుభస్య శీఘ్రం' బనువచనానుసారంబుగా శీఘ్రంబ వివాహప్రయత్నం
బొనరింపు మనిన వల్లెయని లగ్నంబు నిశ్చయింపుం డని తాంబూలం బొసంగి
నిశ్చయతాంబూలాదు లాచరించిన నరలి పెనుగొండపురంబున కరుదెంచి కుసుమా
హ్వయునకుఁ దల్లగ్ననిశ్చయం బెఱిఁగించె నాలగ్నసమయం బాసన్నం బగు
టయు నతండు. 120

సీ. సకలబంధువులను సరవితో రప్పించి చీనిచీనాంబరశ్రేణి మఱియు
నవమలమణిమయోజ్జ్వలభూషణంబులు ఘనసారమాదిసుగంధములను
తైలశర్కరగుడతండులాజ్యాదిసద్ద్రవ్యము లనమకూర్చి ధరణిసురులు
పితరుల నెంతయుఁ బ్రీతి నొందఁగఁ జేసి గ్రామదైవంబుల రమణఁ గొలిచి
తే. భాస్కరాచార్యుఁ డాదిగా బ్రాహ్మణులను
బంధుజనములు నిరుగడ భద్రదంతి
వాహనంబుల నెక్కి రా వరుస భద్ర
హస్తిపై నెక్కి రావిరూపాక్షుఁ బనిచి. 121

గీ. తాను నుత్తమవాహంబుపైని నెక్కి, రమణతో వచ్చె హేలాపురంబునకును
అంతవృత్తాంతమును విని యరిదిసెట్టి, యెదురుగావచ్చి తోడ్కొని యేగె నపుడు.

వ. ఇట్లింద్రవిభవంబునఁ గుసుమాహ్వయుఁ దోడ్కొని వచ్చి నానావిధరత్నఖచితం
బగువిడిదిలో నునిచి వారలుం దాను సరససల్లాపగోష్ఠిని గొంతప్రొద్దు పుచ్చి
దివ్యాన్నపానాదులఁ దృప్తులం గావించి నృత్యగీతాదివిద్యావినోదంబుల నద్దివసంబు
గడపి యారాత్రి సుఖసుప్తిం జెంది మఱునాఁడు మంగళస్తుతిపాఠంబుల మే
ల్కాంచి ప్రాతఃకాలకృత్యంబులు నిర్వర్తించి యున్నంత. 123

సీ. పౌరోహితులు వచ్చి పరఁగంగఁ గుసుమాహ్వయుని జూచి శుభలగ్నమునకు మీర
లాయత్తపడుఁ డన నట్టులకా కని గంధాక్షతలఁ బురిఁ గల్గువైశ్య
వరులకు నిమ్మని వారికానతి యిచ్చి శోభనద్రవ్యము ల్సురుచిరముగ
నొనఁగూర్పఁ బంచి తాహోమాదికృత్యముల్ సేయించి బాంధవశ్రేణికెల్ల

తే. నిష్టమృష్టాన్నములచేతఁ దృప్తినొందఁ, జేసి తనయుని వేగఁ గైసేయుఁ డనుచు
నానతిచ్చినఁ జక్కనియతివ లతని, శీఘ్రముగ మోచమొప్పఁ గైసేసి రంత. 124

వ. అంత నయ్యరిదిసెట్టియత్యంతసంతోషంబున శోభనద్రవ్యంబుల నొడఁగూర్చిన హోమాదికృత్యంబు లాచరించి బంధువుల నిష్టాన్నతృప్తులం జేసి తనకూఁతు రత్నవతిని శృంగారింపించి శుభముహూర్తం బాసన్నం బగుటయుఁ గుసుమాహ్వయుని వృద్ధబ్రాహ్మణబంధువుల నంపి పిలువంబంచిన నతండు పెండ్లికొమరుని భద్రగజంబుపై నెక్కించి కరదీపికాసహస్రంబులు వెలుంగ భేరీమృదంగతమ్మటఢక్కాహుడుక్కాకాహళశంఖారావంబులును గరిబృంహితంబులును దురంగహేషారవంబులును గవిగాయకపాఠకవైతాళికసందోహసంకీర్తనంబులును విప్రాశీర్వాదనాదంబులును బుణ్యపణ్యాంగనలకల్యాణపుఁబాటలును నొక్కపెట్టు సెలంగ సౌధాగ్రంబులనుండి పురపురంధ్రీజనంబు లాజాక్షతలు సల్ల, నెడనెడ వారకాంతలు గుడియెడమభాగంబులం జూచువిటకాంద్రహృదయ మదయంబుగ భ్రూలునోరచూపుల నలించుచు నృత్యంబులు సలుప బాంధవస్త్రీలు మౌక్తికనీరాజనంబులు నివాళింప నరిదిసెట్టి మందిరద్వారంబు జేరంజన నాతండు బాంధవయుక్తుండై యెదుర్కొని కుసుమసెట్టికరంబు కరంబునం బూడించి రాఁ దక్కటిబంధుగు లుల్లాసంబునం బొటలాసల్లాపంబులు సేయ వియ్యాపాక్షుండు గజంబు డిగ్గి ముత్తైదువులు నీరాజనం బొసంగఁ గల్యాణవేదిం బ్రవేశించి రత్నావతి నలంకరించి తేర యువతీజనంబుల నియమించిన వార లా పెండ్లికూఁతు నలంకరించి తోడ్తేర నవ్వియ్యాపాక్షుని రత్నావతిని డెరమరుగున నునిచి కన్యావరణంబు చదివి యంత సుముహూర్తం బాసన్నంబైన వధూవరులచేత నొండొరులపైఁ దలఁబ్రాలు వోయించి శాస్త్రానుసారంబుగ హోమంబు బొనరించి కులబాంధవగురుజనసజ్జనులకు నమస్కారంబులు సేయించి సకలవైదికలౌకికాచారంబులు నిర్వర్తించి నాకబలి యాచరించి యరిదిసెట్టి యల్లుని కనర్ఘ్యమణిమయాభరణాంబరాదిసమస్తవస్తువు లరణంబుల నొసంగి బాంధవులకు దివ్యాంబరంబులు కట్నంబు లిచ్చి యర్థుల కీప్సితార్థంబు లిచ్చి యివ్విధంబునఁ గుసుమాఖ్యుండు వివాహమహోత్సవంబు నిర్వర్తించి మరలి తన పురంబునకు వచ్చి గృహప్రవేశాదిశుభకృత్యంబు లాచరించి బంధుజనంబుల బహుమానపురస్సరంబుగా వారివారిగృహంబుల కనిచి పరమానందంబున సుఖం బుండె నంత. 125

చ. పరహితధర్మవర్తనులు పండితభాస్కరవర్గరక్షకుల్
గురునయనీతికోవిదులు గుంభితవాక్యనిరంతరోన్నత
స్థిరతరకౌతుకాగ్రగుణశీలురు శీలవతీసతీమనో
హరులు పురారిపాదజలజాగ్రమదాళులు వైశ్యు లిమ్మహిన్. 126

మాలిని. ధనకనకవికాసుల్ ధర్మసంచారభాసుల్
కనకకుధరధైర్యుల్ కల్పితానల్పచర్యుల్
మనసిజరిపుభక్తుల్ మానినీచిత్తసక్తుల్
వినయఘననివాసుల్ వేద్యపెన్గొండవాసుల్. 127

గద్య. ఇది శ్రీసరస్వతీవిలాసచరణసరసీరుహమకరందబిందుసందోహమధురమధురిమా
ధురీణమధుకరాయమానమానసరసకవితావిలాస శ్రీబ్రహ్మమనీషి బొల్ల(నూ)హ్వాయ
పుత్ర భాస్కరాచార్య నామధేయప్రణీతంబైన వైశ్యపురాణంబునందుఁ బెనుగొం
డవర్ణనంబును గుసుమసెట్టి పుత్రకామేష్టిఁ జేయుటయు వానికిఁ బుత్రుండును
బుత్రికయు జనించుటయు వారికి నామకరణాదివిధు లొనరించుటయుఁ గుమా
రునికి వివాహంబు సేయుటయు ననుకథలంగలది పంచమాశ్వాసము.

శ్రీగణేశాయ నమః.

శ్రీశారదాంబాయై నమః.

# శ్రీ వైశ్య పురాణము.

## షష్ఠాశ్వాసము.



మద్వేంగీదేశ
గ్రామమహాగిరిపురప్రకాశితబుద్ధి
గ్రామణులు రాజరాజ
శ్రీమంతులు కీర్తినిజితశేషులు వైశ్యుల్. 1

వ. ఆకర్ణింపుఁడు. తరువాతివృత్తాంతం బెఱింగించుటకై సాలంకాయనమునివర్యుండు వైశ్యర్షుల కిట్లని చెప్పందొడంగె. అట్లు వాసవి దినదినప్రవర్ధమాన యగుచుండ నొక్కరాజు తనకువివాహార్థం బక్కన్యనడిగె ననిన విని యవ్వైశ్యులాబుషి వర్యున కిట్లనిరి. 2

క. వాఁ డెవ్వఁ డతనివంశము, పోఁడిమితో వానిపురము పూర్వవిధంబుల్
వేడుకతో నెఱిఁగింపుము, పాడిగ నన వారి కతఁడు పలికెం బ్రీతిన్. 3

క. శ్రీమార్కండేయముని, స్వామికి నిలయం బనంగ జగతీ దివిష
ద్ధామము రాజమహేంద్రుని, నామంబున నొప్పుఁ బురము రమ్యస్ఫూర్తిన్. 4

సీ. శ్రీగౌతమీదివ్యసింధుపావనతోయకణవిమర్దితపౌరకల్మషంబు
ప్రకటమార్కండేయపరమేశకారుణ్యసంభూతశాశ్వతైశ్వర్యయుతము
దానధారాసారదంతావళోదారఘీంకారవైఖరీసంకులంబు
జవవిక్రమక్రియాజనితపౌరుషఘనఘనతురంగమవీరకలకలంబు
తే. రత్న ధనధాన్య వస్త్ర హిరణ్య రజత
సార ఘనసార మృగనాభి చందనాది
రమ్యతరపణ్యవీధికారాజితంబు
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము. 5

వ. ఆపట్టనంబున కధీశ్వరుండు. 6

ఉ. ధూర్జటిపాదభక్తుఁ డరిదుర్గవిభేదనశౌర్యశాలి న్యా
యార్జితవైభవుండు విబుధావనకల్పకుఁ డార్యసమ్మతుం
డర్జునవంశవర్ధనుఁ డహర్పతితేజుఁడు విష్ణువర్ధనుం
డూర్జితసర్వసంపదల నొప్పును రాజమహేంద్రనాథుఁడై. 7

క. రాజకళాధరభక్తుఁడు, రాజకులోత్తంసుఁ డన్యరాజయశస్తే
జోజయశాలిగ బరఁగును, రాజితచాళుక్యవంశరక్షకుఁ డెలమిన్. 8

## విష్ణువర్ధనుఁడు దిగ్విజయంబు సేయుట.

సీ. రాజన్యజయశాలి రాజాధిరాట్పరమేశ్వరుండును యశశ్శాశ్వతుండు
ధరణి వరాహాంకధన్యప్రభావుండు కరవాలభీకరఘనభుజుండు
ఆత్రేయమునిగోత్రపాత్రాభిజాత్యుండు ఖడ్గనారాయణకాంతిపరుఁడు
చాళుక్యకులదుగ్ధసాగరచంద్రుండు విమతభీషణదివ్యవిగ్రహుండు
తే. ప్రబలకదనత్రినేత్రుండు పటుతరప్ర, తాపభాస్కరుఁ డత్యంతధార్మికుండు
చండితోద్దండకోదండగాండివుండు, వంశవర్ధనుఁడగువిష్ణువర్ధనుండు. 9

ఉ. సోమకులాగ్రగణ్యుఁడు విశుద్ధయశోనిధి యన్యరాజతే
జోమహిమాపహారుఁడు వసుక్షితిభృత్సమధీరుఁ డిద్ధల
క్ష్మీమహిమాఢ్యుఁ డైయతఁడు మేదిని నేలుచునుండెఁ బెంపునన్
సామజవైరివిక్రముఁడు సారుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్. 10

సీ. అబ్ధిమేఖల యైనయవనిని బాలించె బుధవైరివర్గంబు పొడవడంగ
ధారుణీప్రజల మోదంబునఁ బోషించె నఖిలదిక్కులఁ దనయాజ్ఞ నిలిపె
శరణన్ననృపులను శాశ్వతంబుగ నేలె నెదిరినరాజులమదమడంచె
వర్ణాశ్రమంబులు వరుసతోఁ బాలించె నోలిసంకరము గాకుండఁ దెలిసి
తే. ఆదినృపులచరిత లఖిలధర్మంబులఁ, దాత యైనధర్మతనయుఁ బోలి
నెగడ నెల్లజనులుఁ బొగడంగ విష్ణువ, ర్ధనుఁడు విభవవిజితధనదుఁ డగుచు. 11

క. జవ్వనపురాజ్యమదమున, నెవ్వరిఁ గైకొనఁడు నిర్జరేంద్రుని నైనన్
ఇవ్వసుధ వైరినృపతుల, మువ్వేటం బఱపుఁ బంక్తిముఖుచందమునన్. 12

క. అమరేంద్రవిభవుఁడును రా, జమహేంద్రపురమున నిఖిలజనములతోడం
గుముదాప్తవంశనృపస, త్తముఁ డాస్థానముననుండి తా నతివేడ్కన్. 13

వ. మఱియు నుదయమార్తాండమండితకుంభవిజృంభమాణప్రాసాదమధ్యబహురత్నకీలిత
ప్రభానూనవితానంబును మరకతమణిమయసోపానరచితచంద్రకాంతవేదికాప్రదేశ
నివసదవనీతలతిలకంబును మణిగవాక్షమార్గగతమలయసమీరమార్గణోదితమేదినీశ్వర

స్వేదఖేదంబును సువర్ణస్తంభగుంభితముక్తాసుధాధౌతనిర్మలకుడ్యస్థలవిరచితచిత్రరూపమంగళశృంగారజనితకుతూహలంబును రంభోర్వశీతిలోత్తమాదిబృందారకసుందరీసందోహకళావిలాస తిరస్కార నిపుణ సౌందర్యలజ్జాభాషావిశేషభావార్థకటాక్షవీక్షణప్రణయకలహాదివిలాసమానమానినీజనసేవితంబును బహుళముక్తాఫలరంగవల్లీసముల్లాసితసురభిపుష్పమాలికాలంకృతంబును భరతనిరతనర్తనకామినీరమణీయకాగ్రంబున సేవాసమాగతనానాదేశరాజలోకాభిధాననివేదనచతురయాతాయాతవేత్రధారకవచోజ్జృంభణంబును నగునాస్థానమంటపాభ్యంతరసమున్నతమణివేదికాస్థాపితసింహాసనాసీనుం డై బహురాగభేదమిశ్రితపంచమస్వరసమంచితాలాపం బగుసంగీతంబును మంగళగాయకోత్తము లగ్రభాగంబున గానం బొనర్ప నుభయపార్శ్వంబుల నుచితమృదుమధురవాక్యకవితాజనసూక్తంబు లాలకించుచు వామభాగస్థితసుందరీజనకరాగ్రనర్తితచామరడోలాయమానమణికంకణసంఘాతశింజితంబును హృదయరంజకంబుగా విద్వజ్జనవ్యాఖ్యాయమానభారతాదికథాశ్రవణజనితజ్ఞానుం డై పరాక్రమవంతు లగురాజులకు దిగ్విజయంబు సేయుట యశస్కరం బని తలంచి సమీపవర్తు లగునమాత్యులలోఁ గుమారకంఠీరవుం జూచి యిట్లనియె. 14

క. జవతురగరథేభభట, ప్రవరులతో నృపతు లెల్ల రావలె దశమీ
దివసము దిగ్విజయమునకు, నవసర మని చాటఁ బంపు మంచుఁ బెలుఁగన్. 15

చ. అనుటయు నట్ల కాక యని యాసచివేంద్రుఁడు చాటఁబంచినన్
జనపతు లెల్ల నుబ్బి ఘనసాహసశౌర్యమహాధురీణు లై
యనుగతఘోటకద్విపరథాధికయోగసమన్వితంబుగా
మునుకొని విష్ణువర్ధనునిముందఱ నిల్చిరి చిత్రవైఖరిన్. 16

క. ధీరతఁ బతి నిత్యకృతా, చారుం డై వెడలునట్టిసమయమునందున్
ధీరత మెఱయఁగ నిజభట, వీరులఁ బ్రస్థానభేరి వ్రేయఁగఁ బంచెన్. 17

సీ. భయరౌద్రసంజాత భైరవాట్టహాసఘోరఘీంకారనినాదంబు ధిక్కరించి
లయకాలవైష్ణవభయదాశ్వహేషితా మందనినాదంబు క్రిందుపఱచి
సంవర్తసమయగర్జనపుష్కలావర్తకాభ్రనిర్ఘోషంబు నపహసించి
రఘురామకృతఘనుర్భంగసంజాతనిర్భరనినాదంబుతో రాయిడించి

తే. సకలదేశసమాగతక్ష్మాతలేశ
చారు హృదయప్రకంపసంజనన హేతు
విక్రమకృతాభిచక్రనిర్వక్రమహిమ
విశదముగ మ్రోసెఁ బ్రస్థాన విజయభేరి. 18

సీ. మణిహేమకలశాభిమంత్రోదకంబుల మంగళస్నానంబు మహిమఁ జేసి
స్థిరమతినగ్నియు దేవతార్చనదీర్చి యభిమతాహారంబు లారగించి
బ్రాహ్మణాశీర్వాదపావనాక్షతములు ఘనమతి మస్తకమున ధరించి
ఆప్తమంత్రులను శుద్ధాంతరక్షణమున కనిపియుఁ బురరక్షకు నియమించి
తే. జయము చేకొని యుత్తమాశ్వంబునెక్కి, పౌరకాంతావిలోకనచారుదృష్టి
బహుళపుష్పాంజలిక్షేమభావ మలర, నఖిలదిగ్విజయార్థమై యరిగె నృపతి. 19

మ. రజనీశాన్వయవర్ధనుండు ధృతరాష్ట్రక్ష్మాపనిర్భేదకా
గ్రజుఁడున్ ధర్మగుణప్రవృత్తి రణరంగద్భీమసేనార్భటిన్
విజయుండై తగువిష్ణువర్ధనుఁడు దావిశ్వంభరామండలిన్
విజయోద్యోగము సేయకుండునె మహావీరుల్ ప్రశంసింపఁగన్. 20

వ. ఇట్లు దిగ్విజయార్థంబు గదలె నయ్యవసరంబున. 21

సీ. చతురంగబలవేగసన్నాహపదసముత్థితరజఃపటలంబు దిశలఁ గప్ప
గంధసింధురఘటాకర్ణతాళోద్ధూతపవనంబు తద్రజఃపటలి నడఁప
బహురథస్తంభశుంభద్రత్నకేతుకాంతులు నభంబునఁ జీఁకటులఁగఁజేయ
నురుఖడ్గసంఘర్షణోద్ధూతవిస్ఫులింగములు దిక్కులకుఁ బ్రకాశ మొసఁగ
తే. ఘోటకాటోపహేషితకుంజరోగ్ర, మహితఘీంకారఘోషభీమప్రతాప
కార్ముకజ్యారవంబు లొక్కటఁ జెలంగ, సిరులఁ బెంపొంద నారాజుసేన నడచె. 22

చ. హరులు తరంగము ల్గజములందు మునింగినశైలసంఘముల్
అరదము లెల్లఁ గచ్ఛపము లందముగా నరులెల్ల మీనముల్
గురుతరమైన సుళ్లు గొడుగుల్ మఱిఫేనచయంబు లీల నా
శరనిధిఁ బోలె నానృపతి సాగెడువేళ నపారసైన్యముల్. 23

క. ముందఱ బ్రతాప మడరఁగఁ, గ్రందుగఁ జతురంగసైన్యగమనముచేతం
జెందుపరాగము వెనుకను, స్యందనములు నడువ బలముచతురత వెలయన్. 24

సీ. హయవధూరత్నహేమాదులుకానుకల్ ముందుగాఁ గొనివచ్చి మ్రొక్కునృపులు
శరణాగతత్రాణసంపన్నుఁ డితఁ డని కొలవడి సేవించి కొల్చునృపులు
వైరి గెలఁగలేనిపోరాట మేలని పురములు విడనాడి పోవునృపులు
దగ్గఱవచ్చినఁ దబ్బిబ్బు లౌనని దూరంబుననె చూచి తొలఁగునృపులు
తే. మరలిరేకాని బహువిక్రమముల నెదిరి
నిలువలేరయ్యె బహుశక్తి గలిగియుండి
తొలఁగి రేమనవచ్చును బలిమిగలిమి
ధైర్యదుర్వారవిష్ణువర్ధనుని ధాటి. 25

వ. ఇట్లమోఘవీర్యుండై వెడల చనిచని కార్తవీర్యుఁ డేలెడిమాహిష్మతీపురంబు చేరం జని యక్కడఁ గంటకపర్వతంబున సేనలు విడియించిన. 26

క. వచ్చినకురువిభుతాకకు, మచ్చరమునఁ గురుమరాట మగధాదులుసొం
పెచ్చిన ముదమున వారలు, చెచ్చెరఁ దలఁపడరి వీరశేఖరు లలరన్. 27

వ. ఇట్లిరుదెఱంగులవారు పోరి రాసమయంబున. 28

గీ. విష్ణువర్ధనరాజుతో విగ్రహించి, మడిసి రచ్చటిరాజు లమర్త్యు లెంచఁ
కడమ తక్కినరాజులు గర్వ ముడిగి, శర ణనుచు మ్రొక్కి రాతనిచరణములకు.

వ. ఇట్లు నర్మదాతీరంబునం గల రాజులెల్లను వెంటరాఁ గదలి నానావిధంబు లగుదుర్గంబులు సాధించి వారలచే నుపాయనంబులుగొని యచ్చటచ్చట నిజ విజయస్తంభంబులు నిలిపి చనుసమయంబునం గళ్యాణపట్టణాధీశ్వరుం డగుసామంతక్షితీశ్వరుండును దద్వశవర్తు లగురాజులును బ్రతిఘటించిన విష్ణువర్ధనుండు విజృంభించి విజయసింహ విక్రమశాలి వీరసేన సుమంత శాంతనవ చంద్రచూడ సింహధ్వజసునందనామంద విక్రమ బలోద్ధత భీమవిగ్రహ సమగ్రాయుధ శుభగ్రీవ మహావీర కంఠీరవ సుబుద్ధి సర్వజ్ఞు లనుషోడశరాజప్రధానులును మఱియు విక్రమనీతిబంధు ప్రభాకరు లాదిగాఁగల యనేక సేనానాయకులును గలసి వారల నిర్జించి తత్పురంబులు గ్రహించి యచ్చోటుగదలి కురుపరాటాంగవంగశకఘూర్జరారట్టగాంధారదేశంబులు సాధించివచ్చుచోఁ ద్రివేణీ సంగమస్థానంబునఁ గృతస్నానుం డై యచ్చటఁ గదలి యయోధ్యం జేరి యచ్చటనుండి హరిద్వారంబును నైమిశారణ్యంబునుం గని యవ్వల సింధువు దాఁటి రుమ్మీదేశంబుఁ జేరి వారల నిర్జించి సవాలక్షపర్వతంబులు చూచి యచ్చటనుండి యనేకదేశంబులు గడచి శబరపుళిందబర్బరాదిదేశంబులవారి జయించి యచ్చటనుండి దక్షిణాభిముఖుండై కొంకణదేశంబు ప్రవేశించి పశ్చిమసముద్రదేశవాసు లగురాజన్యుల జయించి యచ్చటనుండి సహ్యాదర్దురపర్వతంబుం గడచి సేతువుం జేరి. 30

క. కనుఁగొనె రాజకుమారుఁడు, వనధిం దద్వనధిఁ గ్రుంకి వచ్చియు రామే
శుని బూజించె నవశ్యము, ధనకనకవిశేషవస్తుతతు లొనఁగూడన్. 31

వ. అచ్చోటు వాసి. 32

శా. దండింబాండ్యధరాధినాయకులదుర్దాంతోగ్రశౌర్యంబు దో
ర్దండోద్దండతరప్రభావమున శ్రీరంగంబు సేవించి చం
ద్రుం డచ్చోట దురంతకల్మషము దొంతుల్డుల్చు నాకొల్చి కే
గొండం గాచినవాని వంశజుఁడు హాయిం దోఁగి యాపిమ్మటన్. 33

గీ. మహితమైనట్టి శ్రీరంగమండపంబుఁ
జొచ్చి పరవాసుదేవుని జూచి యంతఁ
జిన్మయాకార సర్వేశ శ్రితజనార్తి
హారణ శ్రీరంగనాయక యనుచు మ్రొక్కి. 34

వ. మఱియు ననేకవిధంబుల స్తుతియించి యచ్చోటు వాసి. 35

సీ. జలమయం బైనయట్టిమూజంబుకేశుఁ, దగుమహాదేవు భజియించి యచటినుండి
విశ్రుతము లైనయుభయకావేరులందుఁ, దానమునకును విష్ణువర్ధనుఁడు వచ్చె. 36

శా. వీరాగ్రేసరనాయకుం డుభయకావేరిం బ్రియంబొప్ప నిం
పారం దానముచేసి దుష్టరిపురాజాధీశు లౌ చోళభూ
త్రీరాజేంద్రులఁ జేరఁగాఁ గదలి వారిం గెల్చి శిక్షించి తా
నారూఢిం దగుకుంభకోణమున కాహ్లాదంబునం జేరుచున్. 37

వ. అచ్చటఁ గుంభేశుని దర్శించి మధ్యార్జునంబుఁ జేరి యందుఁగలమహాదేవుం బూ
జించి చిదంబరంబునకుం జనుదెంచె ననిన వైశ్యు లమ్మహాత్మున కిట్లనిరి. 38

ఉ. అనఘా మానికులాగ్రగణ్యక మహాత్మా పుణ్యచారిత్ర స
ద్ఘనుఁ డారాజు చిదంబరంబునను వేడ్కంగాఁగ నేమేమి గాం
చెను వచ్చేతఱి నేప్రభావములు కాంచీదేశమాహాత్మ్యముల్
వినని మ్మాతని వెంట నంటిచనునావిఖ్యాతు లౌరాజులన్. 39

క. అనుమాటకు మునినాయకుఁ, డనుమానము లేక వారికంతఃకరణం
బునను భవిష్యత్కథ వినుఁడనుచును మృదుమధురవాక్య మలరఁగఁ బలికెన్. 40

ఉ. శ్రావ్యముగా వినుండు నృపరాజశిఖామణి యైనయట్టికా
రవ్యుఁడు విష్ణువర్ధనుఁడు రాజకళాధరుభక్తుఁ డట్లు శ్రో
తవ్యుఁడు నయ్యె నచ్చటఁ జిదంబరపూర్వరహస్య మెల్ల నూ
రవ్యవరేణ్యులార! రిపురాజవిఘాలు బలంబు లన్నియున్. 41

వ. వివరించెదవినుండు పండ్రెండులక్షలునలుబదిరెండువేలుకాల్బలంబును నందు రెండు
లక్షలునిరువదివేలువిలుకాండ్రును రెండులక్షలుపందొమ్మిదివేలుఖండాయత్తులును
లక్షయునలబదివేలు గోవసీమపడిగెవాగెలును లక్షయుముప్పదివేలు కైతలును నైదు
లక్షలమున్నూఱుగుఱ్ఱంబులు నుత్తమలక్షణంబులు ముప్పదిరెండువే లుష్ట్రంబులును
నలువదియైదువేలు గంధసింధురంబులును నన్నియరదంబులును ఘోఁగిలీరుమ్మిదేశ

పాశ్చాత్త్యులు రెండులక్షలు, రెండులక్షలునిరువదియెనిమిదివేలు గుఱ్ఱపురౌతులును నింతటిబలంబు బవిష్ణువర్ధనునియనుచరులై కొలువ దక్షిణదేశంబులు సాధించి మగిడి వచ్చునెడఁ గావేరీనదితూర్పుసముద్రంబునం గలసినసంగమస్థలంబున కనతిదూరం బునఁ జిదంబరం బనుమహాస్థలంబు మహిమంబులు మున్ను విన్నవాఁడై తిరుముట్టు వృద్ధాచలారుణాచలమరకతవల్లీనాథులం గాంచి యచ్చటనుండి కాంచీస్థానంబు ప్రవేశించి తద్గోపురంబు దర్శించి యేకామ్రనాథుఁ గామాక్షీసహితంబుగాఁ బూజించి నుతియించి మ్రొక్కులిడి వేగవతిం జేరం జని. 42

క. ఆగమవిధిని నృపాలుఁడు, వేగవతిం దానమాడి వేగమె కనె నా
భోగిపతితల్ప నటనా, యోగమవిదు లైనవైష్ణవాగ్రణు లలరన్. 43

క. ధన్యపథస్థుఁడు రిపురా, జన్యు లనందగినరాజచయముల నెల్లన్
జన్యమునఁ గెలిచి నృపమూ, ర్ధన్యుం డాకంచివరవరాజులఁ గాంచెన్. 44

వ. మఱియు శేషగిరి దర్శించి యందలితీర్థంబుల నవగాహంబు జేసి యచ్చటనుండి వేంకటాచలంబుఁ జేరి. 45

సీ. సద్భక్తి రెండవచక్రవర్తి యొసంగు దంబైనవరకిరీటము ధరించి
రవివంశజుం డైనరాఘవుఁ డిచ్చిన గణుతింపరానిభూషలను దాల్చి
తనకు ముత్తాతయాధర్మజుఁ డిడినట్టి ఘన మైనయొడ్డాణ మనువుపఱిచి
బహుయుగాంతరము భూపాలు రర్పించిన యమరేంద్రమణులువక్షమునఁదాల్చి
తే. రూపగాంభీర్యసద్గుణరూఢిమహిమ, నెమ్మెకాఁ డైనశ్రీవేంకటేశుఁ జూచి
శరణు శరణని మ్రొక్కి సాష్టాంగ మప్పు, డిడుచు నవిష్ణువర్ధనుం డెలమితోడ. 64

వ. అచ్చటఁ బంచరాత్రంబు లుండి, కాళహస్తిఁ జేరి యద్దేవు దర్శించి పూజించి నుతియించి యచ్చోటు వాసి చనిచని. 47

ఉ. నందిగిరీంద్రసంభవజనప్రకరౌఘసమూహశైలపా
రందరవజ్రధారతటురంగదభంగురభంగసంగతా
మందసరోజబృందగతమాధుకరామలగానశోభితా
నందితతీరభూసరిదనీకినిఁ గాంచెఁ బినాకినీనదిన్. 48

వ. తత్తద్విశేషంబులు గనుంగొనుచు నందుఁ గృతావగాహనుఁ డై కడలి విక్రమసింహ పురం బనంబరగు నెల్లూరు జేరంజని యందలిపశ్వేశ్వరుని దర్శించి యచ్చటనుండి యుదయగిరిం జేరం జని యందలి రాజన్యులఁ దనవశంబుఁ జేసికొని కడలి యహో బలంబు సేరి యమ్మహానుభావుం డగునహోబలేశ్వరు సేవించి యచ్చోటు గదలి.

శా. రేనాటం గలధారిణీశ్వరులు పోరే మాని యారాజనా
థీనం బైనన్నృపాల్గురుం గదిసి యేతేర న్నిరాఘాటధా

టీనిర్వక్రపరాక్రమక్రమముతోఁ గీర్తిన్ విజృంభించి యా
భూనాథుం డరిగెం బ్రసిద్ధనృపరాడ్భూపాలురుం గొల్వఁగన్. 50

ఉ. ఆలలివిష్ణువర్ధననృపాగ్రణిఁ గన్గొని విస్ఫురజ్ఝరీ
జాలము నోషధీతరువిశాలముఁ బుణ్యలతాలవాలముల్
జాలకశంకరప్రముఖభాసురక్షేలము దివ్యమైన శ్రీ
శైలము ప్రాంతవర్ధితరసాలము మాన్యతపోనుకూలముల్. 51

గీ. వనజబాంధవసఖుని సద్బాంధవుండు, శ్రీమహాదేవు మల్లేశుఁ జేరి కొలిచి
భక్తతతికెల్ల ధన మనురక్తి నిచ్చి, కడుఁ బ్రయాణాభిముఖుఁ డయి కదలె నపుడు.

వ. ఇట్లు కదలివచ్చుసమయంబున. 53

మ. అరిరాజన్యు లెదిర్చి నిల్చినను యుద్ధాపేక్ష శిక్షించుచున్
శరణం బన్నఁ గృపాళుఁడై యభయహస్తం బిచ్చి రక్షించుచున్
సరవిం గొల్వఁగవచ్చువారలకు నిష్టప్రాప్తి గావించుచున్
ధరలోనం బ్రతివీరశబ్ద ముడిపెం దత్తత్ప్రకారంబులన్. 54

వ. ఇట్లనేకదేశంబులు గెలిచి యనేకనదీనదపర్వతంబులు దాఁటి చనిచని. 55

ఉ. ఆవిభుఁ డంతఁ గాంచె మహితాంచలచంచలచంచరీకసం
సేవితదానగంధవనసింధురజాలము రత్నసానుసం
భావితశీలమున్ విజయభంజితకోమలచండసైంధవ
గ్రామవిశాలమున్ బహుసుఖప్రదకేలమునింద్రకీలమున్. 56

వ. అనంతరంబు కృష్ణానదిం దర్శించి యం దవగాహంబు చేసి మల్లికార్జును దర్శించి మఱియు నందలిమహత్త్వంబుఁ దెలియం దలంచి మున్నర్జునుండు తపంబు సేయుచున్నయెడ మూకాసురుండు సూకరరూపంబు ధరియించి యచ్చటి కరుగుదెంచిన దానిం జూచి యర్జునుం డొక్కబాణంబు దొడిగి యేసిన నంత శంకరుండు క్రీడాకిరాతవేషంబు ధరియించి పార్వతియుం దాను నవ్వనంబున సంచరించుచు నవ్వరాహంబుఁ గని తా నొక్కమ్ము సంధించి యేసిన నది ముక్తప్రాణం బయ్యె నట శివుఁ డరుగుదెంచి నిజబాణంబుపుచ్చికొని యర్జునునిపై ననేకబాణపరంపరల నత్తఱి నేసి నొప్పింప నయ్యర్జునుండు మహాకోపంబుచే నమోఘబాణప్రయోగంబు చేసె నిట్లియ్యిరువురకు నతిఘోరయుద్ధం బయ్యె నప్పు డర్జునుని ధనుఃప్రహరణంబు శివునిజటాజూటమధ్యంబునఁ జెల్లుమని తాఁకుటచేఁ గిరీటికి నిజస్వరూపంబునఁ బ్రసన్నుండైన నప్పు డప్పాండవమధ్యముండు శూలికిం బ్రణమిల్లి, స్వామీ మీరని తెలియక యిట్లు చేసినవాఁడ నైతినని వినయపూర్వకంబుగా ననేకవిధంబుల స్తుతింప నత్తఱి శంకరుండు కృపగలవాఁడై పాశుపతం బొసంగి యర్జును

సౌందర్యాతిశయంబుఁ బార్వతికిం జూపి యంతర్ధానుండయ్యె. నాఁటంగోలెఁ బార్థప్రహరణం బని శివలింగంబునకుఁ జిహ్నంబయ్యె నట్టిప్రదేశం బిది యని భూకాంతులకుం దెల్పుచు నట చని పాంచాలకురు కుకురుగాంధారాది దేశంబుల రాజుల బశ్చిమంబునకుఁ బాండ్యకర్ణాటచోళాదిరాజుల దక్షిణంబునకు సవినయం బుగ ననిపి యందుల నిలిపి యవ్విష్ణువర్ధనుండు గౌతమీస్నానార్థియై కదలి, తన్ను డిఁగనుంగొని కృతావగాహుండై సేనల నచ్చట నిలిపి విజయసింహముఖులు వెను వెంటఁ గొలువ ముందఱ చనుమనుసమయంబున మార్గంబున దుర్నిమిత్తంబులు గనుంగొని మహేశుని స్మరియించి యంతటఁ గపిలమల్లేశుని దర్శించి పెనుగొండ పురప్రాంతంబునకుఁ జను దెంచుసమయంబున. 57

క. ఆపురవరఘనశృంగా, రోపవనాసన్నభూమి నుత్సాహములో
భూపతి నిలిచెన్ సేనా, కూపారము రాజకార్యకుశలత మెఱయన్. 58

వ. ఇవ్విధంబునం బెనుగొండపురప్రాంతంబునకుం జని జగన్మోహనం బగునొక్క మహో జ్జ్వలసౌధంబుఁ గని పరమానందహృదయుం డగునవ్విష్ణువర్ధనుండు నిజచతురంగ బలంబుల గౌతమీతీరంబున విడియించి యథోచితబలబంధుమంత్రిసమేతుం డై యవ్వనంబు మందగమనంబునఁ బ్రవేశించిన. 59

లయగ్రాహి—
చందనసుగంధులగుసుందరులమైచెమటబిందువుల మాన్పుటకు మందపవనుండానంద మునరాఁగ గురివెందవిరులందు మకరందరసమాన్పడఁగఁ గ్రందుకొనుచున్నిందిందిర ములుబ్బ మరుఁడందముగఁబుష్పధనువందుకొనియేయఁ బ్రియమందిమరులక్ష్మీమందిర ములైమహిమఁజెందుగతిఁదోఁపవనబృందములుకన్నులకువిందులొనరింపన్.

గీ. విష్ణుసన్నిభుండు విశ్రాణభంగులఁ, జైత్రరథమురీతిఁ జతురమగుచు
నందనంబు సొంపు నవ్యమై పొడమెనో, చోద్యమనుచుఁ దిరిగి చూడఁ దొడఁగె.

వ. ఇట్లవ్వనంబెల్లను సంచరించుచునెడ నొక్కసౌధంబుఁ గాంచి వసియించి యున్నంత రాజాగమనంబు వనపాలురవలన నెఱింగి తద్దర్శనోత్సవకుతూహలులై యనర్ఘ్యశ్రీ రత్నభూషణకాంచనాంబరంబు లధికంబులుగాఁ గానికలుగొనుచు రా నుద్యోగిం చుతఱి బాలనగరంబువార లేతెంచి తద్విశేషపదార్థంబులు వలదని వారించి యి ట్లనిరి. 62

సీ. వజ్రగోమేధికవైడూర్యమణిమయ సౌవర్ణదివ్యభూషణము లిన్ని
చీనిచీనాంబరచిత్రమంజిష్ఠాది కమనీయపట్టాంశుకంబు లిన్ని
కలితముక్తాహారకంకణాంగదముఖ్య ప్రకటరత్నాంగుళీయకము లిన్ని
ప్రియసమారోహణక్రీడోచితములైన, ఘనజవోత్తమతురంగంబు లిన్ని

తే. యనుచు విధియించి కరణంబు లవనిపతికిఁ, జెప్పి యేఁటేఁట వర్తనల్ జేసిమనలఁ
గస్తిపెట్టుదు రిది బుద్ధి గా దటంచు, బహుధనద్రవ్యవస్తువు ల్పరిహరించి. 63

సీ. ద్రాక్షామధూకపుండ్రేక్షుఖండంబులు బింబఖర్జూరీకదంబములును
మల్లికాచంపకమాధవకరవీర సురభిప్రసూనవిస్ఫూర్తి మించి
కర్పూరచందనకాశ్మీరకమనీయకస్తూరికాదిసుగంధములును
క్షౌద్రాజ్యదధిగుడశర్కరాక్షీరాది కాభ్యవహారపదార్థములును
తే. గంపలఁబుట్ట పుటికెలఁ గన్నుదనియ, నించి వైశ్యులచేతఁ బట్టించుకొనుచు
ధరణిపతిఁ జూడఁ గుసుమాభిధానముఖ్యు, లర్యులేతేరుడుపవనహర్మ్యమునకు. 64

వ. అనిన విని యవ్వైశ్యు లమ్మహారాజుంగాంచుటకు వారలెఱిఁగించినక్రమంబున నుప
హారంబులు గొనివచ్చి యుపవనంబుఁ బ్రవేశించి రాజసమ్ముఖమ్మునకు రానున్నసమ
యంబున. 65

## వైశ్యులు విష్ణువర్ధనుని దర్శించుట.

వ. ఇక్కడ విష్ణువర్ధనుండు మహాసౌధం బెక్కి యచ్చట విద్యాభ్యాసంబు సేయు
చున్న కొందఱువైశ్యకుమారులం జూచి వారల చదువులు వినుచున్నసమయంబున
వనపాలకు లవ్వైశ్యులు దెచ్చినకానుకలు రాజుముందఱ నిడి వైశ్యజనులరాక
యెఱింగింప నప్పుడు వార లారాజునకుఁ దోడిబడ దండంబులు వెట్టిన వార్తల
ననునయించి సౌధంబుమీఁదికిం జని యందుఁ గాంచనమయవేదికయందుఁ గొంత
తడవు నిద్రించి మేల్కాంచి పెనుగొండపురంబంతయు నిరీక్షించి. 66

మ. కనియెం గాంచనరమ్యహర్మ్యవిలసద్గాంభీర్యకుంభప్రభా
కనదుజ్జృంభితదేవతాలయమహాకళ్యాణతూర్యోల్లస
ద్ధ్వనిభూయిష్ఠతరం బపారమహిమావ్యక్తప్రకారంబు నా
పెనుగొండాఖ్యపురంబుఁ గాంచనమణీప్రేమాస్పదఖ్యాతముల్. 67

వ. కాంచి తనలోన. 68

సీ. మందారదేవతామణికామధేనువిభ్రాజితం బగుదేవపతిపురంబొ
నభినవశంఖపద్మాదినివాసప్రకాశితం బగునలకాపురంబొ
హరినీలపద్మరాగాదిరత్నప్రభావర్ణనీయం బగువరుణుపురమొ
స్ఫటికోపలస్తంభశశికాంతవేదికాశ్లేషంబుచే నొప్పుశివపురంబొ
తే. దివ్యమాణిక్యకాంతిదేదీప్యమాన, సరసహర్మ్యోజ్జ్వలం బగుహరిపురంబొ
ధరణి నెన్నఁడునిటువంటిపురవరంబుఁ, గనియువినియును నెఱుఁగమీకలియుగమున.

ఉ. ఈనగరం బిదెవ్వరిది యిందుకుఁ జెల్లెడిదుర్గ మెంతయో
దీనికి నేమి నామమొకొ దీనికి నిక్కము కర్తయైనవాఁ

డేనరనాయకుండో నను నెన్నఁడుఁ జూడఁగరాఁ డటంచు ను
ద్యానవనాంతరస్థతరుణార్యజనంబులఁ జూచి పల్కెన్. 70

వ. వినిబాలకుమారు లిట్లని చెప్పం దొడంగి రని సాలంకాయనముని చెప్పిన యనం
తరకథావృత్తాంతం బెట్లయ్యెనని యవ్వైశ్యు లడుగుటయు. 71

మ. పరదుర్గస్థలదుర్గపట్టణమహాప్రాకారు లత్యంతస
త్కరుణాంభోధిసమాను లాగమకళాగణ్యాగ్రసంరక్షణా
కలనామ్నాయపథప్రచారు లనఘుల్ కల్యాణసత్కీర్తులు
ర్వరఁ బెన్గొండపురీనివాసులు సదావర్ధిష్ణు లిద్ధారిణిన్. 72

మాలిని. జలధివలయితోర్వీచక్రనిర్వక్రకీర్తుల్
జ్జ్వలనిచయవనాంతశ్శారదాసంప్రసాదో
జ్జ్వలమధురవచోసంచారసల్లాపరేఖా
కలితసుజనహర్షఖ్యాతవైజాత్యవైశ్యుల్. 73

గద్య. ఇది శ్రీసరస్వతీవిలాసచరణసరసీరుహామకరందబిందుసందోహమధురమధురిమాధురీణమధుకరాయమానమానససరసకవితావిలాస బొల్లనార్యతనూభవ భాస్కరాచార్యనామధేయప్రణీతం బైనవైశ్యపురాణంబునందుఁ గుసుమాఖ్యునకుఁ గుమారీకుమారులు గలిగి దినదినప్రవర్ధమానులగుటయు విష్ణువర్ధను దిగ్విజయంబును సకలతీర్థక్షేత్రనదీనదంబులు సంచరించుటయు సేనాపరిగణనంబును గౌతమీస్నానార్థంబు విష్ణువర్ధనుండు చనుదెంచి పెనుగొండకు వచ్చుటయు నుద్యానవనప్రవేశంబును వైశ్యులారాజదర్శనార్థంబు వచ్చుటయు రాజుసౌధంబుమీఁదికిఁ జని పురంబు చూచుటయు ననుకథలం గలది షష్ఠాశ్వాసము.

శ్రీ గణేశాయ నమః.

శ్రీ శారదాంబాయై నమః.

# శ్రీ వైశ్యపురాణము

## సప్తమాశ్వాసము



సారస్యవిశేషవి
భాసురవాచాప్రమోద పటువిభవమహా
భూసురసంరక్షణ వి
ద్యాసురభూజ ప్రకారధన్యులు వైశ్యుల్. 1

వ. ఆకర్ణింపుండని సాలంకాయనమునికి వైశ్యులిట్లనిరి. 2

ఉ. కారణబాంధవుం డయిన కౌరవవంశవివర్ధనుండు మే
ల్కారిమి నేఁగుదెంచి పెనుగొండపురోపవనంబునందు శృం
గారవనం బనంగ వర కల్పనగంబులు భూమిఁబుట్ట నా
తీరున నున్నయవ్వనముఁ జేకువఁ జొచ్చి నృపాలుఁ డచ్చటన్. 3

క. కనుఁగొని చిత్రవిచిత్ర, మ్మునఁ గనుపట్టు వరసౌధము ధరాధీశుం
డనుమోదము ముప్పిరిగొనఁ, మునినాయక యందునుండె మూర్ధన్యుండై. 4

క. అని యానతిచ్చితిరి యా, వనజారికులుండు మానివర యాసౌధం
బున నుండి యేమి చేసె. నన్నిన వినుఁ డని మఱియు నమ్మునీంద్రుం డనియెన్. 5

సీ. ఆబాలనగరంబు లవనీశునకు మ్రొక్కి వినయంబుతోడ నిట్లనిరి పతికిఁ
గమలజు కృప విశ్వకర్మనిర్మిత మైన భాసిల్లుపెనుగొండ పట్టణంబు
అంబికానాయకుం డగ్రహారంబుగా మెచ్చి వైశ్యులకెల్ల నిచ్చినాఁడు
సర్వమాన్యంబుగా జగతీశులెల్లను బాలించుచుందురు భక్తితోడఁ

తే. గలితధనధాన్యసంపదల్ గలిగి మఱియుఁ, బదియునెనిమిదిపురము లీపట్టణమున
కర్థితోఁ జెల్లివచ్చు శివాజ్ఞచేత, విష్ణువర్ధనరాజేంద్ర విభవసాంద్ర. 6

చ. అని మధురోక్తి బల్కినధరాధిపవర్యుఁడు శాంత చిత్తుఁడై
యొనసి సుగంధమూలమున మో మలరించిన కృష్ణసర్పమో.

యనఁ దమరోషము న్విడిచి యాత్మ ముదంబునఁ బొంది యున్నచో
వనఫలపుష్పముల్ మనుజవల్లభుముందఱఁ బెట్టి రన్నియున్. 7

క. అంతట వైశ్యులు ధరణీకాంతుని దర్శించి మ్రొక్కి కానుక లిడినన్
సంతోషించి నృపాలకుఁ, డెంతయు మన్నించె సత్కృపేక్షణ మొలయన్. 8

వ. అనంతరం బా రాజునకు వైశ్యు లిట్లనిరి. 9

క. రాజోత్తమ మాపురికిన్, రాజితగతి వచ్చి మమ్ము రక్షింపవలెం
తేజ మెలర్పఁగ నన విని, సౌజన్యం బొదవఁ గదలి సంభ్రమ మెసఁగన్. 10

శా. భేరీభాంకృతు లుల్లసిల్లఁగ మహీభృత్కుంభికుంభస్థ:న్
దారోదారసుహారమౌక్తికరుచుల్ తారాగతిం బర్వ శ్రీం
గారోదారుఁడు విష్ణువర్ధనమహీకాంతుండు సేనారవ
స్ఫారుండై పురి కేగు దేర బదరీపట్టాంశుకోదగ్రుఁడై. 11

వ. అప్పు డవ్విష్ణువర్ధనవసుంధరారమణుం డుచితపరివారసమేతుండై పురావలోకన జనితకౌతూహలుండై చన నుద్యోగించునప్పుడు మతిమంతు లగు వైశ్యులు పూర్వ కారణంబుఁ దలంచి, నీచజనాదియానావరోహణవిరహితంబు గావలయు నని యుక్తిసాధించి పురద్వారంబు మొదలుకొని నగరేశ్వరదేవాలయపర్యంతం బెడము గాకుండ విజయస్తంభంబులు నిలిపి దర్పణతోరణంబులు నిర్మించి పరికల్పితమార్గ నిరర్గళమాంజిష్ఠపట్టచీనాంబర పరిచ్ఛాదితాలంకారం బొనర్చినఁ జూచి నిలిచి సంతోషించి యారాజశేఖరుం డాశ్చర్యంబు నొంది యవ్వైశ్యులఁ జూచి యియ్యమూల్యవస్త్రంబు లీమార్గంబున నేల పఱిచితిరి గజతురగఖురవిదళితంబు లగు ననిన వైశ్యులు వినయంబునఁ గృతాంజలులై యిట్లనిరి. స్వామీ నీవు మహారాజవు పాండవవంశవర్ధనుండవు నీవు నిరాఘాటధాటీవైఖరి నీవిశ్వవిశ్వంభరావలయంబు దిగ్విజయంబు నేసి మాభాగ్యవశంబున నవధరించితివి దేవరపాదారవిందంబులకు మార్దవంబు గావలయునని యడుగులకు మడుఁగులు పఱిచినార మనిన సంతోషిత స్వాంతుండై మంత్రిసామంతపురోహితరాజకుమారసహితంబుగా వాహనంబులు డిగ్గి పాదచారియై చని పురంబు ప్రవేశించునప్పుడు దేవాలయాంతర విజృంభితఘంటా శంఖభేరీమృదంగ వేణువీణాదినిర్హ్రాదంబు మేదురంబై రాజదర్శనోత్సుకోభయ పార్శ్వ హర్మ్య వాతాయనస్థలస్థిత సుందరీమణికలకలంబును నతిసంభ్రమాంతర గవాక్షస్థితయువతీజనగతిభేదంబును సత్వరగమనసమయవిశ్లథాంశుకగ్రహణైక హస్తంబును ననుగతశిశుజనగృహీత చేలాంచలంబును బ్రతిగృహద్వారప్రదేశ సంస్థాపిత సువర్ణస్తంభాగ్రజృంభమాణ విచిత్రపట్టాంశుకశోభితంబును విద్యుల్లతానుకారి దేదీప్యమాన రత్నదర్పణతోరణాలంకృతంబును సారఘనసారమృగమద

ప్రసూన జలసమ్మార్జన విశుద్ధముక్తాఫలరంగవల్లీ విరాజితవిపణిమార్గంబును భూసు
రాశీర్వాదమంగళపాఠకపఠితగద్యపద్యోదాహరణాదిచాటుప్రబంధబంధురంబును నై
ప్రవర్తిల్లుచుండఁ బురస్త్రీలు తమలోన. 12

ఉ. ఉన్నతరమ్యహర్మ్యముల నుజ్జ్వలహాటకమండపంబులన్
బ్రన్నని వెండిమాడువుల భవ్యచమత్కృతి గోపురంబులన్
పన్నుగ నెక్కి సుందరులు భావజసన్నిభు విష్ణువర్ధనున్
సన్నుత విక్రమాన్వితు నిశాకరవంశజుఁ జూచి యెల్లరున్. 13

సీ. ఇతఁడుసూ వైరిభూమీశుల నిర్జించి చెండాడి వచ్చిన దండి మగఁడు
ఇతఁడుసూ కల్యాణపతి నాజిలోపలఁ బట్టితెచ్చిన జగజెట్టిబిరుదు
ఇతఁడుసూ రాజమహేంద్రపట్టణమును రఘువు కైవడి నేలు రాజవరుఁడు
ఇతఁడుసూ భామల కిందిరానందనుచాడ్పునఁ గాన్పించు చతురమూర్తి
తే. యనుచుఁ బౌరవనిత లంతంత నేతెంచి, చూచుచుండఁ జనులు చూచుచుండఁ
బూర్ణయశుఁడు వచ్చెఁ బురవీథిఁ గురువంశ,వర్ధనుండు విష్ణువర్ధనుండు. 14

వ. ఇట్లు జనంబులు నుతియించుచుండ రాజమార్గంబునఁ జనుచు శ్రీనగరేశ్వర దేవాలయ
గోపురసమీపంబున నిలిచి యుచితాప్తమంత్రిసహాయుండై యాదేవుని గర్భా
గారంబు ప్రవేశించి సువర్ణపుష్పంబులఁ బూజించి ప్రదక్షిణక్రియాపురస్సరంబుగా
సాష్టాంగ నమస్కారంబు లొనరించి యనేకవిధంబుల నగరేశ్వరదేవునుతియించి
తద్దేవతాపరిచారకభక్తజనదత్తప్రసాదంబులు శిరంబున ధరియించి వెలువడి తన్ముఖ
మండపాంతరచంద్రకాంతరవేదికా ప్రదేశసంస్థాపితరత్నసింహాస నాసీనుండై సంత
తోత్సవంబుల సేవించి తద్దేవతామాహాత్మ్యంబు వినుచున్నసమయంబున గంధాక్షత
ధూపదీపతాంబూలంబు లొసంగిన గైకొని యొక్కవీడు పట్టుచేయించు మను
టయుఁ దత్క్షణంబ వార లట్లుచేసిన నమ్మహారాజు పరమాప్త మంత్రిసహాయుండై
నగరేశ్వరు నుద్దేశించి. 15

క. శ్రీకంఠ విరాజితది, వ్యాకార సురేంద్రవందితాంఘ్రిసరోజా
లోకత్రయసంరక్షక, నాకసద్వరకిరీటనగరేశ శివా. 16

క. స్ఫటికాక్షమాలికాధర, నిటలాక్ష మహానుభావ నిశ్చలయోగ
స్ఫుట కఠిన తరాది మహా, నటవిభ్రము దివ్యరూప నగరేశ శివా. 17

క. జగదుత్పత్తిస్థితిలయ, త్రిగుణాత్మక యోగమార్గదీపిత దివ్య
త్రిగుణత్రయ పరమేశ్వర, నగరాజ సుతాధినాథ నగరేశ శివా. 18

క. ఖండపురందరసామజ, చందనమందారతుహిన శశిసమవర్ణా
నందనసుశ్రీశోభిత, నందీశ్వరవాహనాఢ్య నగరేశ శివా, 19

క. భక్తజనలోకరక్షక, యుక్తాయుక్తప్రకార యోగవ్యక్తా
వ్యక్తవిధానగుణాధిక, నక్తంచరహరణ యీశ నగరేశ శివా. 20

క. సలలిత కరుణాకర నిర్మల దివ్యజ్ఞాననిధి సమగ్రమునిమరు
త్కులరక్షాతివిచక్షణ, నలినాసనవంద్యచరిత నగరేశ శివా. 21

క. పురదనుజాంతకవిక్రమ, శరణాగతరక్షణాఢ్య సర్వజ్ఞ విభూ
సరహృదయాభిమతప్రద, నరవాహనసఖగిరీశ నగరేశ శివా. 22

వ. అని స్తుతియించి తనబంధువర్గంబుల నొక్కచోట నుండ నియమించి తానన్మహా
సౌధంబును బ్రవేశించిన సమయంబున. 23

క. విడియించి సంభ్రమంబునఁ, వడయక సీరాజనంబు ధరణీశునకున్
గడువడిఁ దెమ్మని పలికినఁ, గడువేడుక నొంది వైశ్యకామిను లంతన్. 24

చ. సురభితవారిసేకపరిశోభితనిర్మలకాంతి దేహులై
సరసవిచిత్రవస్త్రములు చయ్యనఁ గట్టి సుగంధపుష్పముల్
స్థిరకబరీభరంబులను జెన్నువహింపగ భూషణప్రభా
గరిమలు దిక్కులఁ బ్రబలఁ గాంతలు తత్కులవృత్తి పెంపునన్. 25

సీ. ఆలోలభృంగవిహారరతిశకేశపాశప్రసూనవిభ్రాజితంబు
జారు కపోలప్రసన్నతావిజ్ఞాతరమ్యతాంబూలచర్వణవిశంబు
వాసనాప్రకటితవరచంద్రమృగనాభిమదవిలాసనుగంధమర్దితంబు
సరసముక్తాహారకరమణికంకణక్వణనప్రకాశితాభరణ మహిమ
తే. గుప్తశృంగారవైఖరి కుశలరీతి, వైశ్యకాంతాజనంబులు వన్నె మిగుల
రమ్యకర్పూరరచితనీరాజనములు, గొనుచువచ్చిరి తుహినాంశుకులునిఁ జూడ. 26

వ. మఱియును. 27

రగడ. పున్నమచందురు బోలెడుమోములు, చెన్నగు హేమముఁ జెనసిన చెక్కులు
లలితచకోరులలాగునఁ గన్నులుఁ, మెలఁపగు తేఁటుల మించిన కురులును
మరుచాపమ్మును మార్కొనుబొమ్మలు, కర మొప్పెడు శ్రీకరకర్ణంబులు
తిలపుష్పంబులఁ దెగడునాసికలు, లలితార్ధేందునిలాంగలలాటము
బింబఫలంబులఁ బెంపగు మోవులు, అంబుధరనుతుల్యంబగు జడలును
ఘనవజ్రప్రభ గలదంతంబులు, ననుపమశంఖసమంచితగళములు
చిలుకలపలుకులఁ జెదరుచుమాటలు, తళుకులసోగ సైతగువక్షంబులు
బిసచయముల నుఱపించెడుబాహులు, కిసలయముల జంకించెడి కరములు
కరికుంభంబులఁ గాదను కుచములు, హరిమధ్యంబుల నదలుచునడుములు
తరగల డీకొనుదట్టపుతరులును, గురుసైకతద్యుతిఁ గొనునునాదులు

ఆవర్తాకృతి నమరెడు నాభులు, పావనపులినము ప్రతి యగుపిఱుఁదులు
మచ్చికఁ దమలో మాటికి మాటికి, ముచ్చట లాడుచు మోదముతోడను
భావజు మోహనబాణములో యన, దైవమహీజలతాతతియో యనఁ
బొలు పగుపుత్తడిబొమ్మ లొకో యన, నలవికి మించిన యచ్చరలో యన
నతివలు దమలో నతిమోదంబున, క్షితిపతి నటు దర్శించుచు దగ్గఱి
నీరాజనములు నెఱయఁగ నిచ్చుచు, నారీజనులు న్నరపతిఁ బొగడుచు
శిరమున ముత్తెపుసేసలు చల్లుచుఁ, గర మనురక్తిని గానుక లిచ్చుచుఁ
జయజయ వాసవసన్నిభవైభవ, జయజయ ఫల్గునశౌర్యప్రాభవ
చాళుక్యాన్వయసాగరపావన, కాశీపతిపదకమలవిభావా
రాజకులోత్తమ రాఘవ సద్గుణ, తేజోదినకరధీరజనస్తుత
విరివి మీఱునృపవీరుల ద్రుంచితి, ధరణీశుల మదదర్ప మణంచితి
శరణాగతులకు సంపదలిచ్చితి, సరవితోడుతను సాధుల మెచ్చితి
నీయమాత్యవరు లీరాజన్యులు, నీయేనుంగులు నీఘోటకములు
నీయరదమ్ములు నీకేతనములు, నీయోధాగ్రణు లీసైన్యంబులు
నీబాహుబలం బీశౌర్యోన్నతి, యీబహుసంపద లెవ్వరికున్నవి
దీనజనంబుల ధీరతఁ బ్రోవుము, మానవపతులను మన్ననఁ గావుము
ధాత్రిజనంబుల దయఁ బాలింపుము, మిత్రుల బంధుల మేలిమి దొరలును
హితజనులఁ బురోహితవర్గంబుల, సుతులఁ బ్రధానుల శూరుల వీరుల
ధనమును ఘనమును దగుసంపదయును, జనవును గల్గను సంరక్షింపుము
ఆయువు భాగ్యము నైశ్వర్యంబును, శ్రీయును గల్గి ప్రసిద్ధ యశంబున
భూజనసుత నరభూమికి నెల్లను, రాజవు నీవయి రాజ్యము సేయుము. 28

వ. అని యిట్లు. 29

ఉ. రాజకులాధినాథునకు రాజనిభానన లర్థితోడ నీ
రాజన మిచ్చి కానుకలు రాసులఁ బోసి శుభోదయోక్తులం
దేజ మెలర్పఁగాఁ దగిన దీవన లిచ్చి చెలంగి నిల్చినన్
రాజస మంది వీడెమును రా జొసఁగంగ ననంతరంబునన్. 30

ఉ. పావనలీల వైశ్యకులభామిను లిట్లు నివాళి సేయుచున్
దీవన లిచ్చిన న్నృపతి ధీరత వీడెము నిచ్చు నంతలో
నావణిగంగనాగ్రమున నంగజు మోహనబాణమో యనం
గా విలసిల్లు వైశ్యవరకన్యకఁ గాంచె దృఢానురాగుఁడై. 31

క. అప్పుడు మానవనాయకుఁ, డప్పణ్యాంగనలఁ జూచి హర్షముతోడన్
గప్పురవిడెము లొసంగుచుఁ, దప్పక వీక్షించె నంతఁ దామరసాక్షిన్. 32

చ. ఉడుగణమధ్యమంబున మహోజ్జ్వలకాంతిఁ జెలంగి చెల్వమై
బెడఁ గగుచంద్రరేఖఁ గతిఁ బేర్చుతలోదరి నొక్కకన్యకన్
గడువడి మోహపాశమునఁ గాంచె మనోభవబాణజాలము
ల్వడివడిఁ దాఁకి జర్జరిత కామ మనోగతితోఁ దలంచుచున్. 33

శా. ఈతన్విం ద్రిపురాంతకుం డసదృశుండీక్షించెనే నర్థిమై
జేతోమోదముతో నహార్యసుతకుం జెంటింప నర్ధాంగ మా
యాతవ్యార్థము నేలయిచ్చు భవితవ్యం బంచుఁ దన్మగ్నతన్
జాతాశుం డగువిష్ణువర్ధనధరాచక్రేశ్వరుం డుబ్బునన్. 34

ఉ. బాలను బాలచంద్రముఖిఁ బద్మవిరోచనఁ బద్మగంధినిం
బాలమృణాళకోమలవిభాసితబాహను నీలవేణినిన్
లాలితపుష్పపల్లవవిలాసితగాత్రను బ్రహ్మ నేర్పుమై
నేల సృజించెనో ధరణి నెన్నఁడుఁ జూడ మ దిట్టిబాలికన్. 35

శా. ప్రాలేయాచలకన్యయో మఱియు నాపాథోధిరాట్పుత్రియో
మేతా భారతియో శచీతరుణియో మీనధ్వజాత్మేశయో
హేలాబంధురనవ్య విగ్రహగతిన్నిద్ధాత్రిఁ బోల్పారు నీ
బాలారత్నముఁ జూచినంతనె మహాభావంబు నుప్పొంగెడిన్. 36

వ. అని యమ్మహీపాలుండు పూర్వశాపవశంబునబుద్ధి ప్రేరేప మఱియు నిట్లనియె. 37

సీ. హరిణేందుశరధిజంఘాస్యాక్షి కరికుంభ హంసభృంగాలకయానజఘన
నలినశంఖావర్తనాభిగళాంఘ్రి యుత్పలవజ్రరంభోరుదశనగంధి
నర్ధేందుముకురలతాంగిగండాలిక వసుశుక హరిమధ్యవచనహస్త
... ... ... ...

ఆ. సర్వలక్షణప్రశస్త వాసవి యను, కన్నె యలరఁ జూచుచున్నయంత
నమ్మృగాక్షిఁ జూచి యమ్మహీరమణుండు, ప్రసవబాణధరునిబారిఁ జేరె. 38

వ. ఇట్లు మదనసంతప్తమానసుండై యక్కన్యక నాపాదమస్తకంబుఁ జూచి మఱియుఁ
వర్ణింపందొడంగె. 39

గీ. లలితనవ్యప్రవాళపల్లవసమాన, కాంతి మించె సతీపాదకమలయుగము
సరసరాగాంబురాశిసంచారమునను, నలరఁ ద[illegible]ంబుకరణి. 40

గీ. నవ్యలావణ్యపద్మినీనాళసామ్య, కలితజంఘల నొప్పె [illegible]కాంతి హంస
సరసమణిహేమమేఖలాపరిఘయైన, మదనుపురిలీల జఘనంబు మగువ కొప్పె. 41

క. చారువిశేషవిలాసమ, యూరములకు నరఁటిక్రమ్రాఁకులో మరుపురికిన్
తోరణకంబములో యన, నూరువు లొప్పారె సతికి నుజ్జ్వలకాంతిన్. 42

క. క్రూరహరనేత్రశిఖిసం, చారంబున నొగిలి నాభిసరసింబడినన్
మారుతనుధూమరేఖా, కారంబున రోమరాజి కాంతకు నొప్పెన్. 43

క. సతి దేహలతిక జనస్మృతి యగురోమాళి భృంగమాలికఁ దాల్చెన్
అతినిర్మలకనుచరమ, ప్రతినిర్మిత మగు జటాభరంబును బోలెన్. 44

క. గిరిసెనపుఁబూవుకంటెను, బరికింపఁగ మృదువులైనబాహువులువడిన్
విరహిజనంబులకును శం,బరవైరి ఘటించుకంఠపాశము లనఁగన్. 45

క. అతులితకంఠద్యుతి న,ప్రతిమంబై హార మొప్పె రాజితహార
స్థితిచేఁ గంఠము మించెను, జతురత నన్యోన్యకాంతిసదృశము లగుటన్. 46

గీ. బంధుజీవపుఁగాంతులఁ బరిహసించె, నధరకాంతులచేత నయ్యంబుజాక్షి
సలలితంబైనలావణ్యజలధియందుఁ, బవడములతీఁగె ధరియించుపగిదిఁబోలె. 47

క. విరులు చిగురాకుమీఁదను, మురువగుపవడంబుమీఁద ముత్తెములగతి
న్నరుణాధరపల్లవమున, నెరసిన చిఱునగవుకాంతి నెలఁతకు నొప్పెన్. 48

క. గౌరవనాసావంశ, స్ఫారలలాటాతపత్రసంశ్రితమహిమన్
భ్రూరేఖాచిహ్నితపటు,తారానవకాంతిరాజి తరుణి వహించెన్. 49

క. వదనాంభోజముపైఁ దు,మ్మెదగమిక్రియఁ గేశభరము మించినఁగని స
మ్మదముడిగి సిగ్గుచేతను, వదలెను జమరీమృగములు వాలప్రియముల్. 50

సీ. ఈకన్నె నసమాక్షుఁ డీక్షించెనాయెనా యొదలిలో సగ మేల యుమకు నిచ్చు
నీబాలఁ గనుఁగొన్న నిందిరాదేవిని నురమున హరి యేల యుండనిచ్చు
నీరామఁ గాంచిన వారిజగర్భుండు వదనంబునం దేల వాణి నిల్పు
నీలేమ యున్నచో నెలిఁగిన నింద్రుండు శచి కేల కామితసౌఖ్య మిచ్చు
తే. భువనమోహనరూపంబు పొందుసేసి, మించిపరమేష్ఠి దీని నిర్మించినాఁడు
నాదు నాపూర్వజన్మపుణ్యమునఁ జేసి, సొంపు పెంపార నిక్కాంతఁ జూడఁగల్గె.

వ. అని వితర్కించి మఱియు నిట్లనియె. 52

సీ. జలరాశికుక్షిలోఁ జంద్రుతోఁ బుట్టిన కన్య గా నిది వైశ్యకన్య గాదు
మంచుగుబ్బలిరాజు మహిఁ దపంబునఁ గన్న కన్యగా నిది వైశ్యకన్య గాదు
పదునాల్గువిద్యలపట్టుగొమ్మైనట్టి కన్యగా నిది వైశ్యకన్యగాదు
వేయికన్నులవాని విభునిగాఁ గైకొన్న కన్యగా నిది వైశ్యకన్య గాదు
తే. గరుడగంధర్వకిన్నరఖచరయక్ష, కన్యగా నిది మఱి వైశ్యకన్య గాదు
ధాత్రి నిక్కన్యఁ గని తారు ధన్యులైరి, వార లిట నెవ్వ రనిన నవ్వైశ్యసతులు.

వ. ఆరాజున కిట్లనిరి. 54

సీ. బ్రహ్మోరుసంభవప్రఖ్యాతిఁ బొందినవారు మూఁడవజాతి వైశ్యకులము
సిరులవైశ్యులలోన సెట్టి ముఖ్యుండైన కులదీపకుఁడు తండ్రి కుసుమసెట్టిఁ
సకలపతివ్రతాచారముఖ్యము లైన గుణనిధానము తల్లికుసుమగంధి
రూపవంతుండు విరూపాక్షనామధేయుఁడు పుణ్యమూర్తిసహోదరుండు
తే. పరఁగ నీచెలి కంపటు బంధుజనులు, కాంతనామంబు వాసవీకన్య యండ్రు
ధరను గౌరీవరప్రసాదమునఁ గలిగె, ననిన సంతోషమందె నాజనవిభుండు. 55

గీ. కుసుమగంధిసమేతుఁడై కుసుమసెట్టి, బహువిధంబుల దేవతోపాస్తి చేసి
యిమ్మహిస్థలిఁ బుత్రకామేష్టియందుఁ, గాంచె నీవాసవీనామకమలముఖిని. 56

క. అన విని యుర్వీనాథుం, డనుమానము పక్కఁ దక్కఁ బంగన యనుచున్
మనమున నుబ్బుచుఁ గుసుమా, ఖ్యునిఁ జేరఁగఁ బిల్చి యతనికూఁతుఁను నడిగెన్.

క. పరనారీసోదరుఁ డన, ధర నేలితి నేను సకలధర్మజ్ఞుఁడ నై
సరసిజముఖి కన్యకయనఁ, గరమర్థిని వింటి మనసుకందుచు దీటెన్. 58

క. కుసుమాహ్వయ నీపుత్త్రిక, ననదృశలావణ్య నాకు నతివేడుకతో
నొసఁగుము మామా యనఁగా, వసుధాస్థలి వెలయు వైశ్యవంశాధీశా. 59

వ. అని పలికినఁ గుసుమాహ్వయుండు తనమనంబులో యుక్తి సాధించి యిట్లని యోజించె. 60

ఉ. శ్రీమహితస్వభావుఁడు విశిష్టకులోద్భవు. డార్యసమ్మతుం
డీ మన మెట్లువచ్చు మఱి యిచ్చెద నన్నను వంశహాని యా
నేమి యపంగవచ్చు నని యించుక చింత వహించి ధీరుఁడై
స్వామిహితంబుగా మధురవాక్యములం బలికెం బ్రియంబుగన్. 61

గీ. ఇంతకంటె మే లదెక్కడ నొంపఁగఁ గల్గు, నవధరింపుఁ డనిన నంతఁ బోక
తథ్య మనుచు మిగులఁ దాత్పర్యచిత్తుఁడై, యొసఁగవలయుననిసఁ గుసుమవిభుఁడు.

ఉ. ఇష్టధనంబు లెల్లను మహీసురకోటికి నిచ్చి పుత్రకా
మేష్టియజించుచోటఁ దరుణేందుధరుండు తనూజ నిచ్చుచోఁ
దుష్టి వహించి కూరిమిని దొయ్యలిఁ బెంచితి గారవించితిన్
శిష్టత నీయఁ బుచ్చుకొనఁ జెల్లదు వైశ్యులు కర్తలందఱున్. 63

క. భూపాలక విను మాకును, మాపాపకుఁ గర్త లైనమహితవిచారుల్
మాపాలికులస్వాములు, మీపాదములాన యనఁగ నిశ్చలబుద్ధిన్. 64

మ. నగరస్వాములదిక్కుఁ జూచి వసుధానాథాగ్రగణ్యుం డనెన్
మృగనేత్రాతిలకంబు వాసవిని సస్మినాక్షి నా కీవలెన్
దగురాజ్యంబున నర్ధ ముంకువయుగాఁ దథ్యంబు నే నిచ్చెదన్
జగ మెంచంగలలగ్ననిశ్చయగతి సాధింపుఁ డీసొంపునన్. 65

వ. అని మఱియును. 66

సీ. చీని చీనాంబరచిత్రవస్త్రంబులు దండికట్నములు పండ్రెండువేలు
రత్నాంగుళీయకగ్రైవేయహారంబు లర్థితో నేఁబదియాఱువేలు
కర్పూరకస్తూరికాగంధసారాదు లగుమంగళద్రవ్య మధిక మిత్తు
బహుధనధాన్యసంపదలచేఁ బెంపొందు పురములు వైశ్యుల కరయ నిత్తు
తే. భూధరమువంటి విక్రమస్ఫురితసత్త్వ, భద్రదంతావళంబులు బటుజవాధి
కోత్తమాశ్వసహస్రంబు లిత్తు నాకు, మఱఁదు లైనట్టివైశ్యకుమారులకును. 67

గీ. జగతిఁ బెంపొందుసకలదేశములలోన, ముఖ్యమైనట్టిపెనుగొండ ముదముతోడఁ
బదియునెనిమిది గల్గు నప్పట్టణములు, పసుపునకు నిత్తు వాసవీపద్మముఖికి. 68

వ. అనిన విని యవ్వైశ్యకుమారులు విషాదంబు నొంది యాత్మగతంబున. 69

ఉ. కాలకరాళహేతి నిజకాయము దాఁకినరీతి భీతిచేఁ
దాలిమిదూలు టీవిధము దైవవశంబుగాకయున్నచో
బాలిక మోహభావమునఁ బార్థివముఖ్యుఁడు గోరుటెట్లు తా
త్కాలికబుద్ధిచే నొకమతంబుఁ దలంతుము నీతిపై ఖరిన్. 70

క. ప్రబలుఁడు నరపతి ధరలో, నబలను నీమనినఁ గడఁగి యతిమోహితుఁడై
యబలారత్నముఁ గొని చను, విబుధాధిపసముఁడు తనదువీటికి నిపుడున్. 71

ఉ. రాజు సమస్తదేశములరాజుల నోర్చిన విష్ణువర్ధన
భ్రాజితనామధేయుఁ డగురాజకులాగ్రణి గాన వర్వుఁడో
రాజుల మంచు నీయుగనురాజులు హీనములైనబుద్ధి దు
ర్వ్యాజముఁ గూర్తు రంచు నిరుపాధికబుద్ధి నుపాయచిత్తులై. 72

సీ. జననిక్రమక్రియాసంపన్నుఁ డీరాజు బలిమి నీకుండ శత్రులము గాము
పుడమి జేనిపురంబు విడచిపోవుద మన్న నఖిలదేశములకు నార్యుఁ డితఁడు
చనవరి యగురాజు శరణందమంటిమా యిలభూపతుల నెల్ల గెల్చినాఁడు
కాఁగ నీవాసవకన్యక నిచ్చిన నపకీర్తి నిండు నీయవనియందు
తే. నీకపోరాదు నీకున్న నెగ్గుపుట్టు, నిత్తు మని లగ్ననిశ్చయం బెడఘటించి
యనుపుదము రాజునని బుద్ధి నధిపుఁడగుచుఁ, గుజగుజలువోయెనొకకొంతకుసుమసెట్టి.

క. కాలక్షేపము సేయుట, మేలగు నీవేళ ననుచు మిక్కిలిధనముల్
లీలను జోస్యుల కొసఁగి నృ, పాలాగ్రేసరుని జూచి పలికిరి కణఁకన్. 74

చ. అనఘ పరాక్రమాన్వితుఁడ వర్జునవంశవరేణ్య విష్ణువ
ర్ధననృపరాజచంద్ర నుతధర్మగుణాన్విత దైవికంబుచే
ననుపమవృత్తి వైశ్యులకు నల్లుఁడ వైతివి యింక మాకు నీ
చనవు ధనంబు రాజ్యమును సంపదయుం గొదయే తలంపఁగన్. 75

క. దేవరకుఁ గన్య నిత్తుము, పావన మగుమాకులంబు ప్రజ లౌనఁగా
భావించి లగ్నదివసము, శ్రీ వెలయఁగ నిర్ణయింపు సిద్ధాంతులచేన్. 76

వ. అనిన విని యమ్మహీపాలుండు. 77

క. అంతటను నాత్మలోపల, నెంతయు సంతోషమొంది యెలమిని సపుడా
చెంతలనయున్న జోస్యుల, వింతగ రావించి విభుఁడు వేడుకతోడన్. 78

క. సచ్చరితు లైనజోస్యులు, వచ్చినఁ గనుఁగొనియు నృపతి వారికి ననియెన్
విచ్చుఁడు పంచాగంబులు, హెచ్చుగఁజూచి శుభలగ్న మిడుఁడి యటన్నన్. 79

వ. వారును. 80

క. కార్యార్థు లైనవైశ్యుల, కార్యము నాభూమిపాలుకార్యము గలుగన్
ధైర్యంబున మాసావధి, నార్యులు శుభలగ్ననిశ్చయముఁ జేసి రొగిన్. 81

వ. ఇట్లు నిశ్చయించి ప్రభవసంవత్సరమాఘశుద్ధద్వితీయాగురువారంబున జామిత్రశుద్ధ లగ్నం బొక్కటి జామెక్కినమిాఁదఁ గల దనినవాక్యంబులకు సంతసిల్లి పురోహితజనంబులకు బంధుజనంబులకును దాంబూలదానాదివిధానంబు లొనరించి కదలుసమయంబున, విందారగించి విశ్చేయుండనుసలవృద్ధ లగువైశ్యులం జూచి బాలనగరంబు లిట్లని తలంచిరి. 82 ?

క. సంతసమున కట్నము ల,త్యంతప్రియ మెసఁగ నిచ్చి యనుపక వైశ్యుల్
శాంతిమతి నిలిపి రపని, కాంతుని విందారగించి కదలు మటంచున్. 83

వ. అని చింతించి వైశ్యజనంబులకడకు వచ్చి కులోచితసంజ్ఞ లైనబదులుమాటల నిట్లనిరి. 84

సీ. నీరాజనంబుల నెఱయ నిప్పించు కో వనితలతోఁ గూడి వచ్చునంతఁ
జెలుతఁ గనుంగొని చిత్తంబులోఁ బొంగి వెపతోడ సీరాను నొసఁగుమనియె
నెడచేసినిలిపితి మింతట దోస గయ్యెఁ బ్రబలుంగు ధారిణీపాలకుండు
పుడుగు దమ్ముల మని పొందఁగా బాజుల మెసఁగ నేతెంచి తా మెట్లుచూచి

తే. రమ్యతర మైనబహుపదార్థములు దివ్య, పవకకాంచనరత్నసంపదలు చూచి
యేమి యూసులు చెలఁగునో యీక్షణంబ, పలుకునేర్పున సుదిఁగింపవలయుననుచు.

సీ. సీరాజనంబులు నెఱవ రప్పించిన వనితలతోఁ గూడ వచ్చినట్టి
చెలువను గనుఁగొని చిత్తజాయత్తుఁడై చెలియపైఁ దనమతి నిలిపె దీని
నెవ్విధంబున మాన్ప నెంతుమా యన్నను బ్రబలుండు ధారిణీపాలకుండు
సమయ రమ్మంటిమి కన్నుచోఁ బంక్తిని గూర్చుంటి మనయొక్కకొమరు గాంచి

తే. యేమి యూహలు సేయునో యీక్షణంబ, పలుకునేర్పున నుడిగింపవలయు ననినఁ
గొంప ఱిది యేటియోజన కూడ దిదియుఁ, గుడువరమ్మని యిటులనఁగూడునొక్కొ,

మ. పతితుం డైన మహావిరోధి యయినం బాపాత్ముఁడుం డైనఁ గు
త్సితుఁ డైనం గరళాగ్నిదుండయిన విద్వేషంబుతో వచ్చినం
బితృమాతృఘ్నుఁడు నైనఁ జోరుఁ డయినం బీభత్సచండాలసం
గతుఁ డైనన్ భుజియింపఁజేయవలయుం గాలాతిపాతంబునన్. 87

క. ఆతిథ్యసత్క్రియామతి, నీతని బ్రార్థింపవలసె నేమనవచ్చున్
మీతలఁపుకోలఁది నడపుఁడు, భూతలపతిమనసు కందుఁ బొందకయుండన్. 88

వ. అనినఁ బాలనగరంబులు మీరు నిజగృహంబులకుం జనుండు మానేర్చువిధంబునం బలికి రాజును బురంబువెలువడం గెంటిపోయెద మని నగరేశ్వరదేవాలయంబుకడ నున్న రాజుకడకుం జని నమస్కారంబు లొనర్చి. 89

సీ. నగుమొగంబుల బాలనగరంబు లేతెంచి పలికి రిట్లని మహీపాలుతోడ
నృపవర్య మాకన్య నీ కిచ్చివేడుక ఘనతరాజ్యము సేయఁ గలిగె ననుచు
మదిఁ బొంగియుండంగ మాపెద్ద లందఱు విందుఁ జేయఁగ నింకఁ బొందు దప్పె
జగతిలోపల నొక్కసామెత గలయది గతికిన నతకదు కార్య మనుచు

తే. ఘనప్రియమ్మున భుజియింపఁ గదలిరమ్ము, అరుగవలసిన నీక్షణ మరుగు మనిన
నతికినం జాలు మీయిండ్లఁ గతక నేల, ననుచుఁ బరిహాసవైఖరి నరిగె నృపుఁడు. 90

గీ. అట్లుగాక యనుచు నాహవవిజయుండు, విష్ణువర్ధనుండు వెడలెఁ బురము
బాలనగరములును బాయక సంప్రీతిఁ, గొలిచి చనిరి నీతికుశలు లగుచు. 91

ఉ. బాలవణిగ్గనంబులును ప్రాఢవచోవిభవంబుతోడ భూ
పాలవరేణ్యు వెంటఁ బ్రియబాంధులకైవడి నేఁగి రాప్తులై
శైలనదీనదాంతరవిశంకటచారువనద్రుపుష్పలో
లాళిశుకాళికోకిలవిహారము లాత్మకు నింపు జేయఁగాన్. 92

వ. ఇవ్విధంబున నాభూపాలుండు వైశ్యకుమారులకష్టోపాయం బెఱుంగక యాప్తులని భావించుచుం జనుచు వెంటం జనుదేరం బోవుచుండె నంత నిక్కడ మంత్రిసామంతపురోహితభృత్యామాత్యపరిజనంబు లెల్లరాజు గమనించుట దెలిసియాప్తవర్గంబు వెంటఁ బోవుటలేదు. ఎట్టిసుర్ఘటం బగుకార్యంబు వాటిల్లునో మనతో విచారింపక తత్తరంబున నేకాకియై చనియెనని విహ్వలులై రాజగమనంబు వీక్షించి పాదచారులై యలసటం బొందుచు నందఱుం బోయి రంత. 93

ఉ. అంగజవైరిచారుమకుటాంతరసంగమహారవస్ఫుటో
త్తుంగతరంగ సంచలితతోయపతంగ మహోగ్ర పాపరు
గ్భంగ శుభప్రసంగ నిజభక్తజనావనదృష్టిశోభితా
పాంగఁ బటీరచంద్రధవళాంగను గంగను గాంచె నత్తఱిన్. 94

క. జనవరుఁడును దత్తీరము, నను నిలిచి నమస్కరించి నలువొప్పఁగఁ దాఁ
జనుదెంచు బలములం గని, మనమున దూర మని యెంచి మహిపతి యంతన్. 95

గీ. అంత నాసన్నులైన సామంతమంత్రి, వర్గములతోడ నింతయుఁ బలుకకున్న
యింతపనియేమి దేవర యిడు ముదలను, నింతయును వినంగవలయు మహీతలేశ. 96

గీ. అనిన వారలఁ గనుఁగొని యనియె విభుఁడు, మనకు విందులు సేయఁగ మదిఁదలంచి
చనినపిమ్మట నవ్వైశ్యతనయు లరుగు, దెంచి యిట్లని పల్కిరి మించి యపుడు. 97

వ. అయ్యా మాకన్యను మీరడిగినపుడు మాయిండ్లలో భోజనము సేయఁగూడదు. ఏలయన గలికిన నతుక దనుపెద్దలవాక్య మున్నది గాన మీరీక్షణంబ వెడలుఁ డనిన నరుగుదెంచుచు మనోవికల్పంబున మిమ్ముం బిలువమఱచి కొంతదూర మరుదెంచి వెనుకకుఁ జూచి మీ రరుదేర సంతసించితి ననిచెప్పిన విని సామంతు లా వైశ్యులను గుమతు లని మనంబులఁ దలపోయుచుండ రాజు వారల కిట్లనియె. 98

సీ. కౌస్తుభరత్నంబుఁ గనుగొన్నరీతిని బాలఁ జూచినయంత లీలతోడఁ
గోమలి నావెంటఁ గొనుచు రాజమహేంద్ర పురవరంబునకుఁ దేఁబూననైతి
విందుఁజేసినయట్టివిధులను మాన్పించి యనిపిరి వీరు మధ్యాహ్నవేళఁ
గపటమార్గంబులు గాననౌచున్నవి బాలవైశ్యులు బుద్ధిఁ బ్రబలినారు
తే. అనుచు మదిలోన సందేహ మావహిల్ల, వీరిచే నిశ్చయము చేసి వెడలవలయు
ననుచు మనమునఁదలఁచియమ్మనుజవిభుఁడు, నుచితపరివారమంత్రిసంయుక్తముగను.

ఉ. ఆనది భూవిభుండు నిగమాంచితవారుణసూక్తపావన
స్నానముఁ జేసి సంయమమనంబున వైశ్యకుమారులార గం
గానదిసూర్యచంద్రశితికంఠులుసాక్షిగఁ గన్యకామణిన్
మానుగ నిచ్చి మత్కరుణ మన్ననఁ బొందుఁ డటంచుఁ బల్కినన్. 100

క. అనుమాటకు నవ్వైశ్యులు, మనములఁ బెగడొంది మిగుల మదిఁ గలఁగినచో
ధనదాహ్వయుఁ డగుబాలుఁడు, జనపతి కెదురేగి పలికె సంభ్రమ మెసఁగన్. 101

క. మాడెస నేటికి సంశయ, వాదము దేవరకు నిచ్చువారము పాపం
గాదేని చచ్చువారము, భూదివిజార్కేందుగగనములు సాక్షులుగన్. 102

వ. అనిపలికి మఱియు. 103

గీ. ఇచ్చువార మబల నీకుంటిమాయెనా, చచ్చువార మేమి సందియంబు
వలదు నీదుపురికి వైళంబ విచ్చేయుము, మనిన మెచ్చి రాజు నరిగెఁ బురికి. 104

వ. ఇట్లు సత్యంబుపలికినయనంతరంబ ధనదాహ్వయాది బాలనగరంబు లమ్మహానదిం గృతస్నానులై నిజపురంబున కేతెంచి కులవృద్ధులగు వైశ్యవరులకుఁ దద్వృత్తాంతం బంతయు నెఱింగించిన వార లత్యంతచింతాభరాక్రాంతహృదయులై శ్రీనగరేశ్వర

మహాదేవుని ముఖమండపంబునఁ గూర్చుండి భాస్కరాచార్యప్రముఖపురోహితుల రావించి వారలతో నిట్లనిరి. 105

క. కులమును మానము శుద్ధియుఁ, వలయు విచారించి చూడ వైశ్యుల కెందుకా జలమున భూపతు లేచిన, నలరంగా నిలువకున్న నపకీర్తి యగుకా. 106

గీ. ప్రతిన వలుకుఁ డనుచుఁ బ్రబలుఁ డౌ భూపతి, బాలనగరములను బాయ కడుఁగఁ బలికి తిరుగరాదు పలుక కుండఁగరాదు, పలుకుబొందు నమ్మఁ బలికినారు. 107

వ. అప్పలుకులు ప్రతిష్ఠింపవలయుఁగావున సన్నంపుఁగార్యంబు గాదు విసుం డశేష వైశ్యసంఘంబులు గూడవలయునని నిశ్చయించి సమయమంత్రిని నియోగించినఁ దత్క్షణంబున నమ్మంత్రివరుండు పదునేడుపట్టనంబుల వైశ్యులకు జాబులు వ్రాయుం డనిన వ్రాయఁదొడంగి రెట్లనిన. ఆదిప్రశస్త్రస్వస్తిసమస్తప్రశస్తవస్తువిస్తారితభువన భరణవిజృంభమాణవిశ్వవిశ్వంభరాభారశాతకుంభకుంభినీధరాతిశయప్రభావచంద్ర చంద్రికాప్రభావిజితరజతగిరిశృంగవిహారప్రథితనానాప్రసూనసముదయసముదితా నేకతరణిబింబకదంబకిరణస్ఫురణమణిగణమందిరంబును జింతామణిగణద్యుతిసమా కీర్ణంబును మందారపారిజాతహరిచందనసంతానకల్పతరుశృంగారవనవిశేషంబును వివిధపరిమళమిళితగంధవాహబంధురసంచారంబును సర్వర్తునిరంతరమిళితప్రసూన వాసనాభాసమానమత్తమధుకరనికరశోభితసరోవరంబును సహకారఫలరసాస్వాదక లకంఠశుకశారికామధురస్వరంబును మాణిక్యతోరణప్రకాశితంబును నగునిజాంతః పురస్థలమధ్యస్థితరత్నసింహాసనంబున సుఖాసీనుండై నిజపదకమలసేవాగతకుమార వాహనాలోకనయత్నాభిదభూషాదేశశేషోద్గతనిశ్వాసప్రదీప్తాలికనయనజ్వలనప్రతా పప్రవస్నాళిబాలశశాంకసుధాసంయోగసంజాతజీవరాజీవానన శిరోమాలికాఫణిత ప్రూర్వనిగమాకర్ణనప్రమోదలీలావిలాసమానసుండును నారదాదిసమస్తఋషిగణజే గీయమానుండును మాగధచండీశ్వరకీర్తనీయకీర్తిస్ఫూర్తియుక్తుండును గంగాతరంగ కమనీయజటాజూటకీలితశశాంకరేఖావిభ్రముండును మహాప్రచండమార్తాండ కోటిప్రభాభాసితుండునుసమస్తప్రమథదేవతారాక్షసయక్షగరుడగంధర్వాదిపరివార సేవితుండును దివ్యయోగీంద్రహృత్కమలపూజితుండును నైనశ్రీమన్మహాదేవున కతిప్రియసఖుండును లక్ష్మీస్తనపాలిప్తకస్తూరికాముద్రాంకితవక్షుండును శ్రీవత్స లాంఛనుండును బతంగపుంగవస్కంధసీమాసముత్కర్షణకిణాంకితసుకుమారోదరయు గళుండును సకలదేవతారాధ్యుండును బాంచజన్యసుదర్శనకౌమోదకీశార్ఙ్గాదిదివ్యా యుధవిజృంభమాణమహాబాహుండును విన్యస్తకౌస్తుభమణివిరాజితవైజయంతీవన మాలికాసమాక్రాంతనితాంతవర్తులకంఠుండును మందరధరాధరధరణధురంధరుం డును గోటిసూర్యతేజుండును నగుశ్రీవిష్ణుదేవునాభీకమలము నుద్భవించినవాఁ

డును సమస్తప్రపంచనిర్మాణకర్మవిచక్షణుండును సకలకళాభిజ్ఞుండును భారతీ మనోహరుండును నగుచతుర్ముఖబ్రహ్మకుఁ బుత్త్రుండు పులస్త్యుండును దత్సూనుండు విశ్వవసుండును నతనికిఁ బ్రియతనూజుండును నలకాపురీశాసకుండును నగుకుబేరుని యంశసంభవులును బ్రహ్మోరుసంభవులును దపస్సంతోషితసదాశివులును గోకర్ణ సముద్భవులును శ్రీమన్మహాదేవప్రసాదలబ్ధవిభవులును యజనాధ్యయనదానకర్మ త్రయపాత్రులును గర్భాధానపుంసవనసీమంతజాతకర్మనామకరణాన్నప్రాశనచౌలో పనయనప్రాజాపత్యసౌమ్యాగ్నేయవైశ్వదేవసమావర్తన గోదానవివాహాఖ్యషోడశ కర్మపరిపూర్ణులును,కృషివాణిజ్యగోరక్షణవృద్ధిజీవనక్రియాగరిష్ఠులును శ్రీనగరేశ్వర దేవజనార్దనదేవపాదపద్మారాధకులును గౌరీలక్ష్మీచరణసేవావిధిజ్ఞులును శ్రీగురుభా స్కరాచార్యాశీర్వచనాతిశయవిశేషసంపూర్ణాతర్కైశ్వర్యులును ననవరతకర్పూర కస్తూరికాకుంకుమమాంజిష్ట చీనిచీనాంబరముఖసమస్తవస్తుక్రయవిక్రయవివేకవిశా రదులును వైడూర్యవజ్రగోమేధికపుష్యరాగమరకతమౌక్తికపద్మరాగనీలప్రవాళాది రత్నపరీక్షాధికారులును దేవబ్రాహ్మణప్రతిష్ఠాధురంధరులును సాలోక్యసామీప్య పదసంపన్నులును బాండవవంశసంజనితవిష్ణువర్ధనరాజేంద్రప్రతివాదహతశేషప్రవర్ధ మానభూలోకసంపూర్ణకీర్తిప్రతాపులును నానాదేశప్రదేశసంప్రతిష్ఠితదేవాలయా రామతటాకాగ్రహారభూసురపరిణయకావ్యనిధిముఖ్యసప్తసంతానాధీశ్వరులును శ్రీ గురుభాస్కరాచార్యోత్తమాదిసమస్తభూసురార్పితగృహారామసస్యక్షేత్రపురశ్రే ష్ఠకలితాగ్రహారధురంధరులును బ్రతివసంతసంతర్పితవిప్రసహస్రవిధూతార్తిప్ర వర్తకులును అఖండితలక్ష్మీప్రసన్నులును గోటిధ్వజప్రతిష్ఠాపనులును సకలభాషావిశా రదులును సత్యహరిశ్చంద్రులును సత్కాంతిచంద్రులును భోగదేవేంద్రులును భాస్కరప్రభాసాంద్రులును బాధోధిగంభీరులును రూపజితకందర్పులును ద్యాగ కర్ణులును ధర్మధర్మజులును బరోపకారమూర్తులును నుత్తమజన్మావతారులును నుద్యో గాభిరాములును మలయజావల్లభులును మేనఱికధర నిరతులును దేవబ్రాహ్మణపూజా విధేయులును బెనుగొండపురపరశాసకులును నష్టాదశపురనివాసులైన చప్పన్నదేశ సంచారవ్యాపారులైనసకలపట్టనవిస్తారాలంకారులైనవావివర్తనతప్పనిమహానుభా వులైనశ్రీమత్సమస్తసద్గుణసంపన్నులైన మహామేరుసమధీరులైన పెనుగొండపుర వరశ్రీనగరేశ్వరముఖమండపంబున ధర్మసింహాసనంబునఁ గులాచారనిర్ణయమునకుఁ గూడికూర్చున్ననగరస్వాములు తమతోఁబుట్టువులైన తథావిధబిరుదాంకితులగు ధర్మధనదాదిపురనివాసులగు నగరస్వాములకు సస్నేహప్రియపూర్వకంబుగాఁ బుత్తే వలయు లేఖార్థములు. కులాచారధర్మనిర్ణయకారణంబునకుఁ గార్యంబుగలిగియు న్నది. కర్త్రికాసంధర్యసరంబున నతిశీఘ్రంబుగా రావలయు ననిలిఖియుంచి సప్త దశలేఖానికరంబు గూఢచారులైనధూతల కిచ్చి పంచిరంత. 108

ఉ. పత్త్రికలంతఁ జూచి పదబంధురనీతికళాధురంధరుల్
గోత్రపవిత్రు లార్యజనకోవిదు లాఢ్యు లపారధీరతా
సూత్రగరిష్ఠు లక్షయవిశుద్ధసువర్ణమణిప్రజంబులం
జిత్రముగాఁగఁ గూర్చుకొని శీఘ్రమునన్ జనుదెంచి రందఱున్. 109

క. వచ్చినకులజనధీరుల, నచ్చెరువుగ నెదురుకొనుచు నానందమున
న్మెచ్చుచుఁ దగ నుపచారము, లచ్చుగ నొనరించి రంత నద్భుతభంగిన్. 110

క. నగరేశ్వరసౌధంబున, నగణితముగ వైశ్యధీరులందఱుఁ గడఁకన్
దగధర్మసభాసదులై, నెగడుకులాచారధర్మనిర్ణయబుద్ధిన్. 111

వ. ఇట్లరుగుదెంచినవారికిఁ దగినవిడిదల లిచ్చి కొన్నిదినంబులు జరపి యొక్కనాడు భాస్కరాచార్యుతో విచారించి యీవచ్చినవారి కీవృత్తాంతం బెఱిఁగించి ముందు జరపఁదగినయత్నంబు సేయుం డనిన వల్లె యని భాస్కరాచార్యుండు నగరేశ్వర జనార్దనులముఖమండపమునం గూర్చుండి పెనుగొండ మొదలుగఁ గలయష్టాదశపురంబులనుండి వైశ్యులఁ బిలువంబంచి వచ్చినవారిం గూర్చుండ నియమించి వారల నవలోకించి దత్తావధానులై వినుం డని యిట్లనియె. 112

సీ. విక్రమాటోపుఁడై విష్ణువర్ధనరాజు దిగ్విజయముచేసి దీప్తమహిమ
మనపురి కేతెంచి మహిమతోఁ గుసుమాఖ్యసుత వాసవాహ్వయఁ జూచి కొంత
ప్రేమంబు నిండారఁ బెండ్లియాడెదనంచుఁ బలఁచి కామాంధుఁడై తత్తరింప
నిచ్చువారము కన్య నీకుంటిమాయెనా చత్తు మటంచును జతనసలిపి
తే. బాలనగరాలు వచ్చిరి ప్రతినఁ బలికి, యింక నెబ్బంగి నీకార్య మెట్లటంచుఁ
గలసి యన్యోన్యభాషలఁ గలుగుబుధులు, చేరియాలోచనంబులు చేయఁ దగును.

వ. ఇట్లవైశ్యసంఘంబు లట్టివార్తాసముదయంబు విని కలంగి భయాక్రాంతస్వాంతులై యనంతరంబు ధైర్యంబవలంబించి ధర్మంబును శాస్త్రంబగు నీతిశాస్త్రంబును దలంచి పెక్కండ్రు పెక్కుబుద్ధుల నిట్లనిరి. 114

క. సోమకులాగ్రేసరునకు, భూమీశున కబల నిచ్చి పొసఁగినకృపచే
నేమంబున బ్రదుకుదమా, యీమని జగడంబుసేయ నేటికి మనకున్. 115

వ. అని కొందఱు పలికిన మఱికొంద ఱిట్లనిరి. 116

సీ. చాళుక్యకులవార్ధిచంద్రుండు భూపతి యర్హమౌసంబంధ మని తలంపఁ
గలియుగం బిదిగానఁ గడుహీనకులుఁ డైన రాజు నేనని మీఱి రంతుసేయ
యుగయుగధర్మంబు లొక్కొక్కవిధములు సూక్ష్మధర్మంబుల చోద్యవిధులు
నీతియు ధర్మంబు నిజకులారూఢియు వృద్ధానుసారంబు వెదకి వెదకి
తే. దుర్బలత్వప్రబలత నొందు ఘోరభయములయ్యుఁ, గాన నేర్పుఉపాయంబులఁ గన్య నీక
సామభేదాద్యుపాయముల్ సంగ్రహించి, నేర్పుమెంపున మానంబు నిల్పవలయు.

మ. నవరత్నోజ్జ్వలహారముల్ నవలసన్నానావిచిత్రాంబర
ప్రవికాసాంచితశుద్ధకాంచనగజభ్రాజత్తురంగాదులన్
సువిచిత్రంబుగ నిచ్చి రాజుతలఁపుల్ శోధించి తద్భృత్యులన్
వివిధోపాయములన్ వశం బగునగతుల్ నిర్మింపఁ గార్యం బగున్. 118

వ. అని విచారించి మిత్రభేదసుహృల్లాభసంధివిగ్రహముఖతంత్రంబులను సామదాన భేదాద్యుపాయంబులను సాధింపరానికార్యంబులు లేవు. తద్విధానజ్ఞులం బ్రతి భావంతు లగుమహానుభావులం బంచి రాయబారంబుఁ జేయింపవలయు నని తత్స భాసదులలోన. 119

సీ. వేదశాస్త్రజ్ఞుల వివిధపురాణజ్ఞు లను సదాచారవర్తనుల మఱియు
నీతికళాజ్ఞాననిష్ఠాగరిష్ఠుల మాధుర్యవాక్ప్రౌఢిమానవిదుల
మాయాప్రతిష్ఠుల మహితప్రతాపుల నిర్భయస్వాంతుల నియతమతుల
నవ్యాహతోక్తుల నద్భుతోద్యుక్తుల సకలభావజ్ఞుల సత్యధనులఁ
తే. బంచదశసంఖ్యధీరుల భాగ్యయుతుల, నమితధనవస్త్రసన్మణు లలరఁ గూర్చి
కలితవాక్యచయంబుల గారవించి, రాయబారంబుఁ బంపి రుపాయవిదుల. 120

క. అంతట నవ్వైశ్యులు మది, నెంతయు సంతోషమంది యెలమిని ధనముల్
చింతింపఁగ నటుఁ గూర్చియు, వింతగ నారాత్రి గడపి వేకువ నంతన్. 121

వ. మంగళపాఠంబుల మేలుకొన్నవారై ప్రాతఃకాలవర్తనంబులు నిర్వర్తించి నగరే శ్వరజనార్దనులభవనంబుల కేగి భుజానమస్కారంబు లొనరించి ప్రార్థనపురస్సరం బుగా గురునాశీర్వాదమంత్రాక్షతలు గైకొని ప్రయాణోన్ముఖులై యున్నవారలం జూచి. 122

గీ. నృపతి సమ్ముఖమునఁ జేరి నేర్పుమీఱ, వలయు వారల నెమ్మనముల నెఱింగి
సెలవు గైకొని మాటాడవలయుఁ గాని, చెదరిపోకుండఁ జేయుఁడు చెప్ప నేల. 123

వ. అని పలుయుక్తు లెఱింగింప వారలు తదాజ్ఞావిశేషంబున బహువిధవాహనారూఢు లై కదలి గౌతమమహాముని తపస్సామర్థ్యంబునం బ్రవహించిన వృద్ధగంగోత్త రణంబు సేసి రాజమహేంద్రపురప్రాంతంబునఁ బద్మగిరిశృంగంబున సమస్తవైభవ విభ్రాజితం బై నదివ్యమణిహాటకప్రభాపటలప్రచురప్రసిద్ధరమ్యహర్మ్యనివహం బులం గలిగి చంద్రకాంతవితర్దికాస్థలమాధవీమండపప్రముఖదేవతాగృహక్రీడా వనప్రాకారతోరణరత్నకవాటభద్రశాలావృషభధ్వజస్తంభ హోమకుండమండప సౌధోత్తరచిత్రభిత్తికావాతాయనాదివిశేషంబులచేత నద్భుతం బగుచున్నయభినవ కైలాసంబనంబరఁగు మార్కండేయేశ్వరస్థానంబున మహాగణపతీశ్వరునకు షోడ శోపచారంబులు చేసి భైరవాధిదేవతానికాయంబులదర్శించుచుఁ బ్రదక్షిణంబులు సేసి యుమ్మహాదేవుని గర్భాగారంబుఁ బ్రవేశించి యిట్లని స్తుతియించిరి. 124

శా. అర్కాధిక్యరుచిప్రకాశుని మహాహారీకృతాహీశు ష
ద్వర్గాగోచరు నాద్యునిర్మలజనధ్యానప్రకాశాత్మసో
దర్కార్థప్రదు నిత్యవైభవసుకస్థాను న్మహాదేవు శ్రీ
మార్కండేయమహేశు నెంచిరి వణిక్స్వామ్యుల్ ప్రమోదంబునన్. 125

గీ. మహితహేమపుష్పమణులఁ బూజ లొనర్చి, యక్షలవైభవముల నర్థిఁ జేసి
కదలి తత్పురంబుఁ గడకఁ బ్రవేశించి, చని నృపాలుని మొగసాల నిలిచి. 126

వ. ద్వారపాలుర నుగ్రాక్షమహాత్ములం జూచి తమరాక రాజున కెఱుంగునట్లు విన్న
పంబు సేయుం డనిన వార లరిగి విన్నవించుటకు సమయంబుగాక కొంతతడ వుండి
యంతఃపురంబున నున్నవిష్ణువర్ధనుం జూచి ప్రణామంబు లొనరించి కృతాం
జలు లై. 127

గీ. అవధరింపవలయు నవనీతలేశ్వర, విన్నపంబు సేయుచున్నవార
మినసమానతేజ పెనుగొండపురవరుల్, వరగుణాఢ్యు లైనవైశ్యు లిపుడు. 128

క. వినుతమహాసంపదలను, ఘనముగఁ గానికలు దెచ్చి ఘనగాంభీర్య
మ్మున మోసల నిటు నిలుచుచు, వినయంబున నవసరంబు విధ మెట్లన్నన్. 129

వ. నిజాగమనంబు దేవరకు విన్నపంబుసేయవలయునని పలికిరి మనిన నెఱింగించితి
మనవుడు నమ్మహారాజేంద్రుండు. 130

మ. పరమానందవికాసమానసశుభప్రారంభజృంభాత్ముఁ డై
కర మొప్పం బ్రతిహారరక్షుల కొగిం గట్నంబు లిప్పించుచున్
వరసద్వైభవభవ్యసంభ్రమగతిన్ వైశ్యాబ్ధిపూర్ణేందులన్
గరిమం దోడ్కొనిరం డటంచుఁ బలికెం గారుణ్యసంధాయి యై. 131

వ. తదనంతరంబ. 132

సీ. ఖచితసౌరభపుష్పకబరీతలంబున వెలయునుజ్జ్వలశిరోవేష్టనంబు
నవరత్నబహుదివ్యనవ్యభూషణకాంతి పర్యంతభూములఁ బ్రతిఫలింపఁ
గస్తూరికాసారఘనసారచందన పరిమళంబుల దిశ ల్పరిమళింప
సర్వోత్తమానర్ఘచారుదివ్యాంబరపటుతరస్ఫురణలు పరిఢవిల్ల
తే. బ్రథితశృంగారలక్ష్మ్యధిపతియు నగుచుఁ, గనకరత్నసౌధంబునఁ గాంతిమహిమ
వజ్రసింహాసనస్థుఁ డై వన్నె మిగుల, వరుసఁ గొలువుండె నవ్విష్ణువర్ధనుండు. 133

కొలువువర్ణన సీసమాలిక:—

ఘటులాటమగధాధిపతులు వింజామర లలరింపఁ జోళవంగాధిపతులు
ముక్తాఫలచ్ఛత్రములు పట్టి ద్రవిళాంధ్ర శుభరత్నఖచితభాసురపటి [illegible]
గుంతలుం దడపంపు [illegible] తో ధరియింపఁ [illegible] షట్చక్రవర్తులు [illegible]

మణిదర్పణము పట్టె మద్రుండు భోజుండు చమరీన రత్నంబు సాగెఁ దాల్పెఁ
గాళింగబంగాళకాశ్మీరకాంభోజు లురువేత్రహస్తులై యొప్పమిగుల
సౌరాష్ట్రనేపాళకేరళకన్నోజు లవధారువిన్నపా లర్థిఁ జేయఁ
గురుమహారాష్ట్రఘూర్జరపాంచాలు రనయంబు జయజయధ్వనులు సేయ
యవనకొంకణసింహళాధీశు లంతంత నతిభక్తి నవసరం బర్థి మెలఁగ

తే. మఱియుఁ దక్కినదిక్కుల మనుజవిభులు, నియతిసేవావిధిజ్ఞులై నెఱయఁ గొలువ
నాదిమబ్రహ్మసదృశు శౌనార్యవిభులు, చారువిక్రమకీర్తులు సన్నుతింప. 134

చ. తరుణులు పల్లవాధరలు తామరసాక్షులు నీలకుంతలల్
సరసిజగంధు లున్నతకుచద్వయలాస్యసుధాంశుబింబ ల
త్యురుకటిభార లంచితకృశోదర విద్ధపదాంబుజోజ్జ్వలల్
పరమవిలాసినీమణులు పద్మిను లొప్పులపుష్పగంధులున్. 135

వ. మఱియు ననేకసౌభాగ్యవతు లగువిలాసినీజనులు గొలువఁ గొలువుండి చెలువు మిగిలి విజయసింహవిక్రమశాలి వీరసేనసుమంతశాంతనచంద్రచూడ సింహధ్వజను మదనానంద విక్రమబలోద్ధతభీమాగ్రహాసమగ్రాయుధశుభగ్రీవమహాధీరకుమార కంఠీరవు లనుషోడశప్రధానులును బ్రచండబలప్రముఖోద్దండమహాభుజదండదండ నాయకులును విక్రమనీతియుగంధరు లగుసేనాధిపతులును నతిరథమహారథార్ధరథు లనం బరఁగిన రథికనికాయంబులును మహాయోధవీరులును నిరర్గళబాహాటోప దీక్షితు లగునపరిమితవీరభటులును సముద్ధతభుజసత్త్వసాహసచిత్తు లగువీరరాహుత్తు లును దిగ్దంతిసమానంబు లైనగజవ్రజంబులును సూర్యరథ్యసమానంబు లైన తురంగం బులును గనత్కనకరత్నఖచితస్యందనంబులును ఋగ్యజుస్సామాథర్వవేదవేదాంత వైశేషికభాట్టప్రాభాకరాదిశాస్త్రపద్మహంసు లగువిద్వాంసులును నీతిశాస్త్రాధిపతు లును రంభాద్యప్సరస్సమాన లగుమదనహేళిమంజువాణిరత్నతిలక రత్నావతి విశా లాక్షి శృంగారిణి దివ్యాంగి బింబాధరి పద్మావతి పద్మగంధి కంబుకంఠి తనుమధ్య నిమ్ననాభి వసంతమంజరిలావణ్యవతికలావతు లనం బరఁగిన నర్తకీకాంతలు నాట్యంబు సలుపఁ బంచమహాశబ్దంబులు ఘుమఘుమాయమానంబు లై చెలంగఁ బాండవవంశ వర్ధనుం డైనయవ్విష్ణువర్ధనుండు (ద్వీపప్రతి) వినియోగాధీశ్వరుం డై వరాహలాంఛ నాదిబిరుదధ్వజ విలాసంబు లలరఁ గొలువుండునవసరంబున నన్యైశ్వర్యవరులు తమ తెచ్చిన నానారత్నకాంచనరథాశ్వగజాద్యుపాయనంబులు సమర్పించి యాభూ పాలశిరోమణిం గనుంగొని. 136

క. ధీరత నింపొదవ నమస్కారంబులు సేసి నిలిచి ఘనతరమహిలో
నేరాజుల కీభాగ్యము, లీరీతి న్మహిమ నలరు నెవ్వని కనుచున్. 137

క. మున్నీవసుమతి నేలిన, యన్నరనాథులకలంపు లాజయలక్ష్మీ
సన్నాహమహాకీర్తులు, సన్నుతముగ నీకుఁ జెల్లు సర్వజ్ఞమణీ. 138

క. ధరఁగలవర్ణాశ్రమముల, నురువడి నొకటొకటిఁ గలయకుండఁగ నెలమిన్
బరఁగిన ధర్మస్థితితో, స్థిరముగ రాజ్యంబు సేయ దేవరక తగున్. 139

వ. అని సన్నుతించుచున్నయవ్వైశ్యోత్తములం గనుంగొని చిత్తంబునం గృప దళు
కొత్త నుత్తుంగసంగతకుతూహలంబు క్రొత్తక్రొత్తలై తత్తరింప వాసవీకన్యకా వివా
హం బవధరింప రమ్మని తోడ్కొనిపోవుటకై వచ్చినారు గావలయు ననుచు విజ
యసింహాదిప్రధానుల నందఱం జూచి మదీయసింహాసనసమానంబు లగుగద్దియ
లందఱకు నిడి వివిధోపచారంబులు సేయుండనిన వార లట్ల కాక యని కమనీయ
రత్నసింహాసనంబులు వెట్టించి కూర్చుండ నియమించిన నాగద్దియలం జూచి
వైశ్యు లారాజున కిట్లనిరి. 140

క. రాజులు గూర్చుండెడియీ, రాజితనవరత్నహేమరత్నాసనముల్
సైజములా మాకేటికి, రాజన్యకులావతంస రక్షితసుజనా. 141

వ. అనిన విని సస్మితవదనారవిందుండై సమస్తరాజ్యధురంధరుండును సకలకళానిపు
ణుండును నైనవిజయసింహుం డనునమాత్యశిఖామణి రాజానుమతంబున నవ్వైశ్య
జనుల కిట్లనియె. 142

గీ. రాజుమామ లీరు రాజరాజాంశులు, రాజ్య మేలఁదగినరాజు లనఁగ
మీరె రాజు లింక మేదినీమండలి, రాజు లెవ్వ రనుచు రమణఁ బలికె. 143

క. వల్లమునిగోత్రధీరుఁడు, నల్లసితుఁడు గణికిసెట్టి యూరవ్యులతోఁ
జెల్లముగఁ బలికె నప్పుడు, ఫుల్లసితాననముతోడఁ బూజ్యుల మనుచున్. 144

వ. అనిన విని యందఱు సుఖాసీను లై రంత. 145

సీ. కానుకల్ ప్రియమునఁ గైకొని వైశ్యుల దగ్గఱ గనకపీఠముల నునిచి
తడయక కర్పూరతాంబూలములు వెట్టి క్రమముతో వేర్వేఱ గారవించి
పరిణామమే యూరుభవులార మీకును భద్రమే వాసవీపద్మముఖికిఁ
గల్యాణమునకు లగ్నము చేరువయ్యెనే శోభనద్రవ్యముల్ జోకవడెనె
తే. కడమ గలిగినఁ జెప్పుఁడు కాంచనములు, భద్రగజములు హయములు పాడిపసులు
పటము లాదిగఁ గన్యకపారమైన, యుంకువిచ్చెద ననిన నాయూరుభవులు. 146

వ. రాజున కిట్లనిరి. 147

క. చక్కఁదనము నృపకన్యలు, పెక్కండ్రీభూమిఁ గలుగఁ బృథివీశ్వర నీ
వెక్కడ వైశ్యకుమారిక, లెక్కడఁ గక్కురితిమాట లేలా మీకున్. 148

వ. అనిన విజయసింహుఁడు రాజానుమతంబున నిట్లనియె. 149

ఉ. ఇందుకులాంచితాభరణుఁ డిన్నిజగంబుల నేలఁజాలు సం
క్రందనతుల్యుఁ డాతనికిఁ గామిను లెందఱు లేరు ధాత్రి మీ
నందనమీఁద నేటికొ మనం బొకయించుక నిల్పె నిందు మీ
రందఱుఁ బుణ్యవంతులు మహాధనవంతులు నైతి రుర్విలో. 150

క. వైవాహికశుభకరసు, శ్రీవినుతసమస్తవస్తు శృంగారముల
న్నావిరి నొనఁగూర్చితిరే, భూవరుఁడును గదలివచ్చుఁ బొందు దలిర్పన్. 151

క. మీరందఱుఁ జనుదెంచిన, కారణ మది యేమి మిగులఁ గటలుఁ దురుగలిక్
ధీరత మేలాఁ జెపుడా, సారస్యము మీఱ వైశ్యసత్తములారా. 152

వ అని యమాత్యవరుం డిట్లాడిన చాతుర్యవాక్యంబు లుల్లసిల్ల వైశ్యులలోన. 153

చ. మునికులగోత్రసంభవుఁడు మోదమెలర్పఁగ మాళిసెట్టి యి
ట్లనియెను మీరు మమ్ము నపహాస్యము సేయఁగ నేల ధాత్రిలో
ననఘచరిత్రులైనవసుధాధిపు లెవ్వరు వైశ్యకాంతలన్
మునుపు వివాహమైరె సచివోత్తమ యేల వృథాప్రయత్నముల్. 154

వ. అనిన విని. 155

క. ఆహాళ్యాఖ్యునిఁ గనుఁగొని, యామంత్రివరేణ్యుఁ డనియె నద్భుతమతి యై
సోమాన్వయసంబంధము, సామాన్యమె మీకులంబుసారం బయ్యెన్. 156

క. అన సచివునిఁ గని కనలుచు, మనమున నాభీలగోత్రమల్లాఖ్యుఁడనెన్
విను నృప సంబంధముచే, ఘన మగునాఘనత కేమికారణ మరయన్. 157

క. మాకులము విడచి పొందెదు, ప్రాకటవిభవంబు లేమి పని వైశ్యులకున్
లోకేశ్వరుఁ డగువిభునకు, మాకన్యకఁ గోరఁ దగునె మంత్రివరేణ్యా. 158

వ. అనిన మఱియొకమంత్రివర్యుం డి ట్లనియె. 159

సీ. వైశ్యాన్వయంబున వసుధాధిపతులకు సంబంధ మర్హంబు శాస్త్రభంగిఁ
గాదనువచనంబు గల్గినఁ జెప్పుడు నిర్వహింపఁగలేనినేర్పు లేల
సతులు వేవురుగల్గి సత్కృపానిలయుఁ డై కన్యాశిరోమణిఁ గడఁకఁ జూచి
తలఁపుచేయుటఁ జేసి ధన్యులై ప్రబలుచు నావిరాజసుఖంబు లనుభవించి
తే. నిత్యవైభవభంగుల నెగడుఁ డెలమి, నఖిలవిద్వత్కవీంద్రుల నడిగి యైన
మనసునం దనుమానంబు మాని శుభము, శీఘ్ర మొనరింపుఁ డూరక చింతయేల.

మ. అని వాగ్వైఖరిఁ బల్కి మించఁగను దా నత్యుగ్రభావంబునం
గనుఁగొంచున్ హరశిష్టగోత్రహరదాఖ్యాధీశుఁ డేపారఁగా
ననియెన్ శాస్త్రము లేల చూడ భువిలో నర్యాంగనం బెండ్లియై
వినుతిం బొందినరాజు లేయుగమునన్ లేరీ విమర్శింపఁగాన్, 161

గీ. అనిన నపహసించి యమ్మంత్రి యిట్లను
నర్యజాతకాంత నంగజాఖ్య
రాష్ట్రి మెఱుఁగఁగ ధృతరాష్ట్రుఁడు పెండ్లాడి
యుత్సవంబుతోయుయుత్సుఁగనఁడె. 162

వ. అనిన విని మఱియొక్క వైశ్యుండు. 163

క. ఎరసెట్లగోత్ర ధీరుఁడు, నరనాథునిమంత్రి తోడ నారాఖ్యుఁ డనున్
ధర నది ద్వాపరధర్మం, బిరవుగ నీ విట్లుపలుక నిపుణత్వంబే. 164

వ. అని పలికిన విక్రమశాలి యనుప్రధాని యిట్లనియె. 165

క. మీపను దెలిపెద వినుఁడీ, ప్రాకటముగ విప్రజాతిభామను బెండ్లై
లోక మెఱుంగఁగ వెలయఁడె, శ్రీకలితుం డగు యయాతి చిరతరకీర్తిన్. 166

వ. అప్పలుకులు విని సమస్తపురాణపారీణుండు. 167

మ. ఘనమైత్రేయసుగోత్రుఁ డావరవణిక్కాంతుండు నాగాహ్వయుం
డనియెం గామిని దేవయాన కచుచే నత్యుగ్రశాపంబునన్
మనుజాధీశ్వరుభార్య యయ్యె కనుక న్నాపాప కే శాప మి
వ్వనజాతాక్షి గణింపఁగాఁదగునె పూర్వద్వాపరప్రక్రియన్. 168

వ. అనిన వీరసేనుం డనుమంత్రివరుం డిట్లనియె. 169

చ. జలనిధి మేరదప్పిన నిశాకరబింబము త్రోవదప్పినన్
బలువిడి ధాత్రి గ్రుంగినను భాస్కరుఁ డిట్లుదయింపకుండినం
గులగిరి సంచరించినను గూర్మము భూమి భరింపకుండినన్
బలికినఁ బొంకనేరరు కృపాకరులైతగువైశ్యులెప్పుడున్. 170

వ. ఇట్లనినవాక్యంబులకు సంతసించి సభాసదు లౌరౌరయని సంస్తుతించిరి. అమ్మంత్రి మఱియు నిట్లనియె నదియునుం గాక గౌతమీనదికి నంపిపోయిన మీబాలనగరంబు లిమ్మహారాజేశ్వరుని వెంటఁ బరమాప్తులై వచ్చి రందు సరససల్లాపంబులాడినమాటలు దలంచికొండు పట్టివాగ్వాదంబు లేమికారణంబు ధర్మసూక్ష్మంబులనేకవిధంబులు గలవు మీరెఱుంగనిధర్మంబు లేదు సంతుష్టచిత్తులై కన్య నొసంగి మహారాజుకృపావిశేషంబునం బ్రదుకుం డనియొడంబఱచుసమయంబున. 171

గీ. శ్రీలకాఖ్యగోత్రసింధుశశాంకుండు, సోమిసెట్టి పలికె సొంపుమిగుల
నిది నెపంబు చేసి యిబ్బంగి నన నేల, ధనము గొనుఁడు మాకుఁ దగినపాటి. 172

వ. అని పలుకుసోమాఖ్యుం గనుంగొని వీరసేనుం డనుదండనాథుం డిట్లనియె. 173

క. ధన మెన్నఁడు మిముఁ గొన మని, ఘనముగ శాసనము లిచ్చి కలకాలంబున్
మను మని మాన్యము నేతుమె, ధన మెంతటిమాట గాఁగఁ దడవితి రనఘా. 174

వ. అనిన విని. 175

క. గోనీలగోత్రజాతుఁడు, వాసిగఁ గందలుఁడు పలికె వసుమతి మమున
శ్వేశుఁడు జపమాన్యులుగాఁ, జేసిప్రతిష్ఠించినాఁడు సిద్ధస్ఫురణన్. 176

వ. అనిన సుమంతుం డనుప్రధాని యిట్లనియె. 177

క. దైవములు నేయుమాన్యము, లీవసుధను సాగు ననుట యిది నిజమైనన్
భూవరుఁడు వేల్పుగాఁడా, నావిష్ణుర్భూపనియెడు నాస్మృతివినఁడే. 178

వ. మఱియు నొకండు. 179

క. ఉతకలగోత్రజుఁ డుత్తముఁ, డతనికి నిట్లనియె మంత్రి కంకుశలీలన్
పతి మత్తేభాకృతి ను, ద్ధతుఁడై చరియించె నేని దగ్గఱపలదే. 180

వ. అనినఁ జంద్రచూడుం డనుప్రధాని యిట్లనియె. 181

గీ. ఎందుఁ గందులేని యేణాంకవరవంశ, వర్ధనుండు విష్ణువర్ధనుండు
సకలధర్మవేత్త సర్వజ్ఞుఁ డారాజ,శేఖరునకు మేము చెప్ప నేల. 182

వ. అనిన విని మఱియు నొకండు. 183

క. నెఱిమాసాంతలగోత్రుఁడు, నెఱజాణగునద్రిసెట్టి నృపమంత్రి కనున్
వెఱపేమి కన్యనీ మని, మొఱపెట్టఁగఁ బెండ్లి గలదె ముల్లోకములన్. 184

వ. అనిన సింహధ్వజుం డనుదండనాథుం డిట్లనియె. 185

క. మును కన్యనిచ్చెదము నే, మని సత్యమువలికి యిప్పు డానోటనె యీ
మని మొఱవెట్టఁగ నేటికి, నినశేఖరుతోన మొదల నీ మనరాదే. 186

వ. అనిన యనంతరంబ వీరధ్వజుం డనుమంత్రివరుండు కోపోద్దీపితమానసుం డై యిట్ల
నియె, నీసార్వభౌముండు మీకల్లుం డైన నంతకంటెఁ గీర్తియు సౌఖ్యంబును
బ్రతాపంబును గలదె. మీకు నైహికాముష్మికంబులు సిద్ధించు వేర్వేఱ మాట
లాడకుండుండు మీ రీశ్వరప్రసాదలబ్ధవిభవులరు, మీకు సమస్తశాస్త్రజ్ఞానవిశేషం
బులు ధైర్యగాంభీర్యమాధుర్యవాక్యంబులు సైజంబులు గావునఁ జెప్ప నేల మీరా
డినమాట తప్పక కన్యనిచ్చుటమేలు రాజునకు మీకంటె నావశ్యక బంధులులేరు.
అదియునుం గాక నింకొక్కటి వినుండు మున్నుఁ గాంచీపురంబునఁ గాంతార
వంతుం డనురాజు నిఖిలవిద్యావిశారదుండును మహాతపోధనుండు నగు కేశవాచా
ర్యుండను విప్రుని కొమార్తను బాణిగ్రహణంబు చేసె నంతకంటె మీకులం
బెక్కుడే శుభయత్నంబు సేయుం డని వాలాయించి పలికిన. 187

క. కరుణింపుము మాకుం దర, తరములనుండియు విశేషధర్మముగల ద
చ్చెరువుగ మాతులకన్యా, పరిణయ మిజ్జగమునందుఁ బ్రఖ్యాతముగాన్. 188

వ. అని విన్నవించిన వైశ్యులంజూచి విజయసింహుం డిట్లనియె. 189

ఉ. రాజితలీల మీపురము రాజకులాగ్రణి చూడవచ్చినన్
దేజ మెలర్ప మీకు సుదతీజనకృత్యము లైనయట్టినీ

రాజన వేళఁ గన్యకకరగ్రహణార్థము సమ్మతించి ని
ర్వ్యాజముగాఁగ నిచ్చితి రవశ్యము ధర్మము దప్పనేటికిన్. 190

గీ. అనిన మాటకు మంత్రితో ననియె నప్డు, గుణగరిష్ఠుండు పాకాలగోత్రజుండు
తిరుమలాఖ్యుండు నీతిచే సరసు లెంచఁ, బరమమాధుర్య వినయసంప్రార్థనముగ. 191

క. నగవులకుఁ గన్య నడిగెను, జగతీశ్వరుఁ డనుచు రాజు సంతోషింపన్
మగువను గైకొనుమంటిని, తగునా యటువంటిమాట తథ్యము సేయన్. 192

క. నగ వైనను నిజమైనను, జగతీశ్వరుఁ డైనఘనునిసంబంధముచేఁ
బొగడొందెను మావంశము, తగుఁ దగ దని తలఁపకుండు తత్సంశయమున్. 193

చ. వరగుణబుద్ధి నీతిజయవంశపరాక్రమకీర్తిసంపదల్
సరియగువారితోడ బుధసమ్మతిచే నుభయానుకూలతం
బరిణయవైభవంబు సలుపం దగుఁగాక భవాదృశక్షితీ
శ్వరులకు వైశ్యకన్యల వివాహము గాఁదగ దెన్నిభంగులన్. 194

వ. అనిన మంత్రివరుం డిట్లనియె. 195

గీ. అవనిపతి కీయకుండిన నధమవృత్తి, యీమహారాజవరునకు నిచ్చినపుడ
మీరు రాజసమానులు మేదినిపయి, నేల హీనాధికత్వంబు లెంచి చూడ. 196

వ. అనిన వైశ్యవరుం డిట్లనియె. 197

సీ. ధర విప్రవరులకుఁ దమతమశాఖల వైవాహికం బతిపావనంబు
క్షత్రిస్వయంవర గాంధర్వనిజకులోద్వాహంబు నృపులకు వర్ణితంబు
బ్రహ్మోరుసంభవప్రఖ్యాతవైశ్యుల కురుకీర్తి నిజవంశపరిణయంబు
బలిమి నన్యులకన్యకలఁ దెచ్చి పెండ్లాడ శాస్త్రంబు దలఁపఁ బైశాచవృత్తి
తే. ధర్మశాస్త్రక్రమంబునఁ దత్త్వ మెఱిఁగి, యైహికాముష్మికఫలంబు లతులశక్తిఁ
గలఁగకుండుట ధారిణీశులకుఁ దగవు, వైశ్యులకు రాజవంశవివాహ మేల. 198

వ. అని పలికి మఱియు నిట్లనియె. 199

సీ. అమరుల భక్షింప నంబుధిఁ బుట్టిన కాలకూటము నీలకంఠుఁ డడఁచె
వననదీతరుశైలవారాశిజంతుసంయుతమహీస్థలి భోగిపతి ధరించె
శౌరి తా మత్స్యావతారాదిబహువిధజననంబు లొంది రాక్షసుల నడఁచెఁ
జంద్రార్కమరుదగ్ని జలధరంబులచేత రాజిల్లు లోకసంరక్షణంబు
తే. నట్టిదేవాంశసంభవుఁ డనఘమూర్తి, పాండవాన్వయుఁ డిటువంటిపనిఁ దలంచి
కరుణ దప్పుచు వర్ణసంకరము సేయఁ, దలఁచుచుండఁగఁ గా దనవలదె మీకు. 200

వ. అనిన విని కుమారకంఠీరవుండను ప్రధాని యిట్లనియె. 201

క. నాలుగుజాతులకన్యల, నోలి వివాహంబుగాఁగ నుచితంబై భూ
పాలునకు వర్ణసంకర, మాలిన్యము లేదు శాస్త్రమార్గములందున్. 202

క. పరకామినీసహోదర, బిరుదాంకితుఁ డన్యసతులఁ బేర్కొనఁ డెపుడున్
పరమితి కన్యక గావునఁ, బరిణయమున కిచ్చగించెఁ బాపము గలదే. 203

వ. అనుమాటలకు వారల నందఱ నివారించి వసిష్ఠగోత్రుం డగుకేశవాఖ్యుం డిట్లనియె.

ఉ. రాజకులైకభూషణుఁడు రమ్యచరిత్రుఁడు విష్ణువర్ధనుం
డీజగమెల్ల గెల్చి ధరణీపతు లిచ్చినరాజకన్యలం
దేజముతోడ గైకొనుట ధీరగుణం బటుగాకయున్న దు
ర్వ్యాజము వైశ్యకన్యకవివాహ మనర్హము శాస్త్రవేదికిన్. 205

ఉ. శ్రీగలరాజపుత్రులకుఁ జిత్తమువచ్చినచో వివాహమై
భోగపరాయణత్వమునఁ బొల్పు వహించుట రాజనీతి వే
దాగమశాస్త్రవేత్తల కనర్హము రాజున కీయఁ గన్యకన్
భోగినియౌఁ దదీయు లగుపుత్రులు రాజ్యముసేయఁ గర్తలే. 206

వ. అనిన జయధ్వజుం డనుమంత్రి యిట్లనియె. 207

క. మీకులకన్యకుఁ బుట్టిన, యాకొమరుఁడు నిఖిలభూతలాధీశుం డై
కైకొనియెడుఁ బితృసంపద, మీకును సందేహ మేల మీఱె తదాప్తుల్. 208

వ. అనినఁ గరణకులగోత్రుం డగుగౌతమాఖ్యుం డిట్లనియె. 209

క. శంతనువివాహమునకును, గాంతామణి నీయకున్నఁ గాంగేయుఁడు ని
శ్చింత నిజోద్వాహమ్ము ని,తాంతమతి న్విడుతు రాజ్యతంత్రం బనియెన్. 210

గీ. ఇట్టి కథలుండ మా కేటి కింతపనులు, వలదు నృపకన్య లుండంగ వైశ్యకన్య
స్వర్ణరత్నవిభూషణోదీర్ణ లయిన, శుద్ధచరితుల కిత్తడిసొమ్ము లేల. 211

క. తలిదండ్రులు చింతిల్లఁగ, గులకన్యక లుండ నన్యకులకన్యకలన్
చలమున వరియించినపతి, వెలయునె యిటువంటిభ్రమలు విడువఁగవలయున్. 212

వ. అనిన శుచిశ్రవుఁ డనుప్రధాని యిట్లనియె. 213

క. సంతతధార్మికుఁ డగుదుష్యంతుఁడు శశివంశమందు జన్మించి వన
ప్రాంతమున నున్నయట్టిశ,కుంతలఁ గణ్వఋషిపుత్రిఁ గోరి వరించెన్. 214

గీ. అగ్రకులమున జన్మించి యధికులైన, భూసురోత్తమకన్యలఁ బుచ్చుకొనుట
నీతి నృపులకు మూఁడవజాతి యయ్యె, మీకుమారికఁ గైకొంట మేలుగాదె. 215

చ. అన విని విష్ణువర్ధననృపాగ్రణి వైశ్యులఁ జూచి పల్కె మీ
రనుపమధర్మమార్గచరు లాడినమాటలు బొంకఁ జెల్లునే
వనజదళాక్షి నిందుముఖి వాసవకన్యక నిత్తు మంచు మ
మ్మని పెదునాఁడు నేఁ డనృతమాడినఁ గోమలి నీక తీఱునే. 216

వ. అనిన విని. 217

క. సాఖీలగోత్రవంశజుఁ, డాఖీలవిరోధరోషణాకృతి బలికెన్
నీభూమి నున్నసకల, క్షోభం బగుఁ బెండ్లిగలుగఁ గులములు గలవే. 218

వ. అనిన రా జిట్లనియె. 219

గీ. మల్లిసెట్టి మామ మఱియేల కోపింపఁ, జంద్రవంశజుండ సాంద్రయశుఁడ
మీరు వైశ్యవిభులు మీకన్యఁ బెండ్లిగాఁ, దగును మాకు శాస్త్రధర్మ మగును. 220

వ. అనిన వైశ్యులలో నొక్కరుండు. 221

చ. చతురత నెంచుపాఖ్యకులచంద్రముఁ డిట్లను గీర్తిసెట్టి నీ
వితరులభంగి ధర్మగుణహీనత నేటికి మమ్ముఁ బల్కు నూ
ర్జితయశము న్నయంబుఁ గులశీలములుం దిగ నాడి మేముభూ
పతికిని బాస నిచ్చిన సభాసదులందఱు మమ్ము నవ్వరే. 222

గీ. అనిన విజయసింహుఁ డను వణిగ్వరుతోడ, నూరకిట్లుపలుక నుచితమగునె
ధర్మగుణము విడిచి ధరణీశుఁ డాడిన, మాట యెద్ది యనుచు మండిపడియె. 223

వ. తదనంతరంబ. 224

చ. కొసరక మంత్రి కైనగులగోత్రజుఁ డిట్లను భూరిసెట్టి యీ
వసుమతిలోపలం బ్రజలవంక నధర్మము పుట్టె నేనియుఁన్
వసుమతి నాయకుం డెఱిఁగి వారలకుం దగుశిక్ష సేయు నా
యసము త్యజించి నిందలకు నాలయమై యిటు సేయఁ బాడియే. 225

వ. అనిన మంత్రివరుం డిట్లనియె. 226

గీ. ధరణిఁ బూర్వనృపులు తమకంటెఁ దక్కువౌ, కులమునందుఁ బాపఁ గొన్నవార
లెందఱైనఁ గలుగ లెఱుఁగుదు మిందుకై, యిందువంశపతికి నేటి నింద. 227

వ. అనుటయు. 228

క. మెండులగోత్రభవుం డు, ద్దండత సాకపిలసెట్టి తా నిట్లనియెన్
మండలనాథునిఁ గామ్యాం, ధుం డనఁగా మెలఁగుమంత్రి మాఱం దగదే. 229

వ. అనినఁ గోపాటోపంబున మంత్రి యిట్లనియె. 230

క. ఒడ లెఱుఁగ కన్యభామను, గడుసరి యై పట్టువాఁడు కామాంధుఁడు గా
కొడఁబఱిచి పెండ్లియాడెడు, కడుఁబుణ్యుఁడు రాజవరుఁడు కామాంధుండే. 231

వ. అనిన విని. 232

చ. కులవినుతుండు గంధశిలగోత్రజుఁ డిట్లను లోకిసెట్టిలో
కులు దెగడ న్నృపాలునకుఁ గోమలి నిచ్చితిమేని యొప్పదుం

గులసతి గాదు రాజునకుఁ గోమటికన్నియ భోగకాంత యీ
చెలువ యనంగ నేము విన సిగ్గగుఁ జావఁగఁ జాల మేటికిన్. 233

వ. అనినవిని సుబుద్ధి యనుమంత్రి యిట్లనియె. 234

గీ. హీనజాతివాని కెఱుఁగక యిచ్చిన, సిగ్గుగాక మీరు క్షితిపతికిని
నధికవంశజునకు నాత్మజ నిచ్చిన, వన్నెగాదె మీకు వైశ్యులార. 235

వ. అనుటయు. 236

క. బలిశిష్టగోత్రజాతుఁడు, బలియుం డగుకసిలిసెట్టి పలికెను విను మా
కులమున కెక్కువ తక్కువ, కులమునఁ గీడేమి వన్నె గూడదు మాకున్. 237

క. కూడ దననేల యడుగుఁడు, మాడలుఁ దురగములు కరులు మాణిక్యములున్
వేడుక నిచ్చెద మే మని, యాడంగాఁ దగదు మీకు నధిపతియెదుటన్. 238

వ. అనిన మఱియు నొక్కరుండు. 239

క. సూర్యకులగోత్రసంభవుఁ, డార్యులు విన దుర్గిసెట్టి యను డిట్లనియెన్
మర్యాద దప్పి యుండుట, లర్యాంగన కిత్తు మనుట యర్హమె మీకున్. 240

వ. అనిన విజయసింహుం డిట్లనియె. 241

క. ఉంకువ లొల్లరు రాజని, శంకింపరు మనములోన జననాయకుఁ డీ
వంకరకొంకరమాటలఁ, బంకజముఖి విడువఁ డెన్నిభంగుల నైనన్. 242

వ. అనిన విని. 243

క. తుప్పాలగోత్రసంభవుఁ, డప్పుడు నృపమంత్రితోడ నమృతాఖ్యుఁ డనున్
దప్పక మామేనత్తకమొ, యిప్పుడు మాకన్యఁ బతికి నిమ్మనుటెల్లన్. 244

వ. అనినమాటకు విక్రమసేనుం డనుప్రధాని యిట్లనియె. 245

క. రాజునకుఁ గన్య నిచ్చినఁ, దేజం బెవ్వరికిఁ గలదొ తెలియదు మదిలో
రాజనుమాత్రమె ధరవి, భ్రాజిష్ణుండతని కిడుట భాగ్యము గాదే. 246

వ. అనిన విని. 247

గీ. కనలి చన్నట్లగోత్రుండు గౌరిశెట్టి, పలికె మాకన్య మానవపతికి నీఁగ
లట్టిసౌభాగ్య మాతేజ మదియె లెస్స, హరికి సారంగి నిచ్చినయట్ల కాదె. 248

వ. అనిన నప్పలుకులకు మంత్రు లిట్లనిరి. 249

క. అటువంటిమాట లేటికి, నిటలాక్షుఁడు సాక్షిగాఁగ నిజముగఁ గన్యన్
బటుభక్తిఁ దనకుఁ బట్టుపుఁ, గుటిలాలకఁ గాఁగ మెలఁపుఁ గోర్కులు దీర్పన్.

వ. అనినఁ గోపంబున. 251

క. పుచ్చకులగోత్రధీరుఁడు, సచ్చరితుఁడు గోపిసెట్టి సచివున కనియెన్
మచ్చరమున నిటుతగునా, రచ్చలకెక్కించి మమ్ము రాయిడి సేయన్. 252

వ. అనిన సుబుద్ధి యనుమంత్రి యిట్లనియె. 253

గీ. జనవరేణ్యునకును సన్నకసన్నగాఁ, గన్నె నొసఁగు మనినఁ గాదటంచు
వచ్చి మీకు మీర రచ్చకు నెక్కితి, రింత యెఱిఁగి మమ్ము నేల దూఱ. 254

వ. అనిన విని. 255

గీ. పడిగెలగోత్రరత్నంబు పాపిసెట్టి, యాయమాత్యునిమాటల కాగ్రహించి
పలికె రఘురామచంద్రునిభార్యఁ జూచి, కాముకుం డైన రావణుఁ డేమి కుడిచె.

వ. అనిన రోషించి విజయుం డిట్లనియె. 257

ఉ. మానవభోజనుం డధికమత్సరుఁ డై నృపు డాఁగురించి త
న్మానినిఁ గొంచుఁ బోవు టది మానృపుచర్యకు సాటిచేసెదే
మానిని మృచ్ఛిలించెనె క్రమంబున మానృపుఁ డివ్వసుంధరన్
గానక యిట్టు లాడ నగుఁ గావనరే వినువార లిమ్మహిన్. 258

వ. అనుటయు. 259

గీ. బుధురకులగోత్రుఁ డిట్లను భోగిసెట్టి, మంత్రి వైయుండి గెలువనిమాటలేల
వావి దప్పి వరించినవనజభవుఁడు, శిరము గోల్పోవు టెఱుఁగవే శివునిచేత. 260

వ. అనిన మంత్రివరుం డిట్లనియె. 261

క. పరమేష్ఠి వావి దప్పిన, హరుఁ డధికుఁడు గాన నణఁచె నది తథ్య మగున్
ధరలోన మీరెఱుంగఁగ, ధరణీతలభర్త వావిదప్పెనె చెపుడా. 262

వ. అనుటయు. 263

గీ. వినుకులశ్రేష్ఠగోత్రుండు వీరిసెట్టి, వినిమహారోషమున మంత్రివిభుని కనియె
గౌతమాంగనఁ గోరి యాఖండలుండు, చెడ్డచేటు మహీస్థలిఁ జెప్పవినవె. 265

వ. అనిన మంత్రిముఖ్యుం డిట్లనియె.

క. పరకాంత బలిమిఁ జెఱచిన, పురుహూతుఁడు చెడియెఁ గాక పురుషాధమ యే
పరకాంతను గోరెను మా,నరపతి యన్యాయపరుఁడె నాకుం జెపుమా. 266

వ. అనిన నవ్వైశ్యులందఱుం గలసి యిట్లనిరి. 267

చ. అనఘుఁడు రాజచంద్రుఁడు మహాత్ముఁడు సంతతికాంక్షనైనఁ బా
వననిజవంశకన్యను వివాహము గాఁదగు భోగకాంక్షకై
నను జగమెల్ల గెల్చి నరనాథుల కన్యలఁ దెచ్చినాఁడు నె
మ్మనమున కిచ్చయైనఁ బ్రియమానినుల న్వరియింపఁగాఁ దగున్. 268

సీ. అనినమాటకుఁ బ్రధానాగ్రగణ్యుం డైన విజయసింహుం డిట్లు వెలయఁ బలికె
మహనీయకౌస్తుభమాణిక్య మబ్బిన నన్యరత్నమునకు నాస యగునె
యతిమనోహర మగునమృత మబ్బినచోట దీర్ఘికాజలములఁ దుష్టియగునె
కామధేను వ దింటఁ గలిగినపిమ్మట మహిషదుగ్ధము మీఁద మనసు గలదె

తే. కన్యకామణి వాసవకన్యయందుఁ, గాంక్షచేసిననృపుఁ డన్యకాంతలందుఁ
దలఁపుచేయఁడు చలమున బలిమి నైన, నబలఁ గైకొను లోకవిఖ్యాతిగాఁగ. 269

చ. అన విని విష్ణువర్ధననృపాగ్రణి యుగ్రకృశానుతుల్యుఁ డై
మనమునఁ గొంకు లేక వెడమాటలు పల్కుచు నుచ్చరింపఁగా
వినుచును సమ్మతించెదరు వీరల పే చెఱఁ బెట్టి గ్రామముల్
గొనకొని కాల్చి కన్నియను గొబ్బునఁ దెం డొగిఁ బొండు వేగమే. 270

వ. అన విని. 271

సీ. పాంచాలగోత్రాబ్ధిబంధురసోముండు నరపతి కిట్లను నాగిసెట్టి
పూర్వాద్రిపర్యంతభూపాలు రిచ్చిన యబ్జాక్షు లొకనూఱునైదుపదులు
నున్నత్తు లైనట్టియుత్తరాధీశ్వరు లిచ్చినచంద్రాస్య లేడుపదులు
పశ్చిమదక్షిణపతు లొప్పగించిన నారీమణులు వేడ్క నాల్గువేలు
తే. నిట్టిపూఁబోండ్లకంటెను నధికమైన, చక్కఁదన మెక్కుడిది కన్యఁ జనదు గోర
మనుజనాయక మంత్రులమాట వినకు, క్షోణిజనమిత్ర పాండవకులపవిత్ర. 272

వ. అనిన రా జిట్లనియె. 273

క. రాజు లొసంగినకన్యలు, తేజోధిక లైన వారి తెఱఁ గేనొల్లన్
నాజీవము మీకన్యక, నేఁ జూచినఁగాని నిలువనేరదు మామా. 274

క. చక్కని మెఱుపులఁ గలపుచు, నొక్కటఁ గ్రోలినటుఁ బోసియుంచినరీతిన్
నిక్కము జేసె విరించియుఁ, దక్కినసతులెల్లఁ గన్యతరముగుసతులే. 275

వ. అనిన విని. 276

సీ. చేగొట్లగోత్రాబ్ధిశేఖరుండైనట్టికొండి సెట్టిట్లనుఁ గోర్కెతోడ
ముఖము చంద్రుం డని మోహాన భ్రమసిన శ్లేష్మాంబురాశిచూ చెప్పనేల
పిఱుఁదుచక్కన యని ప్రేమ మోహించిన మూత్రపురీషాలమొదలినెలవు
స్తనము లందము లని సతుల మోహించిన మాంసఖండముగాదె మనుజనాథ
తే. కాన నింతులపై నతికాంక్ష లేల, రాజఋషులు మీపెద్దలు రాజవర్య
వారివర్తన వెలయుము వాదులేల, నవ్యగుణగణ్య జననుతనరవరేణ్య. 277

వ. అనిన రాజీ ట్లనియె. 278

క. యోగము మామలు చెప్పిన, బాగుగ నేనెఱిఁగి భామఁ బాసెద నన్నన్
వేగెడుఁ జిత్తము మఱియు సు, యోగమె కోరెడును చిత్త ముండదు నియతిన్.

వ. అనుటయు. 280

సీ. శ్రీలయుంతనకుల శ్రీహనుమంతన్న యొద్దుఁగనే నొయ్యన బెదరు లేక
చక్రవర్తుల మించి చవు లైనరాజ్యంబు గలిగి దిగ్విజయంబు ఘనతఁ జేసి

యీభూమి పాలించి యింద్రుని నటుమించి భోగించి దిక్కులఁ బూజ వడసి
కోమటికన్యకఁ గోరుట ధర్మమా మాకులక్షోభకా మనుజనాథ
తే. కోనలుసాగనికోర్కులు కోరి లేని, మోహవారాశిఁ బడి నీవు మునుఁగ నేల
కాంతమీఁదిమనసు మృత్యుకారణంబు, కాన వలనంటి మిది పగగాదు దేవ. 281

వ. అనిన రాజిట్లనియె. 282

క. కాంతను సీయకయుండినఁ, గంతునిచేఁ బ్రదుకఁ గాని కాలునితోడన్
ఎంతే బలవంతుఁడ నై, పంతంబునఁ బోరి గెల్తు బాహాస్ఫురణన్. 283

వ. అనుటయు. 284

సీ. పడగశిల్గోత్రుండు భానుసమానుండు పలికె ధర్మము పుట్ట బాలిసెట్టి
దేవ రెండవజాతితేజోధికుండవు దిక్కులు గెల్చినధీరమతివి
త్రైవర్ణికుల మేము ధనదాంశభవుల మ దింతకాలము ధర్మ మిట్లు నడచె
నిప్పుడు నీవేల యీరెండుజాతులు సంకరంబులు గాఁగ సమయఁ జేయ
తే. వలదు నృపవంశవర్య యీవనితఁ బెండ్లి, యగుట యిదిధర్మవర్తన మగునె చెపుమ
చెప్పితిమి నేర్చునట్లుగాఁ జిత్తగింపు, మనుచు మ్రొక్కిన నిట్లను నవనివిభుఁడు.

క. వలదని మీరలుచెప్పినఁ, జలమున నేఁ బెండ్లియైన సంకర మాటం
దెలియఁగఁ జెప్పితి రందఱుఁ, గలఁచిన మన్మథునిఁ బట్టి కా దనలేరే. 286

వ. అనుటయు. 287

సీ. గంధసిల్గోత్రుండు సింధుగంభీరుండు లోకేశుతో నను లోకిసెట్టి
గడియూధముల నాజి గడఁగొని ధరఁ గూల వేయు నాశౌర్యంబు వెరసి లేదు
వింట నాయుధముల వీరులఁ జెండెడి బంటుతనము లేదు బవరమందు
ఉప్పుగుడా లమ్మి యూరిలోఁ దిరిగెడు బుద్ధి కోమటికన్యపుత్రు లనఁగఁ
తే. గలిగి యందును క్షాత్త్రంబు గలుగ దెందు, దేవ యీకన్యఁ బెండ్లిగాఁ దివిరి చేల
ధరణిఁ బాలింపఁ జాలినతనయుఁ గాంచు, సూర్యవంశజఁ గైకొమ్ము సుజనవినుత.

వ. అనుచుండ మఱియు నొక్కండు. 289

క. పట్టపుదేవికిఁ బుత్త్రిలు, పుట్టిరనుచుఁ గన్య నడుగ భువి యేలంగా
నెట్టన వీరు లనేకులు, గట్టిగఁ గులసతులు గలరు కడఁగుము రాజా. 290

సీ. వెనకులగోత్రుండు సన్నుతాచారుండు పలికె నారాజుతో భద్రిసెట్టి
మీతాత భీష్ముండు మించి రాజులగెల్చి కన్యల మూవుర ఘనతఁ దెచ్చి
తమ్ములకును బెండ్లిఁ దాఁ జేయవచ్చిన నందులో నొకపాప యన్నమాట
నేనొక్కరాజున కిల్లాల నని పూని బాస పొందొనరించి పలికె నపుడు
తే. మగువ నొల్లక యారాజు మరల ననిపె, నట్టిరాజాన్వయుండవ యధిప నీవు
అరయ నరిసెట్టిగోత్రున కాదియందు, నిర్ణయించినపరకాంత నీకు వలదు. 291

వ. అనిన రా జిట్లనియె. 292

క. పెనుగొండకు నేవచ్చుట, ఘనముగ మీకన్య నడుగఁగా నిమ్మనుడున్
మనమున మోహము పుట్టెను, వినుఁ డిఁక మీనేర్పు లేల వెలదుఁక నిండీ. 293

వ. అనుటయు. 294

సీ. వేకులగోత్రుండు విమలచారిత్రుండు వీరిసెట్టియు జనవిభున కనియె
ద్రుపదభూపాలుండు ధూర్జటివరమునఁ గన్యకారత్నంబు గాంచి యంత
మత్స్యయంత్రముఁ బన్ని మహిరాజలోకంబు రప్పింప నర్జునుం డొప్ప మిగిలి
లక్ష్యంబు నేసియు లలనఁ గైకొని వచ్చె భుజశక్తియుక్తిని భూమిపాల
తే. వరులు బెగడొంద వసుధలో వాసి కెక్కె, నట్లు చేసిన సత్కీర్తి యలరుఁగాక
వైశ్యసతిఁ బెండ్లియైనను వసుమతీశ, ధారిణీశులు నవ్వరే ధరణియందు. 295

వ. అనిన విని రా జిట్లనియె. 296

క. ఎక్కడిరాజులు నవ్వినఁ, జెక్కాడుదు వారిఁబట్టి సెలవులు గోతున్
నిక్కము మీ కిటు వెఱచెదఁ, దక్కిన నన్నెదురువారు ధరణిం గలరే. 297

క. ఇందఱు వలదని చెప్పిన, సుందరి నిఁక మాన లేను సుడియక దయతో
డం దగ నిచ్చిన బ్రదికెద, నందఱుఁ గాదనకుఁ డయ్య యార్యకులారా. 298

వ. అనిన. 299

సీ. తెఱఁగొప్ప ననియెవివిరిసెట్లగోత్రుండు కన్న సెట్టియు రాజుఁ గాంచి యపుడు
దేవర యీకన్య దేవిఁగాఁ గైకొన్న రెండుకొలా ల్లెస్సయుండు ననుచు
శకునంబుఁ జూచిన జయ్యనఁ బక్షులు దావాగ్నిపొదలలోఁ దరియఁ జొచ్చెఁ
బట్టుఁ గొమ్మయు లేదు ఫలసిద్ధి కాదిది వలదండ్రు పెద్దలు వసుమతీశ
తే. అట్లు గావున నీకన్నె నట్టె మాని,యుండుటయ లెస్స యీకార్య మొప్పదయ్యె
జెప్పితిమి మీకు మేలగుఁ జిత్తగింపు, మందిపని గాదు నీపెండ్లి మాను మధిప. 300

వ. అనుటయు రా జిట్లనియె. 301

క. శపథము శకునము చెప్పఁగ, నుపశ్రుతి సాముద్రికంబు నుర్వి నివియుఁ దా
ముపమింపఁ గాక మానును, నెపములు సంధింప నేల నేర్పరు లగుచున్. 302

వ. అనిన. 303

సీ. చందనకులభవ్యసాగరచంద్రుండు పాపిసెట్టియు రాజుఁ బలికె నిట్లు
మహదుగ్రకరులచే మడమున నెదిరిన తూర్పురాజుల నెల్లఁ దూలఁ జేసి
యురుతరాటోపులై యుత్తరం బేలెడి రాజలోకము నెల్లఁ దేజ మడఁచి
యశ్వఖురోద్ధూళి నరుగని నడఁగించు పడమరరాజుల భంగపఱిచి
తే. దక్షిణం బేలునరనాథతనయు లెపుడు, నీపదంబులు సేవించి నిలుచునట్టుల
దిగ్విజయములు సేసొన్న ధీరమతివి, వైశ్యకులకన్య నీకేల వసుధతీశ. 304

వ. అనినఁ గోపోద్దీపితమానసుం డై రా జిట్లనియె. 305

చ. వదరుచు బి ట్టదల్చుచు నవార్యవిరోధముతోడ వైశ్యులం
బెదరఁగనీక మంత్రిగణశేఖరుఁ డైనసుమంత వీరలన్
జెదరఁగనీక సంకెలలఁ బెట్టుఁడు పట్నము చూఱఁబెట్టి యా
సుపతిని బట్టి తెమ్మనిన స్రుక్కి సుమంతుఁడు రాజుఁ బల్కెడున్. 306

చ. వలదు నృపాలచంద్ర వరవైశ్యకులంబునఁ బెండ్లియాడఁగాఁ
దలఁచెద వీవు వీరలిటు ధర్మము గా దని మ్రొక్కి వేఁడఁగాఁ
జల మరి రాజపుత్త్రికలఁ జక్కనికాంతలఁ దెచ్చి యిచ్చెదన్
వెలఁదుల లక్ష నీవిపుడు వేడుకఁ గొమ్ము నృపాలశేఖరా. 307

వ. అనిన రా జిట్లనియె. 308

గీ. కమ్మవలచుపసిఁడికళ మించుశశిరేఖ, మెలఁగి యాడ నేర్చు మెఱుపుఁదీవ
పలుక నేర్చినట్టిపసిమిపుత్తడిబొమ్మ, కన్యఁ జూచి మనసు కరఁగె నాకు. 309

ఉ. బాలికఁ జూచినంతటనె భావజుచేఁ బ్రసవాస్త్రపంక్తులం
జాలఁ గలంగె నామనసు సైరణ దప్పి మనోజవహ్నిచేఁ
గ్రాలఁగ మాన్ప మీవశమె కన్య వరించుట మానుమంటి వీ
వేల సుమంత కాఱడవి నేర్చుదవాగ్నులు చేత నారునే. 310

వ. అనిన శాంతనుం డనుమంత్రిశేఖరుం డిట్లనియె. 311

సీ. ప్రకటతేజోరూపభాస్కరసత్కీర్తి నిఖిలలోకములందు నిండె నీకు
మదదంతిఘోటకమంత్రిసామంతుల సందడి నీమొగసాలఁ గలదు
మహితమౌక్తిక హేమమాణిక్యనీలంబు లలరు నీభండారమందు నెపుడు
సురయక్షఖేచరసుదతుల కైనవన్నె వనితలు నినుఁ గొల్చువారసతులు
తే. కానఁ గోమటికన్యక ఘనత గాదు, చక్రవర్తులు రాజులు చనరె మున్ను
వారికాలంబునను రూపవతులు లేరె, వీరి వెలఁదుక నడిగినవారు గలరె. 312

వ. అనిన రా జిట్లనియె. 313

శా. నీ వీబాలిక మానుమంచుఁ దగునే నిర్బంధముం జేయఁగా
భావం బొక్కటఁ జాల నొచ్చె మరుచేఁ బడ్డటినాప్రాణముల్
కావం జాలరు మంత్రులెవ్వరు దయం గంజాక్షి నెట్లైన నా
జీవింగా నొనఁగూర్పు శాంతనుఁడ నీధీరత్వ మేపారఁగన్. 314

అనిన మంత్రిశేఖరుం డిట్లనియె. 315

క. భుజబలము శౌర్యక్షత్త్రియ, విజయంబున నిపుడ తెత్తు వేగమె యింతిన్
భుజనగుణపాలి ననుమ్మత, విజయుఁడ వగునీవు వైశ్యవెలఁదుక ముఖా... 316

వ. అనిన రాజిట్లనియె. 317

మ. సుదతీరత్నము నామనంబు వెసఁ దా జూడాడెఁ బైనుండి యా
మదనుం డేయఁగఁ జొచ్చెఁ బుష్పశరముల్ మర్మంబు భేదిల్లఁగా
ముదితం డెం డిటు మంత్రివర్యులకు నామోదంబు మీకొప్పదే
చెదరెం జిత్తము వాసవాంగనకు నై చేకూరదా చెప్పుడా. 318

వ. అన నతులశాంతుఁ డనుమంత్రి యిట్లనియె. 319

చ. వినుము నరేంద్రచంద్ర పటువిక్రమశాలివి సత్యశౌచస
జ్జనగుణధర్మమార్గమున సన్నుతి కెక్కినరాజ వింకనీ
తనయుని రాజ్యభార మిడి తామరసాక్షుల నెంచ ఘనియుం
గొనకొను కామసౌఖ్యములఁ గోమటికన్యకఁ గోర నేటికిన్. 320

క. పరకులమువనితలెల్లను, బరకాంతలు వారియందుఁ బడసినసుతులున్
నరకంబునఁ ద్రోతురు మఱి, ధరణి భరింపంగఁ బగరు తత్కులహీనుల్. 321

క. దేవా భోగస్త్రీ యని, భావించియు దీని నీవు బలిమి వరింపం
గా వసుధాధిప తప్పిరి, యీవైశ్యకులంబుఁ జెఱుప నేటికి మీకున్. 322

వ. అని నలువురుమంత్రులు ధర్మంబు గా బనిన విని రాజిట్లనియె. 323

చ. ఇటుమును పెల్ల సీయబలనిత్తురు పొమ్మనికోర్కులుండ నేఁ
డిటుఁదగవైశ్యకోవిదులు నీమనిచెప్పినరోష మెత్తిసీ
నటమటకాండ్రగోమటుల నందఱనుంజెఱసాలబెట్టి మీ
రటుచపికన్యఁదెమ్మనిన నాలస మొందుట మంత్రిధర్మమే. 324

వ. అని యిట్లు పలుకుసమయంబున సేనాధీశ్వరుం డగుసింహసేనుం డిట్లనియె. 325

సీ. తొడరి దిగ్గజములతొండము ల్చేఁబట్టి పడఁద్రోతు నే బాహుబలము మెఱసి
కాలాహివిషములఁ గ్రక్కించి స్రుక్కించి కోఱలు విఱుతు నేఁ గొదవ లేక
చెనసి మృత్యువుజిహ్వ చీరి మాసంబులు పెఱుకుదు నే యుగ్రభీమగతిని
లయకాలరుద్రులలాటాగ్ని నఱచేత నణఁతు నే దిక్చక్ర మవలఁ గదియ
తే. నిట్టిజగజెట్టి నే నుండ నేమి కొఱఁత, దేవర తలంపు గూడంగఁ దీవ్రగతిని
బట్టి తెచ్చెదఁ గన్యతోఁ బణ్యజనుల, నవధరింపుము విన్నపం బవనినాథ. 326

క. పతిహిత మొనరించినయా, పతికి నిహముఁ బరముఁ గల్గుఁ బరమాయువు సూ
గ్జితముగఁ గల్గును ధరలోఁ, బతిహితుఁ డగుమంత్రి కొప్ప బరహితచరితా. 327

వ. అని యిట్లుపలుకుసమయంబున విష్ణువర్ధనుని బుజంబులు తలకడచె వైశ్యులు
చింతాక్రాంతులై యొండొరులం జూచి యాదాసి దమ్మఁడు వీచు నెఱపెడి
పీఁచు కట్టుగా వినిపింపు మని పురోహితుల నియమించిన వారువారు ప్రయో

గించినట్లు మంత్రులు సమ్మతించిరి. అనంతరంబు సింహసేనుండు రాజున కిట్లనియె. దేవా యీవైశ్యులపాలికి విప్రుల నంపించి తెలియఁజెప్పి చూత మనిన రాజి ట్లనియె. 328

క. పరివారింబును మంత్రులుఁ, గర మరుదుగ నిపుడు గూడి కన్యక నా కే
వెరవునఁ దెచ్చిన మీకును, ధరణి న్నగమేల నిత్తు ధర్మము దప్పక్. 329

వ. అనిన విని సింహసేనుం డూరకున్న నరనాయకుం డందఱు వైశ్యులచేలాంచంబులు గొనుట యెఱింగి కోపోద్దీపితమానసుండై మంత్రుల కిట్లనియె. 330

క. స్వామిద్రోహము లగునే, యేమియుఁ గపటంబు లేక యిప్పటి కైనన్
నామనము నష్టి యుండక, పామరగుణులార యిట్టి పాపము గలదే. 331

వ. అని. 3.2

చ. ఘనతరరోషి యై నృపతి కర్ణకఠోరము వల్క వైశ్యులున్
విని తమలోన నందఱు వివేకము దూలి ముఖాలు నల్ల నై
మనమున భీతి నొంది యసమానునిపాదయుగంబు పైఁ బడన్
జనవిభుఁ డగ్నిలోన నెయిచల్లిన కైవడి మండి యిట్లనున్. 333

మహాస్రగ్ధర. ఘనకోపాటోపదీవ్యత్క్రమిన పటులుఠత్కాలనేత్రాగ్నిబింబం
బన లోకప్రస్ఫులింగప్రచురనిజసభాభ్యుత్థయత్క్షోభకుం డై
వనజాక్షిం బట్టి తెం డవణిగ్ధముల నవ్వారి దుర్భాష లాడన్
వినియొప్ప న్సమ్మతింతుర్ వెఱచఱవజనుల్ వీండ్రఁ బట్టింతునంచున్. 334

వ. తలంచి. 335

క. సంకెలలఁ బెట్టుఁ డింపఱఁ, బంకజముఖిఁ బట్టితెండు పట్టనముల ని
శ్శంకం గాల్చుఁడు పొం డని, జంకించుచు నుగ్ర మెసఁగఁ జారులఁ బలికెన్.

వ. ఇట్లు పలికి కోపోద్దీపితమానసుం డై లేచి ముందఱ నిలిచిన వైశ్యులంద ఱు భయ పడి యేకవాక్యముగా ని ట్లనిరి. 337

క. గోకర్ణజనుల మెవ్వరు, మా కపకారంబు చేసి మఱి బ్రదుకరుగా
నీ కీకోపం బేటికి, నీకోపము నేటికార్య మిది యె ట్లనుచున్. 338

సీ. పట్టణశ్రేణుల భస్మంబుగాఁ జేసి స్త్రీసమూహంబులఁ జెఱలఁ బెట్టి
మమ్మునందఱఁ జంపి మహిమతో మిగ్రింగిన నెంత చేసినఁ గన్య నీకుమీకు
మాకుఁ బ్రాణము తృణమాత్ర మై తోఁచును:నీకైన నపకీర్తి నిలుచు జగతి
మానధనమె చాలు మా కింకఁ బ్రాణంబు ధనములు నీసొమ్ము మనుజనాథ
తే. తగవు ధర్మంబుఁ దప్పక దయదలంపు, ధరణిఁ బ్రజలకు రాజులు తల్లిదండ్రు
లండ్రు సభ్యులు వైశ్యుల యమితగుణుల, మొఖరి యెరువునఁ బో నొల్లమింత యేల.

వ. అని వెఱవక నిష్ఠురోక్తు లాడిన వైశ్యజనంబులఁ జూచి నరపాలుఁడు ప్రధానుల దెస నవలోకించి యీవైశ్యుల శృంఖలల బంధించి దండువెడలి పురంబులు గాల్చి యందఱను జెఱపట్టి తెండనిన నాసమయంబునఁ దత్సభాస్థలం బెంతయుఁ గలకలం బయ్యె నంత విజయసింహుం డందఱువైశ్యుల వేఱుగాఁ గొనిపోయి యుండె నంత దళంబుల నియోగించి రాజు నిజాంతఃపురంబునకుం జనియె నాసమయంబున దళంబులఁ గొంతతడవు నిలువరించి మంత్రివర్యుండు వైశ్యుల బహుప్రకారంబుల ననునయించి కన్యక నిచ్చుట మే లని చెప్పుటయు నయ్యవసరంబున మంత్రిజనులకుఁ దత్కాలోచితంబులు ధనపూర్వకమనస్సమాధానంబులఁ జెప్పి యీకార్యం బీవేళఁ జక్కంజేయుం డనిన విజయసింహుండు రాజాంతఃపురంబుఁ బ్రవేశించి రాజునకు శాంతం బగునట్లుగా నిట్లని విన్నవించె. 340

క. వీరేటికిఁ జెఱఁ జిక్కఁగ, ధీరతఁ బ్రజచేతఁ గన్యఁ దేరం బనుతుర్
వీరలు కన్యకుఁ గర్తలు, భారకు లగువైశ్యజనులు బహుళం బచటన్. 341

గీ. అంచుఁ బలికి నృపతి యాజ్ఞావశంబున, వలయు దళము గూర్చి వైశ్యవరులఁ
బంపఁ గదలి వచ్చి బహుభంగిఁ బెనుగొండ, పురము సొచ్చి రంత బుధులు మెచ్చ.

వ. వచ్చినవైశ్యజనంబుల ముఖావలోకనమాత్రంబున నచ్చటికార్యభంగులు నిశ్చయించి శ్రీనగరేశ్వరముఖమండపంబున నున్న వైశ్యజనంబులు తద్వృత్తాంతం బంతయుఁ దెలిసికొనివచ్చిన సేనానాయకుల వివిధోపచారంబుల ననునయించి వారలకు నివాసంబులు గల్పించి వారకాంతాజనంబువలనఁ బ్రమత్తులఁ జేయించి సకలసేనాజనంబులఁ గపిలమల్లేశస్థానంబున విడియించిరి. మఱియు నిక్కడ నష్టాదశపట్టణ నివాసు లగునగరస్వాములకు లేఖలు వ్రాయించి తుదలు హుతాశనకల్పితంబులు చేయించి గూఢచారులచేతం బంపించిన వార లతిత్వరితగతిచేఁ గదలి లేఖలు చూపినఁ దత్క్షణంబ పుత్రమిత్రకళత్ర బాంధవసహితంబుగా నాకులధర్మంబు నుద్ధరించుటకై పెనుగొండపురంబునకు వచ్చిరి. అంత వారల మన్నించి యొక్కయేకాంతస్థలంబునకుం జని భాస్కరాచార్యుల రావించి వారలకు సమస్తకార్యంబులు విన్నవించిన వారు భవిష్యద్వర్తమానంబులకుఁ బరమేశ్వరుండు రక్షకుండు గలండు విచారంబునకుఁ బనిలేదు ముందఱికార్యంబులు కులోద్ధారణంబునకుఁ దగినకర్తవ్యంబులు చేయుఁడ మని యెఱింగించిన వారలు తత్కార్య పరులై యుండి రని సాలంకాయనముని చెప్పుటయు. 343

ఉ. భారతపర్వసన్నిభవిభాసితవైశ్యపురాణసత్కథా
సారసుధారసోన్నతరసజ్ఞులు వేదపురాణశాస్త్రభా
షారమణీయు లాశ్రితవిషాదహరుల్ మధువైరిపాదపం
కేరుహభృంగముల్ బుధసఖిత్వవిధేయులు వైశ్యు లిమ్మహిన్. 344

మాలిని. భవభయహరశంభుస్ఫారపాదాబ్జసేవా
ప్రవిమలహృదయాబ్జుల్ భవ్యవాఙ్నిర్జితాజ్ఞుల్
రవిసమఘనతేజుల్ రాజతోద్భ్రాజరాజుల్
భువనభరితకీర్తుల్ భూనుతుల్వైశ్యమూర్తుల్. 345

గద్యము. ఇది శ్రీసరస్వతీవిలాస చరణ మకరంద నిష్యందసందోహమాధురీధురీణమధు
కరాయమానమానస సరసకవితావిలాస బొల్లనార్యతనూజవర్య శ్రీభాస్కరాచార్య
ప్రణీతం బైన వైశ్యపురాణంబునందు వైశ్యులు రాజమహేంద్రవరంబునకు వచ్చు
టయు రాజసందర్శనంబును ప్రధానులకును వైశ్యులకును సంభాషణంబు నడచు
టయు సేనానాయకునియాగ్రహంబును రాజుతో వైశ్యులసంభాషణంబును రాజు
కన్యక నిమ్మని కఠినముగా నడుటయు రాజకోపంబును నప్పటికి మంత్రిమూలంబునం
గార్యంబు చక్కపఱిచికొని పెనుగొండకు వైశ్యులు వచ్చుటయు సేనాప్రయా
ణంబును నష్టాదశపట్టణవైశ్యులయాలోచనంబును నను కథలం గలది సప్తమా
శ్వాసము.

శ్రీగణేశాయ నమః.

శ్రీశారదాంబాయై నమః.

# శ్రీవైశ్యపురాణము.

## అష్టమాశ్వాసము.



శైలముఖ్యనానా
దేశమహాతీర్థభూప్రతిష్ఠితనగరా
ధీశమహేశ్వరభక్తి
శ్రీశాలులు సుప్రసిద్ధశీలుర వైశ్యుల్. 1

వ. అవధరింపుండు వైశ్యఋషులకు సాలంకాయనఋషి చెప్పందొడంగె నట్లు బాల నగరంబులకు భాస్కరాచార్యుం డిట్లనియె. 2

శా. రాజోత్తంసుఁడు విష్ణువర్ధనుఁడు సర్వక్ష్మాపసంసేవ్యుఁడై
తేజం బందుచు భూమి నేలి కదపం దివ్యాంగజోన్మాదుఁడై
సౌజన్యం బుడిగె న్వణిగ్వరులచే శాపంబునుం బొందెడి
న్వ్యాజం జేటికిఁ జూడుఁ డున్నగతి నయ్యర్కుండు గ్రుంకెం దగన్. 3

వ. తదనంతరంబ సంధ్యాద్యనుష్ఠానంబులు దీర్చి యొక్కయేకాంతస్థలంబున నష్టాదశ పట్టణ నగరస్వాములు గూడి కార్యాకార్యవివేకంబులు దలపోయుచు నిట్లనిరి. 4

సీ. కలియుగధర్మంబు క్రమము విచారింప శాస్త్రశోంగసలు గావు సరణి యిపుడు
గత మైనయన్యాయకార్యంబు మీఁదట న్యాయమై ప్రవర్తించు నంతకంత
పూర్వమర్యాద నీభూమిమీఁదఁ డెవ్వఁడే కులధర్మమార్గంబు కుఱుచ చేయు
భూదేవతాయూథములు వేడ్క దమతమ శాఖలందే కాని సతులఁ బెండ్లి
తే. యాడ నొల్ల రదెవ్వరు నర్థి మున్ను, గలియకున్న వివాహంబు కార్యమేల
సుజను లొనరింతు రెందు భూప్రజలు మెచ్చ, మనకు రాజులతోడి సంబంధమేల.

క. భూపతికోపాటోపము, పాపమునకు రోయ దెంత బలవంతుండై
పాపం దోడ్కొని రం డని, యేపారఁగ వీరభటుల్ల నిందఱఁ బనిచెన్. 6

గీ. వారి నింక నిలుప వశమేమియును గాదు, సెల్లి లగ్నవేళ కిచటఁ గదలి
వెడలవలయుఁ గాన వేగంబునను బాలఁ, దెం డటంచు వచ్చి రుండ నీక. 7

వ. త్వరచేసెడుభటసంఘంబునకుఁ బ్రియంబు సెప్పి మహారాజుతోడి ప్రయోజనంబు సామాన్యంబుగా దతిప్రయత్నంబున నాయత్తపడవలయుఁ బురంబు శృంగారింపవలయుఁ గదలుద మని వారి నొడంబఱిచితిమి. ఈరాత్రియంద సమస్తప్రయోజనంబులుం దెలియవలయు నెవ్విధంబున నైనఁ గడకుఁ దొలంగరాదు కావున నొక్కనిశ్చయంబు వలయు వినుఁ డాలస్యంబు పనిలేదు రాజుతోఁ బ్రతిఘటించి తిరుగంబడి బలంబులఁ గూర్చి యుద్ధంబుచేయ శక్తులముగాము. వేదశాస్త్రార్థపద్ధతి విచారించినఁ గులాచారంబును మానంబును బూర్వవర్తనంబును మాని కుపథంబున నడచుట మహాపాతకంబుగావున నివ్విధంబున బ్రదుకరా దని యవ్వైశ్యవిభులు నిశ్చయించి మఱియు నిట్లనిరి. 8

క. మానప్రాణంబులలో, మానం బధికం బటం్డ్రు మహితవిచారుల్
మానంబా చంద్రార్కము,మానుగఁ బ్రాణంబు తృణము మఱి తలపోయన్. 9

క. కులగోద్విజరక్షణకై, యలరంగాఁ బ్రాణ మిచ్చునతిపుణ్యునకున్
వెలయ సదాశివుఁ డొసఁగును, జెలువుగఁ గైలాసపదము సిద్ధం బనుచున్. 10

గీ. బాలనగరవరుల ప్రతినయుఁ దప్పదు, కన్యతోడమనము ఘనత మండు
నగ్ని సొచ్చి ప్రాణ మర్పింత మభవున, కనుచు నిశ్చయించి రాక్షణంబ. 11

వ. చండప్రచండవిక్రము లనునారికులఁ బిలువం బంచి నగరంబున నగరేశ్వరదేవునిం గులాభిమానంబులఁ గులాచారనిర్ణయంబు నైహికాముష్మికంబులకును నపేక్షించువార లెవ్వరుగలిగినను సపత్నీకులై యగ్నిప్రవేశంబు సేయుటకు నాయత్తపడి నగరేశ్వరదేవుని ముఖమండపంబునకు రండు. ఈచెప్పిన ధర్మంబు లొల్లనివా రెల్లరును వైశ్యకులబహిష్కృతులు గాన నీపురంబున నుండక వెళ్లుం డని పురవీథులను సందులను జాటుం డని నిశ్చయంబుగాఁ జెప్పి నిజగృహంబులకుఁ జనిరి తదనంతరంబ. 12

క. అలకరితలవరు లుబ్బునఁ, జెలువగు బలుపీరణమ్ముఁ జేఘంటికలుం
బలువిడి నధికము గూర్చియు, నెలమిని ఘంటాపథమున కేగిరి కణఁకన్. 13

వ. అచ్చటిభటసంఘంబులఁ గూర్చికొని నిర్భయులై వా రానతిచ్చినయంతకంటె నధికంబులుగాఁ బంచమహావాద్యంబులు మ్రోయించి యత్యుగ్రధ్వనులు సెలంగనేకవాక్యంబుగా నిట్లనిరి. 14

సీ. విష్ణువర్ధనరాజు విగ్రహవ్యగ్రుఁడై కన్నె నిమ్మని పట్టి గాసిఁ బెట్టెఁ
గులము పీడఁగ లేక చెలువుగా మానంబు నిలుప వైశ్యవరులు నిష్ఠతోడఁ

గన్యకాయుక్తులై కడఁగి సభార్యత నగ్నిప్రవేశంబు లర్థిఁ జేసి
ముక్తిఁ గాంత మనుచు మోదంబుతోఁ బల్కి ప్రతిన చేసిరి గాన భక్తి గల్గి
తే. కులము నగరేశ్వరుండును గోత్రములును, నగరశబ్దంబు మానంబు నయముతోడ
వలయువారుండుఁ డెల్లనివారలెల్ల, వైశ్యకులబాహ్యులై పొందు వసుధ ననుచు.

క. అంగళ్ల వీథిసందుల, సంగతముగ రచ్చపట్లఁ జాటినయంతన్
వెంగలివైశ్యులు తమతమ, ముంగిళ్లను మూఁక లైరి మూకత నిగుడన్. 16

క. అందఱు నక్కడ నక్కడ, దండడిగా మూఁక లగుచుఁ దత్తరపడుచున్
బొందెఱుఁగక నిర్దయులై, నిందింపందొడఁగి రంత నీచోద్యుక్తిన్. 17

సీ. ఈకన్య భూమిలో నేటికి జనియించెఁ గినుకఁ దోఁచిన ధూమకేతుభంగి
సీత పుట్టఁగ లంక చెడ్డట్లు పెనుగొండఁ జెఱుపఁగాఁ బుట్టె నీశిశు వటంచు
కులమను జలరాశి గొబ్బున మ్రింగఁగఁ బడబాగ్ని యయ్యె నీపడు చటంచు
నృపతికిఁ దగ నిచ్చి నెమ్మది నుండక సాహసం బేటికిఁ జత్తు మనుచుఁ
తే. గులమువారలు భ్రమసిరి కుల మదేల, గోత్రము లవేల మానంబుఁ గోర నేల
యిప్పు డెక్కడినగరేశుఁ డేటినగర, మేటిశీలంబు లిందుల కేల చావ. 18

వ. అనుచు ననేకప్రకారంబుల విషణ్ణహృదయులై మఱియు నిట్లనిరి. 19

క. మా కీపెనుగొండేటికి, మా కీనగరేశుఁ డేల మఱి పురి లేదా
మా కిపుడు చావనేటికి, మా కీవైశ్యత్వ మేల మానితి మనుచున్. 20

వ. ఇట్లనేకప్రకారంబుల గుమురులై వాడవాడలఁ బలువిడిఁ దిరుగువారును మన యిండ్లలోఁ గలపాపలలోఁ జక్కనికన్యకం దెచ్చి శృంగారించి యతనిచే రాజ్యంబెల్ల భరింత మనువారును మనకు రాజ్యం బేల యీవైశ్యత్వం బేల యెక్కడ కేనియుం జని తిర్యగ్జాతిలక్షణంబులు ధరించి ప్రాణంబులు రక్షించుకొంద మనువారును మనపాల దైవంబుగల దింత దలంచినవా రెవ్విధంబుననైన రాజకీయభటులచేతఁ బట్టి తెప్పించి గుండంబుల వేయక తెలియఁ జెప్పి మేలు చేసి రనువారును నిక్కన్నియమీఁదితలఁపు విడిచి యెక్కడికైన నిపుడె చనువారల మనువారును నాలస్యంబు పనిలేదు వెడలవలయు వినుండు వినుం డనువారును బలుకుచో నోరు లెండి రసనాగ్రంబులు తడిలేక పెదవుల దడపువారును బదంబులు తొట్రిల దగ్గుత్తిక పెట్టి యశక్తులై పిడుగు పడినగతిఁ గదలనేరక కదలి హా దైవమా యనువారును గటకటా యనుచు గాత్రంబులు కదలుపనేరక యాతురపడుచు దైవంబుల దూఱుచు నిలువేల్పులకు జాతరలు సేయుఁడు మని మీఁదుగట్టుచు నింగిఁ బలుమఱుఁ దొంగిచూచుచు నిగిడి నిలువక పాఱిపోవుచు ముందఱ గానక తొడివడ నడుగు నిడ నదరి యడవిం బడి మరలుచుఁ దమతమవారలం బిలుచుచు నక్కడక్కడ నిలుచుచుఁ బరమేశ్వరా యింత చేయఁదగునా యని

దైవంబు దూఱువారును మఱికొందఱు విభ్రాంతులై వంత నొంది యొక్కోళ్లోళ్లోళ్ల సమ్మక మనంబులు జల్లన వెల్లివిరిసిన శోకంబున నల్లకల్లోలం బై తల్లులం బిల్లల డిగ్గవిడిచి చని యొక్కింతసేపునకుం దెలివొంది పరువులెత్తి ముందఱం జనువా రలం బలకడచి తమకుం దోఁచిన తెఱంగునం దెరువులు పట్టుకొని పోవువారును ని ట్లనేకవిధంబులం బురంబు వెడలి దూరంబుగా మనంబులు నిలువక బహువిధ మార్గంబులం జనిచని. 21

సీ. కమ్మటవా రని కమ్మవారిని జేరి రిన్నూఱుగోత్రాల హీనమతులు
గోవగొల్లల మంచు గోపులై మున్నూఱు గోత్రాలవా రేఁగి రాత్రపడుచుఁ
బడమటి కేగిరి భగ్నులై దుష్టత దూఱిపాఱుటఁ జేసి తూర్పు లనఁగఁ
దూరుపునాటికి దుర్మార్గులై యేగి రెనుబదిగోత్రాలహీనమతులు
తే. దక్షిణంబును నెడనెను ధరణి యనుచు, నోడి రోకనూటముప్పదిమూఁడుగోత్ర
ములదురాత్ములు త్వరమున కెలమితోడఁ, బ్రాణభయమున నంతంతఁ బరువులిడుచు.

వ. ఇవ్విధంబునఁ గులాచారంబులు విడిచి చనినయనంతరంబ. 23

ఉ. ధీరులు ధర్మవర్తనులు దీప్తయశోధను లిభ్యసభ్యు లా
చారగరిష్ఠు లంచిత విచారులు శూరులు సత్యసంధు లిం
పారఁ బ్రతిజ్ఞ దప్పనిమహాత్ములు వైశ్యులు సాభిమాను లై
వీరత నుల్లసిల్లఁ గడువేగమునం జనుదెంచి రంతటన్. 24

వ. ఇట్లు పరమోత్సాహంబునం జనుదెంచి నగరేశ్వరునకు నమస్కారంబులు సేసి తన్ముఖమండపంబున నిలిచి భాస్కరాచార్యముఖపురోహితవర్గంబుల రప్పించుకొని వందనంబు లాచరించి వారికిట్లనిరి. కులాచారధర్మమార్గంబులు విడిచి బహిష్కృతులై పఱచినయాఱునూటపండ్రెండుగోత్రంబులవారల విలోకించితిరె యింక ముందరఁ బ్రాణవిసర్జనోన్ముఖు లైనవారలచేఁ దాంబూలంబు లందినఁగాని నమ్మ రాదు తద్విధానం బంగీకరించి వీరకంకణంబు లీయవలయు నని ప్రార్థించిన భాస్కరాచార్యుం డిట్లనియె. 25

క. వరశోభనకాలంబునఁ, గరకంకణధారణంబు కడువిభవంబై
పరఁగిన తాంబూలంబులు, నిరవుగ నొనరింప మాకు నీపని తగునే. 26

వ. మఱియు నింకొక్కటి వినుండు మిమ్ములఁ బుత్రవాత్సల్యంబున సంరక్షణ సేసి మీ జయంబుఁ గోరిన నేనే యాముష్మికఫలంబు లపేక్షించినట్టి పరమపుణ్యు లైన యీ వైశ్యులకు వీరకంకణధారణంబు సేయంజాల శివశివా యని కర్ణంబులు మూసికొనిన నాసమయంబున నవ్వైశ్యు లిట్లనిరి. 27

క. ధరఁగలవర్ణాశ్రమముల, గురువులు మీ రిట్టివిధము గోరుట తగునా
కరుణింపుము గురునాయక, పరమునకును గర్త లైనబంధువు లిదే. 28

వ. కావున మాకు సమస్త విద్యావిశేషంబు లొసరించి పుత్రపౌత్రాభివృద్ధిగా నాశీర్వదించినగురుస్వాము లీ రగుటం జేసి యిట్లవధరింపంగను జగత్ప్రఖ్యాతంబుగాఁ దద్విధం బంగీకరింపవలయు ననిన నౌఁగాక యని షష్టింతనిర్మితంబు లగు సూత్రంబులను గ్రముకపక్షషట్కంబులుగఁ జేసి వీరకంకణతాంబూలంబులు పసిఁడిపళ్లెరంబుల నాయితంబు సేసి కరతలంబులం బట్టుకొని సద్దపస్వరంబున నవ్వైశ్యవరుల కిట్లనియె. 29

మ. కులము న్సత్యము శీలము న్నగరముం గోత్రాభిమానంబు సిం
పలరన్ శ్రీనగరేశ్వరు న్వలయువా రగ్నిప్రవేశార్థమై
వెలయం గొండిదె వీరకంకణములన్ వీరెంబులు న్మోల్ల లేక్
గులబాహ్యు ల్వరివెళ్లుఁ డంచు మిసలన్ ఘోషించుచుం బల్కఁగన్. 30

వ. అమ్మహాత్మునివాక్యంబులు వినిన తత్క్షణంబ. 31

క. ధనదాహ్వయుఁ డగుబాలుఁడు, ధనసతి యనుపేరు గల్గుదారయు దానన్
ఘనమగుబాల్యముఁ దలఁపక, చనుదెంచెను వైశ్యవరులసభముందఱకున్. 32

గీ. వచ్చినియతి నిల్చి వరకంకణంబులు, వీడెములను దెండు విభవ మెసఁగ
ననిన మెచ్చి వైశ్యులందఱుఁ గొనియాడి, రతనిఁ జూచిభాస్కరార్యులపుడు. 33

క. మీతలిదండ్రులు వృద్ధులు, మీ తాత్పర్యంబుఁ జూచి మెచ్చితి మనఘా
ఖ్యాతికి నింతే చాలును, భూతలమున వైశ్యవంశభూషణ మతియున్. 34

క. మీ రింకను ననపత్యులు, ఘోరాగ్నిఁ జొరంగవలదు కులమునకర్హుల్
ధారణి నేకాలంబును, ధీరతతో వెలయుఁ డింక దీప్తప్రభు లై. 35

వ. అనిన నతం డిట్లనియె. 36

క. నగరస్వాములు ధరలో, నగణితముగఁ బలికి తిరుగ రనఁగా మహిమ
న్నెగడినప్రతిభలు దలఁపక, తగునే ననుఁ బిన్నఁ జేయఁ దలఁచుట మీకున్. 37

వ. అని పలికి యొడంబడక వీరావేశహృదయుం డై వీరకంకణంబు ధరించి వీరతాంబూలం బందిన విస్మయం బంది యచటివైశ్యు లందఱును వీరావేశంబు లావహిల్లఁ గ్రేళ్లుఱికి యొకళ్లొకళ్లఁ దలకడచి వచ్చి తమతమ కీయవలయు నని ముందుముందుగా వచ్చుటం జూచి తమకింపవల దని యొకరొకరిఁ బిలిచి వీరకంకణంబుల నొసంగినఁ బరిగ్రహించి యనంతరంబ తమతమగోత్రంబులు లిఖియించుటకుఁ దామ్రశాసనంబులు నిర్మింపం జేయించి యందు గోత్రంబుల లిఖించి రెట్లనిన. షౌ, స్త్య, గణముఖ, హారిశిష్ట, ఉద్వాహ, నాభీల, తిలక, మైత్రేయ, త్రికశిష్ట, మునికుల

మార్కండేయ, జదురు, గంధశిల, దెందక, సూర్యకుల, ఫలక, పదశిష్ట, పృథ్వి, మాసంతల, విక్రమ, పౌండ్రయాచక, కులశిష్ట, శ్రేష్ఠకుండల, సనక, కర్ణాకుల, కరపాల, పద్మశిష్ట, ఉతకల, మాంజిసీతకుల, అనుపాల, తుప్పాల, అనమాండద్య, లెన్నాఖ్య, అనంత, పాబాల, ప్రకబలశిష్ట, ప్రకాళ్ల, ఉపమస్యు, ఛందోవాసిష్ఠ, గోసెల, ప్రోవిశిష్ట, పున్నిమాసంతల, వనగుహ, పారాశర్య, పలిగుహ, రవిశిష్ట, సూక్ష్మాంక, చంద్రచూడ, తోటక, విపశిష్ట, శ్రీసోళ్ల, రెంటక, రనుపాల, రారసుల, కామిశిష్ట, హోశాంత, కామధేను, చెఱుకోల, ఉపలాల, వసంతభ్రమర, మద్దికవసిష్ఠ, అగ్నిముఖ, అభిమంచిక, హస్తిక, చిత్తాల, చింతక, చింతమశిష్ఠ, చెనశిష్ఠ, జానుకముల, జనకచంద్రక, చంద్రిక, చంద్రకుల, చంద్రముల, ఘనశ్రీల, విక్రమ, కుమారక, మానాదికుల, మన్యుకుల, స్వామిసమాహిత, శిష్ట, ఘంటాఖ్య, ధరంకార, నూరిశిష్ఠ, వేదిశిష్ఠ, శ్రీరంగుల, పోలికుల, మూలకపటన, దీక్షామార, శికచంద్ర, చెన్నకుల, కరకపాల, భీమ, పిప్పలాఖ్య, భీమశిష్ట, ధనద, హరద, కుసుమ, మల్యాఖ్య, సోమాఖ్య, నాగాహ్వాయ, భోగాహ్వాయ, లోక, జగతి, రామ, పార్థివప్రముఖనామంబులం గలవైశ్యఋషుల సపత్నీకులఁగా లిఖయించి తదనంతరంబ యాగోత్రంబులఁగలముఖ్యప్రవరలు, నిశ్చయించి లిఖితంబులు చేయించు విధం బెట్టిదనిన. 3౪

౧. ప్రభాత, గౌశిష్ట, ధనంజయ, సుమంగ, అతిథి, పంచార్షేయ ప్రవరాన్విత ప్రభాతఋషిగోత్రః—ఇందుకు మఱుఁగు – పెండ్లికులగోత్రము, రవిశిష్ఠగోత్రము.

౨. మాద్గల్య, త్రిక్షు, ధార్మ్యశ్వ, త్ర్యార్షేయ ప్రవరాన్విత మౌద్గల్యఋషిగోత్రః—ఇందుకు మఱుఁగు–మునికుల, మూలకుల, నాభీలగోత్రములు.

3. ఆత్రేయ, విశ్వామిత్ర, సైన్యక, త్ర్యార్షేయ ప్రవరాన్విత ఆత్రేయసగోత్రః—ఇందుకు మఱుఁగు, ఎరశిష్ఠ, అరశిష్ఠ, అరసకులగోత్రములు.

౪. పారాశర్య, కృత్స్నమద, శౌనక, భార్గవ, చతురార్షేయ ప్రవరాన్విత పారాశర్యసగోత్రః—ఇందుకు మఱుఁగు – పడగశిల, పాణిశిల, పాంచాల, కామధేను లనునాలుగు గోత్రములు.

౫. వామదేవ, బృహద్దుగ్ధ, మతనతి, త్ర్యార్షేయ ప్రవరాన్విత వామదేవఋషిగోత్రః—మఱుఁగు– ఉపమకుల, ఉపమన్యుకుల, ఉపలాలకుల గోత్రంబులు.

౬. పూతిమాష, జామదగ్ని, భృగు, త్ర్యార్షేయ ప్రవరాన్విత పూతిమాషకులగోత్రః—మఱుఁగు– తురీయాటకుల, తులశిష్ఠగోత్రములు.

౭. పౌండ్రక, వాధూళి, సావేద, యాస్క, చతురార్షేయ ప్రవరాన్విత పౌండ్రకఋషి గోత్రి—మఱుఁగు- ప్రోలికుల, పుంశుమాంశుల, ప్రోవిశిష్ఠ గోత్రములు.

౮. జతుకర్ణ, జాబాలి, వైరోహిత్య, వటుక, మాండవ్య, పంచార్షేయ ప్రవరాన్విత జతుకర్ణఋషిగోత్రి—మఱుఁగు- చంద్రమశిష్ట, చంద్రమూలకుల, చంద్రశిష్టగోత్రములు మూఁడును.

౯. సత్యక-వాచీన-యోగ్య - పార్ష్ణేంశణ - తనూనకపంచార్షేయ ప్రవరాన్విత సత్యకఋషిగోత్రి—మఱుఁగు-చింతకుల-చింతాల-చింతమశిష్ఠగోత్రములు.

౧౦. వాయవ్య-ఆప్నువ- ఔర్వసావర్ణి-జీవంతి-దేవరాంతకషడార్షేయప్రవరాన్వితవాయవ్యఋషిగోత్రి-మఱుఁగు-వ్రంగమూల-వ్రక్కాల-ప్రకశిష్ఠగోత్రములు.

౧౧. పౌలస్త్య-పాంథన-బృహస్పతి-సర్వస్తంభ -కర్మస్తా-వచన - గార్గ్యసప్తార్షేయ ప్రవరాన్వితపౌలస్త్యర్షి గోత్రి—మఱుఁగు-గోశీల, ఉత్తమశీల - శ్రీగోశీల-పునగోశీల-భీమగోశీల - పట్టుగోశీల - వల్లవగోశీల - సత్యగోశీల - నందిగోశీల - సూర్యకుల గోత్రములు.

౧౨. శ్రీవత్స- చ్యవన-ద్వ్యార్షేయ ప్రవరాన్విత శ్రీవత్సర్షి గోత్రి—మఱుఁగు-శ్రీలకుల-శ్రీరంగగోత్రములు.

౧౩. మైత్రేయ - మృకండు - మండూక - త్ర్యార్షేయప్రవరాన్వితమైత్రేయర్షి గోత్రి—మఱుఁగు-మిథునకుల, మద్దికులగోత్రంబులు.

౧౪. ఉత్తమోజ-గాన్వేత - హవ్య-త్ర్యార్షేయప్రవరాన్విత ఉత్తమోజర్షికుల ర్షిగోత్రి—మఱుఁగు, ఉత్తకుల, ఉదశిష్ఠ, గోత్రములు.

౧౫. కాంచన-మైత్రావరుణ, శక్తి-పుసమన్య-చతురార్షేయప్రవరాన్వితకాంచనర్షిగోత్రి-మఱుఁగు-చేఱుకుల, చేఁగొట్లగోత్రములు.

౧౬. పవిత్రపాణి-పాలక-తాలక-త్ర్యార్షేయ ప్రవరాన్విత పవిత్రపాణిర్షిగోత్రి-మఱుఁగు-ధైసెట్లు, దైశిష్టగోత్రములు రెండును.

౧౭. గోపక-యాజ్ఞవల్క్య - బృహదగ్ని - త్ర్యార్షేయప్రవరాన్విత గోపకర్షిగోత్రి—మఱుఁగు-ఇంచుపాహ్వాయ, గొంటకుల గోత్రములు.

౧౮. సనక- కాలభేక-వలది-బభ్రులోహిత - చతురార్షేయప్రవరాన్విత సనకర్షిగోత్రి—మఱుఁగు సనకుల, సన్నకులగోత్రము.

౧౯. కణ్వ-అజామిళ-ద్వ్యార్షేయప్రవరాన్విత-కణ్వర్షి గోత్రి—మఱుఁగు - కర్ణాకుల, కాటుకులగోత్రములు.

౨౦. మునిరాజ-సాలంకాయన-శ్యావక్ర-శ్యామాత - రయపూరి - పంచార్షేయప్రవరాన్విత మునిరాజర్షి గోత్రః-మన్యకుల-మానాభులగోత్రములు వీనికి మఱుఁగు.

౨౧. సుతీక్ష్ణ-శ్యావదత్త-అగ్నిదేవ- శ్యామాతు-కౌశికపంచార్షేయప్రవరాన్విత సుతీక్ష్ణగోత్రః-మ-వంతకుల-జెంతకుల గోత్రములు.

౨౨. అగస్త్య-వీతహవ్య-రక్షచ్యుత - త్ర్యార్షేయప్రవరాన్వితాగస్త్యర్షి గోత్రః మ-ఆనపకుల-అనపాలగోత్రములు రెండును.

౨౩. జరత్కారు-అస్తీక-ద్వ్యార్షేయ ప్రవరాన్విత జరత్కార్వృషిగోత్రః-మ-చన్నకుల-జానకుల గోత్రములు రెండును.

౨౪. పల్లవ ఆపస్తంబ ఆఖ్యమధు-త్ర్యార్షేయప్రవరాన్విత పల్లవర్షిగోత్రః-మ-గుంటాకుల-గణపకులగోత్రములు.

౨౫. దాల్భ్య - చందన - దైవికత్ర్యార్షేయప్రవరాన్విత దాల్భ్యర్షిగోత్రః-మ-ఫలకుల-పటనమ-శిష్ఠగోత్రములు రెండును.

౨౬. దుర్వాసః- ధనంజయ ద్వ్యార్షేయ ప్రవరాన్విత దుర్వాసర్షిగోత్రః-మ-జెంత్రకుల, జెంతాకులగోత్రములు.

వ. ఈ యిరువదియాఱును జంటగోత్రంబులు.

౧. కశ్యప-శృంగి-కైతక-త్ర్యార్షేయప్రవరాన్విత కశ్యపర్షిగోత్రః-మఱుఁగు-గణముఖులగోత్రము.

౨. శాండిల్య-కౌశిక-శ్వవారి-మాండూక చతురార్షేయప్రవరాన్విత శాండిల్యర్షిగోత్రః-మఱుఁగు-తుప్పాలగోత్రము.

౩. గౌతమ-అంగిరస-అయోగ్య-ఔచ్ఛిల్య-శుచి పంచార్షేయ ప్రవరాన్విత గౌతమఋషిగోత్రః-మఱుఁగు-గంధశిలగోత్రము.

౪. బౌద్ధాయన-కాంక్షీవత-వామదేవ-బృహదుద్ధ-చతురార్షేయ ప్రవరాన్విత బౌద్ధాయనఋషిగోత్రః. మఱుఁగు-బుద్ధికులగోత్రము.

౫. వాలఖిల్య-అఘమర్షణ-సునంపక-త్ర్యార్షేయ ప్రవరాన్విత వాలఖిల్యఋషిగోత్రః. మఱుగు-విపరిశిష్ఠగోత్రము.

౬. వసిష్ఠ-ప్రథమ - ఇంద్రపాభర -వసు - సంకృతి-పంచార్షేయ ప్రవరాన్విత వసిష్ఠఋషిగోత్రః, మఱుఁగు-వస్తికులగోత్రము.

౭. సౌంద్య-సునూప- పనస-దుమాఖ్య - చతురార్షేయ ప్రవరాన్విత సౌందర్యర్షిగోత్రః-మఱుఁగు-వినుకులగోత్రము.

౮. సుకాంచన-కురుత్సేక-హవ్యసేన-త్ర్యార్షేయప్రవరాన్విత సుకాంచనబుషి గోత్రకు. మఱుఁగు-పుచ్ఛకశిలగోత్రము.

౯. వరతుంతు-కౌశిక-ద్వ్యార్షేయ ప్రవరాన్వితవరతంతుబుషిగోత్రకు. మఱుఁగు మాసంతకులగోత్రము.

౧౦. విశ్వామిత్ర-దేవరాత-ఔలకి-త్ర్యార్షేయ ప్రవరాన్విత విశ్వామిత్రర్షి గోత్రకు. మఱుఁగు-విక్రమశిష్టగోత్రము.

౧౧. పింగళ-మనస్తంతు-పాలక-కితాలూక చతురార్షేయ ప్రవరాన్విత పింగళ బుషిగోత్రకు. మఱుఁగు-ఐనకులగోత్రము.

౧౨. కపిల- శాండిల్య - కాశ్యప - త్ర్యార్షేయ ప్రవరాన్విత కపిలర్షిగోత్రకు. మఱుఁగు-మందకులగోత్రము.

౧౩. భారద్వాజ-దాల్భ్య-ద్వ్యార్షేయ ప్రవరాన్విత భారద్వాజర్షిగోత్రకు. మఱుఁగు-బలిశ్రేష్ఠగోత్రము.

౧౪. చ్యవన-ఆంగిరస-గౌతమ-త్ర్యార్షేయ ప్రవరాన్విత చ్యవనర్షిగోత్రకు. మఱుఁగుపద్మశ్రేష్ఠగోత్రము.

౧౫. బాభ్రేయ-భార్గవ-వైరోహిత్య-వటు-ప్రాచీనపంచార్షేయ ప్రవరాన్విత బాభ్రేయబుషిగోత్రకు. మఱుఁగు-చనిశష్ఠగోత్రము.

౧౬. మందపాల-మతంగ-మాలన-త్ర్యార్షేయ ప్రవరాన్విత మందపాలబుషి గోత్రకు. మఱుఁగు-వెన్నకులగోత్రము.

౧౭. మార్కండేయ-జామదగ్ని-జాబాలి-త్ర్యార్షేయ ప్రవరాన్విత మార్కండేయబుషిగోత్రకు. మఱుఁగు-మోరాకులగోత్రము.

౧౮. బుశ్యశృంగ-రోమహర్ష-తృణబిందు-శృంగి-చతురార్షేయ ప్రవరాన్విత బుశ్యశృంగబుషిగోత్రకు. మఱుఁగు-అనంతకులగోత్రము.

౧౯. ఆశ్వలాయన - వీతహవ్య-ద్వ్యార్షేయప్రవరాన్విత- ఆశ్వలాయనబుషి గోత్రకు. మఱుఁగు-వెలిశ్రేష్ఠగోత్రము.

౨౦. ఉగ్రసేన-అంబరీష-శతబలి త్ర్యార్షేయ ప్రవరాన్విత ఉగ్రసేనబుషి గోత్రకు. మఱుఁగు-కొమిరిశ్రేష్ఠగోత్రము.

౨౧. మౌంజ్యాయన-వైశ్య - ద్వ్యార్షేయప్రవరాన్వత మౌంజ్యాయనబుషి గోత్రకు. మఱుఁగు-ముంజికులగోత్రము.

౨౨. యాజ్ఞవల్క్య-యాశ్యమాని-హర్యశ్వ,త్ర్యార్షేయ ప్రవరాన్విత యాజ్ఞ

వల్క్యఋషిగోత్రః. మఱుఁగు-అభిమంచికులగోత్రము.

౨౩. శండిల్య-శాండిల్య-శౌనక-శుక చతురార్షేయ ప్రవరాన్విత శండిల్యర్షి గోత్రః. మఱుఁగు-శిరిశ్రేష్ఠగోత్రము.

౨౪. అంగిరస-అయాచిత-ఔచిత్య-కాంతీవశ-శుచి-పంచార్షేయ ప్రవరాన్వితఅంగిరసర్షిగోత్రః. మఱుఁగు పైడికులగోత్రము.

౨౫. జైమిని-కపిల-మహాదక్ష - త్ర్యార్షేయ ప్రవరాన్విత జైమినిసగోత్రః. మఱుఁగు-వెలిగోళ్లగోత్రము.

౨౬. కౌశిక- విశ్వామిత్ర ద్వ్యార్షేయ ప్రవరాన్విత కౌశికఋషిగోత్రః. మఱుఁగు-కరపాలగోత్రము.

౨౭. బృహదశ్వ-బృహదుద్గ-భార్గవ-త్ర్యార్షేయ ప్రవరాన్విత బృహదశ్వఋషి గోత్రః. మఱుఁగు-పెరిశ్రేష్ఠగోత్రము.

౨౮. కృష్ణ-పింగళ-పిశంగిత్ర్యార్షేయ ప్రవరాన్వితకృష్ణర్షి గోత్రః. మఱుఁగు-ధనదకులగోత్రము.

౨౯. గార్గ్య-చ్యవన-మందపాల త్ర్యార్షేయ ప్రవరాన్విత గార్గ్యర్షిగోత్రః మఱుఁగు-భ్రిమదకులగోత్రము.

౩౦. కాండిన్య-కౌశిక-ద్వ్యార్షేయ ప్రవరాన్వితకాండిన్యఋషిగోత్రః.మఱుగు-ఘనలోలగోత్రము.

౩౧. హరివల్క్య-బృహదశ్వ-గౌతమ-వామదేవ - వామలోచన పంచార్షేయ ప్రవరాన్విత వామదేవఋషిగోత్రః మఱుఁగు-గోరంటకులగోత్రము.

౩౨. వామదేవ-సనక-సనందన - సనత్కుమార-సనత్సుజాత పంచార్షేయప్రవరాన్విత వామదేవఋషిగోత్రః. మఱుఁగు-భీమశ్రేష్ఠగోత్రము.

౩౩. సౌపర్ణ-అంగిరస-బుదురు-గౌతమచతురార్షేయప్రవరాన్వితసౌపర్ణ ఋషి గోత్రః మఱుఁగు-బుదురుకులగోత్రము.

౩౪. సంవర్త-మరీచి - అత్రి-త్ర్యార్షేయ ప్రవరాన్విత సంవర్తఋషిగోత్రః మఱుఁగు-కెంటకులగోత్రము.

౩౫. జమదగ్ని-భృగు-భార్గవ - త్ర్యార్షేయ ప్రవరాన్విత జమదగ్నిసగోత్రః మఱుఁగు-దిక్షమశ్రేష్ఠగోత్రము.

౩౬. సౌవర్ణ-జీవంతి-దేవరాత-త్ర్యార్షేయ ప్రవరాన్విత సౌవర్ణఋషిగోత్రః మఱుఁగు-సూపాలగోత్రము.

౩౭. వ్యాస-వసిష్ఠ-పరాశర-శుక - శౌనక పంచార్షేయ ప్రవరాన్విత వ్యాసర్షి గోత్రః. మఱుఁగు-ధనదకులగోత్రము.

౩౮. శుక్ల-సుతాన-శౌనక-సునంద-చతురార్షేయ ప్రవరాన్విత శుక్లఋషి గోత్రః. మఋఃగు-శ్రీసాళ్లగోత్రము.

౩౯. బుదుర-గౌతమ-ద్వ్యార్షేయ ప్రవరాన్వితబుదుర్వర్షిగోత్రః. మఋఃగు-పెద్దిశ్రేష్ఠగోత్రము.

౪౦. వాల్మీక-వాలఖిల్య-వాసంతి వైశ్య కృత్సన- వాసుదేవ షడార్షేయప్రవరాన్విత వాల్మీకఋషిగోత్రః మఋఃగు-సాంతాలగోత్రము.

౪౧. భృగు-భార్గవ - చ్యవన - త్ర్యార్షేయ ప్రవరాన్వితభృగుఋషిగోత్రః. మఋఃగు-పృథ్వీశ్రేష్ఠగోత్రము.

౪౨. కృత్సన-త్రిజట-దేవవల్క్య-హరిత-పిప్పల పంచార్షేయ ప్రవరాన్విత కృత్సనర్షిగోత్రః. మఋఃగు-యిసపకులగోత్రము.

౪౩. పార్థివ-విష్ణువృద్ధ-ప్రవరకృత్సన - త్ర్యార్షేయ ప్రవరాన్విత పార్థివర్షి గోత్రః. మఋఃగు-ప్రోడయాచకులగోత్రము.

౪౪. శౌనక-హరివల్క్య-శక్ర - త్ర్యార్షేయప్రవరాన్విత శౌనకర్షిగోత్రః. మఋఃగు-శనకాలుగోత్రము.

౪౫. శరభంగ-శల్య-సౌరభేయ-శామర్షణ-చతుర - పంచార్షేయ ప్రవరాన్విత శరభంగ ఋషిగోత్రః. మఋగు-తుకశిష్ఠగోత్రము.

౪౬. జాబాలి-తృతీయ-మేళియ-త్ర్యార్షేయప్రవరాన్విత జాబాల్యర్షిగోత్రః. మఋ.గు త్రివిక్రమశిష్ఠగోత్రము.

౪౭. మతంగ- పాదలోచన-ద్రోణ-త్ర్యార్షేయ ప్రవరాన్విత మతంగఋషి గోత్రః. మఋఃగు-చిద్రుపిళ్లగోత్రము.

౪౮. వృత్కృష్ట-మణిభద్ర-ద్వ్యార్షేయ ప్రవరాన్విత వృత్కృష్టర్షిగోత్రః. మఋఃగు-కార్పిసులగోత్రము.

౪౯. జంభసూదన-విరూళి-దంష్ట్రనామ త్ర్యార్షేయ ప్రవరాన్విత జంభసూదనఋషిగోత్రః. మఋఃగు-చెంగాలగోత్రము.

౫౦. చక్రపాణి-వృషదశ్వ-అశ్వనామక-త్ర్యార్షేయప్రవరాన్వితచక్రపాణి సగోత్రః. మఋగు-చక్రమూలగోత్రము.

౫౧. ఆశ్వలాయన-మషణ-సౌఖ్య-త్ర్యార్షేయప్రవరాన్విత ఆశ్వలాయనగోత్రః.మఋఃగు-అగ్రమూలగోత్రము.

౫౨. కౌంతేయ-భృగు ద్వ్యార్షేయప్రవరాన్విత కౌంతేయఋషిగోత్రః. మఋఃగు-కామిశిష్ఠగోత్రము.

౫౩. నారద-పారాశర్య-తుంబురు త్ర్యార్షేయ ప్రవరాన్విత నారదఋషి గోత్రః. మఱుఁగు-పాలకులగోత్రము.

౫౪. సుబ్రహ్మ-సునంద-ద్వ్యార్షేయ ప్రవరాన్విత సుబ్రహ్మర్షి గోత్రః. మఱుఁగు-చందనకులగోత్రము.

౫౫. సనందన-సనత్కుమార-సనత్సుజాత త్ర్యార్షేయప్రవరాన్విత సనందన ఋషిగోత్రః. మఱుఁగు-సమశిష్ఠగోత్రము.

౫౬. కాంత్రీవత-వాసుదేవ-శుచి-అత్రి- చతురార్షేయ ప్రవరాన్విత కాంత్రీవ తర్షి గోత్రః. మఱుఁగు-క్రమశష్ఠగోత్రము.

౫౭. తరుణ-ఉపవీత-అనుప్లవ-హాత్యకి-అనుతారణి పంచార్షేయ ప్రవరాన్విత తరుణఋషిగోత్రః. మఱుగు-త్రిమూలకులగోత్రము.

౫౮. వరుణ-వారుణ-వైషష్య-వైరోహిత-వైశ్య- పంచార్షేయ ప్రవరాన్విత వరుణర్షి గోత్రః. మఱుఁగు-శిరిశ్రేష్ఠగోత్రము.

౫౯. సనత్కుమార-సతుండి- శమితానక త్ర్యార్షేయ ప్రవరాన్విత సనత్కుమారఋషిగోత్రః. మఱుఁగు-సురిశిష్ఠగోత్రము.

౬౦. ఔచ్ఛిద్య-కౌలంబ-అఘమర్షణ-త్ర్యార్షేయప్రవరాన్విత ఔచ్ఛిద్యర్షి గోత్రః. మఱుఁగు-ఎనసకులగోత్రము.

౬౧. త్రిజిహ్వ-హారివల్క్య-జాబాల్య-త్ర్యార్షేయ ప్రవరాన్వితత్రిజటర్షి గోత్రః. మఱుఁగు-ఉసిరికులగోత్రము.

౬౨. శుచి-మను-భృగు-త్ర్యార్షేయ ప్రవరాన్విత శుచిఋషిగోత్రః. మఱుఁగు-ఇలమంచికులగోత్రము.

౬౩. విష్ణువృద్ధ-ప్రవరకృత్స్న-బాదరాయణ-త్ర్యార్షేయ ప్రవరాన్విత విష్ణువృద్ధర్షి గోత్రః. మఱుఁగు-పిప్పలాదిగోత్రము.

౬౪. వైరోహిత్య - వసంత- వాసస-త్ర్యార్షేయ ప్రవరాన్విత వైరోహిత్యర్షి గోత్రః. మఱుఁగు-వసంతకులగోత్రము.

౬౫. దేవవల్క్య-హారిత- పిప్పల- త్ర్యార్షేయ ప్రవరాన్విత దేవవల్క్యర్షి గోత్రః. మఱుఁగు-జేశిష్ఠగోత్రము.

౬౬. సౌమ్య-మందపాల-రేఫ-రైభ-చంద్రమూల-పంచార్షేయ ప్రవరాన్విత సౌమ్యర్షి గోత్రః. మఱుఁగు-హాస్తికులగోత్రము.

౬౭. మాండవ్య-జడభరత-మతంగ-త్ర్యార్షేయ ప్రవరాన్విత మాండవ్యఋషి గోత్రః. మఱుఁగు-ముద్ధకులగోత్రము.

౭౮. జడభరత-జామదగ్ని-ద్వ్యార్షేయ ప్రవరాన్విత జడభరతర్షిగోత్రః. మఱుఁగు.గుండకులగోత్రము.

౭౯. మను-మందపాల-మాతంగ-మరీచి-మాను పంచార్షేయ ప్రవరాన్విత మనుఋషిగోత్రః. మఱుఁగు-మానకులగోత్రము.

౮౦. శక్తి-త్రిపయ - శివభద్ర - త్ర్యార్షేయప్రవరాన్విత శక్తిఋషిగోత్రః. మఱుగు-దెరికోలగోత్రము.

౮౧. కపిల-భారద్వాజ-భంజసూదన-త్ర్యార్షేయ ప్రవరాన్విత కపిలర్షిగోత్రః. మఱుఁగు-హస్తకులగోత్రము.

౮౨. అత్రి-మరీచి-భృగు-నేత్రపాద-కౌశిక-పంచార్షేయ ప్రవరాన్విత అత్రిఋషిగోత్రః-మఱుఁగు-ఛందోగలగోత్రము.

౮౩. గాలవ-భారద్వాజ-ద్వ్యార్షేయప్రవరాన్వితగాలవర్షిగోత్రః- మఱుఁగు-తుల్వశిష్టగోత్రము.

౮౪. పుండరీక-త్రినయన-చతుష్పాద-వీరసేన- పరిత్య - పంచార్షేయప్రవరాన్విత పుండరీకర్షి గోత్రః-మఱుఁగు తొంటికులగోత్రము.

వ. ఈ డెబ్బదినాలుగు నొంటిగోత్రంబులు.

శ్లో. ఏతే వైశ్యమునిప్రోక్తాః ప్రఖ్యాతేన శతద్వయమ్,
పుత్రపౌత్రప్రదా నిత్యం లభ్యంతే బహువైభవాః.

వ. మఱియు నయ్యవసరంబునందు వీరవ్రతు లైనవైశ్యవిభులనిజగోత్రజన్ము లైన సమస్తబంధుజనంబులు సమూహంబులుగాఁ గూడి మనకులాచారధర్మంబుల సన్మారంబులును, జాతుర్యతాత్కాలికవిశేషంబులుం దెలియుచుం డఁచు మున్నుఁ దమ గురువు లుపదేశించినవిధంబున నిట్లనిరి. 38

క. క్షమ బలము శక్తి జనులకు, క్షమయె బలం బండ్రు భువి నశక్తుల కైనన్
క్షమ లోకవశీకర మగు, క్షమకు నసాధ్యంబు లేదు క్షమ కలుగవలెన్. 39

క. పలుకులఁ బ్రియమును దయయును, దలఁపుచు నేమఱక మిగుల ధైర్యముతోడన్
బలవంతుఁ డనఁగ నెఱుఁగుచుఁ, గులధర్మవిధిజ్ఞు లగుచుఁ గొమరొందుఁ డిలన్. 40

క. శివభక్తియుఁ బురుషార్థము, బ్రవిమలమతి దానధర్మ బంధుప్రియతన్
కవిజనపోషణగతియు న,నవరతమును మఱవకున్న నతిపుణ్యుఁ డగున్. 41

క. కాలము దేశము మిత్రులఁ, దాలిమితోఁ దనదుబలముఁ దలఁపుచుఁ గడఁకన్
మూలక నేర్పరి యై తా, త్కాలికబుద్ధిగలవాఁడు ధన్యుఁడు తలఁపన్. 42

వ. ఇవ్విధంబునఁ గల్గునీతియు ధర్మశాస్త్రంబులును నపారంబులుగల వైనను నొక్క సూక్ష్మధర్మమార్గంబు గలదు. మున్ను శాస్త్రవేత్త యగు భర్తృహరి నీతిధర్మజ్ఞాన బీజంబు లగుపల్కులు వచించెను. స్వజనులయందును బరిజనులయం దనుకంపయు, దుర్జనులయందు శౌర్యంబును, స్త్రీజనులయందు విస్మయంబును, విద్వజ్జనులందు బుజుగతియును, శత్రువులయందుఁ బ్రతాపంబును, గురువులందు క్షమయును, మాయావిజనులందు ధూర్తత్వంబును గలిగి యీవిద్యావిశేషంబులందు నెవ్వఁడు నేర్పరియై విహరించు నతండు ప్రియుండని చెప్పె గావున మనకు సమస్తజ్ఞానంబు లుపదేశింపఁ గర్తలు మనభాస్కరాచార్యులు, భీమనాథ, వామదేవ, హరి, సరస్వతి, షణ్ముఖ, సర్వదేవ, జనార్దన, శంకర, శంభు, విరూపాక్ష, బ్రహ్మ, నీలగ్రీవ, భైరవ, శ్రీధర, వినాయక, లొల్లనాచార్య, దొడ్డాచార్య, మాధవ, పుండరీకాక్ష, పద్మనాభ, ప్రముఖుల నెన్నఁ జేమఱవకుండుండనిపలికి మఱియు నిట్లనిరి.

కాలకంధరుండు గణకతో మనకును, మంగళప్రధాన మొసఁగినాఁడు
నరణ మంచు మనకు నమరులు నెఱుఁగంగ, దాని నడపి విడెముఁ దలఁపవలయు.

క. ముదమలరఁగ నుద్వాహము, మొదలగు శుభకార్యములను మొగి నొనరింపన్
వదలక ద్వాదశసంఖ్యను, సదమలగతిఁ జేయుఁ డిదియె సత్యం బరయన్. 45

వ. అది యేయేప్రకారంబుల నడిపింపవలయు ననిన నెఱింగించెదము సావధానుల రై వినుండు. 46

సీ. సృష్టికిఁ గర్తయౌ శ్రీసదాశివుఁడును ఘనత మూలస్థాన మనఁబరంగ
త్రిగుణాత్మకుఁ డనంగఁ దేజరిల్లుశివుండు నగరేశ్వరుం డయ్యె జగ మెఱుంగ
జనుల కాహ్లాదంబు సలుపు శ్రీవిష్ణుదేవుఁడు జనార్దనుఁ డయ్యె భూరిమహిమ
వింధ్యదేశమునందు విహరించుగిరిసుతవింధ్యవాసిని యండ్రు విమలమతులు
శోనఁ బావనభూమిఁ గొమరొప్ప వసియించు సిరితోన కమలనాఁ జెలువుమిగులఁ
గుల మభివృద్ధిగాఁ గోరిక దీపించఁ గులగురుభాస్కరశోభింపు
చాతుర్దశోత్తరసప్తశతఖ్యాతి నుద్వాహగోత్రజుఁ డూర్జితుండు
పరహితక్రమముఁ దప్పక చేసె మనగణ ముఖ్యుండు ప్రాబల్యమునను మెఱయ

తే. పార్వతీయాంశజాతకు వాసవికిని, సుగుణసంపదగలబాలనగరములకు
నూటయిద్దఱకును జగన్నుతుఁడు మహిమ, నెట్టికిని వీడెముల నెత్తుఁ డిట్టి వరుస. 47

ఆ. నాలవదివసంబు నాకబలియుఁ గాఁగ, దండపనుపుఁ జిమ్మిలుండ లమరఁ
బంచవలయుఁ గాన భక్తి నేకాలంబు, నొనర నిలుపుఁ డిట్టి ఘనయశంబు. 48

తే. తులములోపల యేనొక్కకోర్కిగాఁగ, సలలితంబుగ నడపింప సమత బుద్ధి
మేలు గలుగును మీకును మేదినిఁ బయి, భిలసితంబుగఁ జలువుడ్డి విభవ మొసఁగ.

క. అకలంకులైన వైశ్యులు, ప్రకటితముగఁ బలికి మిగులఁ బ్రఖ్యాతముగా
వికలత చేసినవాఁడు న,రకకూపమునందు యమపురంబునఁ గూలున్. 50

క. ఇదియును దప్పక నడిపిన, విదితముగా మీకు శివుఁడు విష్ణుఁ డజుఁడు సం
పదలు సుతపౌత్రకర మి,చ్చెదరు దయాదృష్టిఁ జూచి సిద్ధం బగుచున్. 51

సీ. శ్రీనగరేశ్వర శ్రీజనార్దనదివ్యమహితోత్సవస్థానమండపమున
వైశ్యు లెల్లరుఁ బాలవైశ్యవర్గముఁ జూచి పలికి రప్పుడు మృదుభాషణములఁ
గరమొప్ప మాతులకన్యావివాహంబు వెలయఁ జేయుఁడు కులవృద్ధిఁ గాఁగ
గన్యకాదోషంబు గ్రహమైత్రి కూటరాశ్యాదిఖేచరయోగభేదములును
తే. దుష్టనక్షత్రజననాదిదోషములును, దలఁపవలదు మేనరికధర్మమునకు
వరుస మేనరిక మిచ్చిన వైశ్యవరుఁడు, పుత్రపౌత్రాభివృద్ధితోఁ బొలుపుమిగులు.

శా. మేనరికం బనుధర్మ మెక్కుడు ధరన్ మిథ్యావచశ్శ్రీయుల
జ్ఞానాధీనతఁ ద్రోసినం గులజనుల్ శాసింపఁ డాదుర్మతి
స్నానోపాయములన్ ఘటింపవలయు న్నానాటికిం ధర్మమే
స్థానంబందును నవ్యభంగిఁ దలఁప న్నస్వార్గమా నెంతయున్. 53

చ. కొమరగు మేనమామకును గూఁతురు పుట్టినయేని నాఁటనే
యమరఁగ మేనయల్లునికులాంగన యౌచు ముహూర్త మప్పుడే
ప్రమదముతోడఁ జేయఁగ శుభం బగు దుశ్శకునంబు దుర్నిమి
త్తములు దలంప కిచ్చుటది ధర్మువు వైశ్యుల కెల్లకాలమున్. 54

క. మేనరికంబును దప్పక, పూని యొనర్చినయతండు పుణ్యుం డగునా
మేనరిక మీక త్రోచిన, హీనుఁడు కులబాహ్యుఁ డగుచు నిలమీఁదఁ జెడున్. 55

ఉ. లంచము పుచ్చుకొంచును గులంబున మేనరికంబు ధర్మదం
బంచితవృత్తిఁ ద్రోచిన రయంబున నానరుఁ డెన్నిభంగులన్
వంచనతోడ దుర్గతి నవశ్యము నొందును బాపభీతి ని
ష్పించినపుణ్యమూర్తి పరమేశ్వరుసత్కృప నొంది వర్ధిలున్. 56

క. పరఁగఁగ మాతులి గర్భిణి, నిరవొందఁగఁ బెండ్లి చన దెవ్వరికైన
స్వైరవున మేనరికంబున, నరయం దీర్ఘంబు నాఁడు సంతతిదాఁకన్. 57

ఆ. దత్తపుత్రునకును దగఁ దన్నుఁ బోషించు, తల్లియును జపుత్రుఁ దగ దొసంగ
మేనమామ పుత్రి మేదినియందును, బనియు లేదు శాస్త్రపద్ధతులను. 58

చ. ఎసఁగును జ్యేష్ఠపుత్రికయు నించుక చిన్నతనాననుండియున్
విసదృశలీలచేతను గనిష్ఠునిపుత్రిక పెద్దదైనచోఁ

బోసఁగును మేనయల్లునికిఁ బొల్పుగఁ గన్యక నిచ్చుటొప్పు నీ
వసుమతి ధర్మమంచు ఘనవర్తను లివ్విధిఁ జేసి రిమ్మహిన్. 59

క. తొలుత వివాహం బైనను, వలనుగ నది తప్పెననుచు వచ్చినయెనిన్
సలలితముగ నీవలయును, యిల నలువదియేండ్లదాఁక నెన్నిక మీఱన్. 60

క. ఎన్నైననవగుణంబులు, కన్నెకు మఱి గలిగెనేనిఁ గడుసెయ్యముతోఁ
బన్నుగ మేనల్లునికిని, నున్నతముగఁ గన్నెఁ గొనుట యుచితము ధాత్రిన్. 61

వ. ఇది మనకులంబునకు వాలాయంబై తరతరంబున నుంటయుం గలదు. ఇటువంటి
మేనఱికం బైనను నీయరానిస్థలంబులు గల వవి యెవ్వి యనిన. 62

మ. కులహీనుండు నపుంసకుండు ముసలిం గుబ్జుండు జాత్యంధుఁడుం
బలురోగిన్ సతికంటెఁ జిన్నయయినన్ భార్యాసమేతుండు క్రొ
వ్వలర స్వేచ్ఛయు నంగహీనుఁడు విహీనాంశుండు శాస్త్రోక్తమై
యిలలో నర్హులు గారు బాలికలఁ దా రీకున్నఁ బుణ్యం బగున్. 63

సీ. తలిదండ్రి లేకున్నఁ దగ నొంటిగాఁ డైన నల్పరోగియును గృశాంగుఁ డైన
మూఁగయుఁ జెవుఁడును మూర్ఖుఁ డైనను బాపరతుఁ డైన బాంధవరహితుఁ డైన
మతిహీనుఁ డైనను మఱి పొట్టివాఁ డైనఁ బీన సైనను గడుఁ బేద యైన
జూదరిగాఁ డైనఁ జుణుగరిగాఁ డైన రాజులఁ గొల్చిన రట్టఁ డైన
తే. ననువుదప్పినవాఁ డైన నబలుఁ డైన, దిటవు లేకున్న నత్యంతకుటిలుఁ డైన
మేనవానికి నిటువంటివాని కైనఁ, గన్య నీవలెఁ బద్వరక్రమ మెఱింగి. 64

క. తనవంతుపడుచు తనయొద్దన యుండియు నవల వంతు తగ నీయంగాఁ
గని కొనియును రెండవపడు, చు నడుగ మేనఱిక మీరు సుజనులు ధాత్రిన్. 65

క. తనవంతుపడుచు నొల్లక, చని రెండవపడుచు నడుగ సరి నీయంగాఁ
జనదా మాతులుఁ డైనను, జనువున నిప్పింపవలదు సతులను వైశ్యుల్. 66

క. మేనఱికమునకు విఘ్నము, పూనినవారలు సహాయముం గొనువారల్
మానక త్రోసినవారల, ధీనయగతిఁ జేయవలయుఁ దెలియఁగ నాజ్ఞల్. 67

క. మెడబలిమి వంతువరుసలు, వడిగాఁ దప్పించినట్టివైశ్యులు కడుపెం
బడి మేనఱికం బీయని, చెడుగులు కులబాహ్యు లాజ్ఞ చేయఁగ నర్హుల్. 68

క. మునుపు సుతులు లేకుండిన, ననువుగ మఱియొకతెఁ బెండ్లియాడిన సుతులన్
గనిన సవతాలి యనుజులు, దనయుల మేనఱిక మొసఁగ ధర్మము చెల్లున్. 69

వ. మఱియు సవిస్తరంబుగాఁ జెప్పెదము వినుండు. వరునికంటెఁ గన్నియ గడియ
తక్కువగానైన జనించిన వివాహంబుచేయ ధర్మంబు కన్యకయున్నతత్వంబును

వరునివామనత్వంబును జూడఁదగదు. ఈఁడుగాని దని భుజగర్వంబునఁ ద్రోచిన
రాజులమంచివలనఁ బోనాడిన ధనమదంబుచేత నైనఁ బశుకృషిరత్నధనధాన్యాం
దోళికా చ్ఛత్రచామరదంతితురగభూషణ చీనిచీనాంబర పుత్రపౌత్రమహదైశ్వ
ర్యంబులఁ గన్నుగానక మేనఱికంబు ద్రోసినఁ బరులకిచ్చిన యితరకన్యకం బుచ్చు
కొన్నఁ గన్యకజనకునకు వరునిజనకుండు లంచంబు నొసంగి సమ్మతిపడి యొసఁగితి
మనిన వరునిజనకునకుఁ గన్యకజనకుండు లంచం బిచ్చి యుభయుల మేకమైతి మని
కలసి మేనఱికంబు ద్రోసినఁ గన్యకకు వ్రణంబు లెంచిన వరుండు రూపరి గాఁ
డని మేనఱికం బైన సమ్మతింపదని లాఁతివారల వివాహంబు చేసిన వంతువరుసలు
దప్పించి మేనఱికంబుఁ బుచ్చుకొన్న శకునంబు గాదని కన్యక సురూప గాదని
విడచిన నేవిధంబున నైన మేనఱికంబు దప్పించిన పాపాత్ములకు గురుదూషకులకుఁ
గులదూషకులకుఁ బితృమాతృద్రోహులకు నాజ్ఞ సేయఁదగు నాయాజ్ఞాక్రమం
బెట్టిదనిన వినుండు బుత్త్రయంబు నాజ్ఞయును వెనుక భాస్కరాచార్యులకు నగ
రమువారికినిఁ గులబాహ్యం బైన యాశిక్షితుండు సాష్టాంగదండప్రణామంబు చేసి
సర్వాపరాధక్షమ చేయవలయు నని ప్రార్థించిన వానికిఁ బ్రతిక్రియ చేసెడుక్రమ
ము భాస్కరాచార్యులముద్ర బ్రాహ్మణులవెంటఁ గొనిపోయి కాశీగయాప్రయాగ
స్నానంబు లాచరింపంజేసి పంచగవ్యప్రాశనంబు చేయింపవలయుఁ దత్క్రమం
బెట్టిదనిన మొదటిదివసంబున నుపవసింప జేసి గోమయాహారంబు సేయించి నూఱు
గోదానంబు లలంకారసహితంబుగాఁ జేయించి సహస్రబ్రాహ్మణభోజనంబు
చేయించి యారాత్త్రి రామకథలు వినుచు జాగరణంబు చేసి రెండవదివసంబున సంక
ల్పయుక్తంబుగా గంగాస్నానంబు చేయించి పంచదశగోదానంబు లలంకారపూర్వ
కంబుగా బ్రాహ్మణుల కిప్పించి పంచశతబ్రాహ్మణభోజనంబు గావించి గోమూత్రం
బాహారంబుగా నారాత్త్రి శివస్మరణ చేయించి జాగరణం బుంచి మూఁడవదివసం
బున గంగాస్నానంబు చేయించి యిరువదియైదుగోదానంబులు నిన్నూటయేఁబం
డ్రుబ్రాహ్మణులభోజనము చేయించి గోక్షీరం బాహారంబుగా నారాత్త్రి భాగవతపు
రాణంబు వినుచు జాగరంబుండి నాలవదినంబున మృత్తికాస్నానంబు చేయించి
గోదానంబులు సేయించి బ్రాహ్మణభోజనంబు సేయించి గోదధ్యాహారంబు గొనిపిం
చి పంచమదివసంబున సర్వప్రాయశ్చిత్తంబు సేయించి సాలగ్రామదానంబు లిప్పించి
బ్రాహ్మణభోజనంబు గావించి గోఘృతం బాహారంబు గావించి భగవన్నామసంకీర్త
నలచే జ్ఞానియై గురూపదేశంబున నారాత్త్రి జాగరణంబు చేయించి యాఱవదివసం
బునఁ బంచగవ్యస్నానంబును హోమంబును జేయించి పిష్టాహారంబుగా జాగరణంబు
సేయించి యేడవదివసంబున సుగంధస్నానంబు చేయించి బ్రాహ్మణులకు శివలింగం
బులు దానంబు లిప్పించి భస్మధారణంబును ముద్గభక్షణంబును జేయించి శివపురా

ణంబు వినుచు జాగరణంబు సేయించి యష్టమదివసంబున గురుప్రార్థనమహాసంకల్ప
పూర్వకంబుగాఁ బుష్పఫలజలస్నానంబులు చేయించి బ్రాహ్మణభోజనశేషం
బైనయన్నంబు నిడి యారాత్రి రామచరిత్రంబులు వినుచు జాగరణంబుంచి మఱు
నాఁడు గంగాస్నానంబు లాచరించి భాస్కరాచార్యముద్రాముద్రితుం డైనబ్రా
హ్మణునితోఁ గదలి స్వగ్రామంబు ప్రవేశించి భాస్కరాచార్యు లైన కులస్వాము
లకు దండంబులు పెట్టి వారియనుమతి నగరేశ్వరజనార్దనవింధ్యవాసినికోనకమల
వాసవకన్యకాబాలనగరంబులకు మహోత్సవంబులు గావించి నగరేశ్వరునకుఁ బ
డెండుమణుఁగులకంచుడు భాస్కరాచార్యులకు గురుదక్షిణగోదానంబు నిరువదై
దోసంగి బ్రాహ్మణభోజనం బొనర్చి కులస్వాములకు భోజనంబులు చేయించి గురు
వులయనుమతిని లవణంబును దధియును దాను వడ్డించి వారలయనుమతి బంక్తిభో
జనంబు చేసి గురువులచే గంధాక్షతతాంబూలంబులం జేకొని సభకుఁ బ్రదక్షిణ
దండంబు లాచరించి వారియనుమతి సుఖంబుండవలయు నిట్లు మేనరికంబు దప్పిం
చిననారికిని దప్పినవారికి సీవిఘంబున నాజ్ఞ నడిపింపనివైశ్యులు నిర్మూలులై లో
కాపకారులై యుందు రని చెప్పి మఱియును. 70

సీ. మొదమున వరునిది మొదటిగోత్రంబును కన్యకతండ్రినిగన్నతల్లి
పుట్టింటివారిది పొందుగమూఁడును దనరంగఁ గూడినమనమరాలు
బాలిక జనయిత్రి మూలగోత్రంబును బాలుని మూఁడును లీలఁ దల్లి
యాను వారిద్దఱ లది పిన్నవానిది రెండును బడుచుది ప్రేమ మూఁటఁ
గీ. బెరసి మఱియొక్కటైనను బిడ్డవావి, కూఁతువానిది రెండోది కోర్కె లలరఁ
కొడుకువావిది రెండోది కూర్మియలర, నేకమగుసేని యావావి యత్రయగును. 71

గీ. రెంట మూఁడింట గోత్రంబు లొంటి వైనఁ, బ్రవర యైనను బంధుల ప్రవరయైన
వరుసతోడుతఁ జేయంగ వావి గాదు, కన్య నీకున్న మిగులఁ బుణ్యంబు గలదు.

గీ. పితనుగోత్రంబు మిగులను బెంపు మీఱఁ
జేయరా దంద్రు మిగులసంచితము గాఁగఁ
గన్యగోత్రంబుమిగులను గ్రమముతోడఁ
బురుషగోత్రంబు మూఁడుగాఁ బొందియున్న
మిథునసమ్మతి మొదలను మేలు చేయు. 73

గీ. పిన్నవానిది రెండోది పిన్నపడుచు, వారిగోత్రంబు మొదటిది వరుసతోడ
మఱఁదలకుఁ బెండ్లికొడుకునకరయ నధియుఁ, గుతుకముననిట్టు సెట్టనఁ గోడలగును. 74

వ. మఱియుఁ గులాచారధర్మంబు లనేకంబులు గలవు. ఋతుకాలపద్ధతియు గర్భా
ధానాదిషోడశకర్మంబులును యజనాదికర్మత్రయంబును గృషివాణిజ్యగోరక్షణ
వృద్ధిజీవనంబులును సత్యసంతానధర్మవిశేషంబులును మొదలుగాఁగల వైశ్యకుల

ధర్మంబులు సమస్తంబునుం దెలియంజెప్పి యనంతరంబ భాస్కరాచార్యుల నవ
లోకించి వైశ్యు లిట్లనిరి. 75

ఉ. మీరు మహానుభావులు సమిద్ధవచోవిభవాభిరాము లిం
పారఁగ వైశ్యవంశము మహాత్మత వృద్ధి వెలస్ప జీవనల్
ధీరత నిచ్చి గోత్రశతదీప్తయశస్థితిశీలమూల మై
వీరత లుల్లసిల్లఁగఁ గవిత్వకృతిం గృతిసేయు టొప్పగుక్. 76

క. మును మా పెద్దలచరితము, మునిసాలంకాయనుండు మునమునఁ జెప్పెక్
ఘనముగఁ దత్కృతి పొందుగ, ననుగుణముగఁ జేసి చెప్పఁ దాంధ్రోక్తిదగిక్.

వ. అని చెప్పి భాస్కరాచార్యులకు సబహుమానంబుగాఁ గర్పూరతాంబూ
లంబు లొసంగి తమకుం గలసమస్తధనంబులు బాలనగరంబుల కొక్కభాగం
బును దేవతాగారంబులకుఁ దటాకంబులకు నొక్కభాగంబును విద్వజ్జనకవిగాయక
జనంబులకు నౌచిత్యంబుగా నొక్కభాగంబునుగా నిచ్చి యివ్విధంబున నెప్పటి
యట్ల నడపుం డని బాలనగరంబుల కొప్పగించి భాస్కరాచార్యులకు జాహ్నవీ
తీరంబునఁ దామరవాడ యనుగ్రామం బగ్రహారంబుగా నిడుం డని చెప్పి పెను
గొండలో నర్ధాంశంబు తత్పురదేవతామహోత్సవంబున కొసంగి మిగిలినయర్ధం...
గులగురువు లైన పండితవర్గంబుల కిమ్మని పురమధ్యంబున శాసనస్తంభంబు నిలిపి
భాస్కరాచార్యులకుఁ దామ్రదానశాసనపత్రిక లిఖయింపం జేసిరి. తత్క్రమం
బెట్టిదనిన. 78

శ్లో. స్వస్తి శ్రీనగరేశకోనకమలా శ్రీవింధ్యవాసీ జయా
శ్రీవత్సాంకజనార్దనశ్చ సువిశో విఘ్నేశ్వరః శ్రీనిధిః
సూర్యేంద్వారబుధేజ్యశుక్రరవిజస్వర్భానవః కేతవః
సాన్నిధ్యం పెనుగొండపట్టనవరే కుర్వంతు దీర్ఘాయుషః.

శ్లో. కల్యాద్యబ్దగణేఽష్టనేత్రరసష్ట్కసంఖ్యాగతే వత్సరే
ప్రాప్తేదే ప్రభవే తపస్యపి సితే పక్షే ద్వితీయాగురౌ
ఆర్యా భాస్కరపండితాదిధరణీబృందారకేభ్య స్సదా
ప్రీత్యాష్టాదశపట్టనాధిపతిభిః దత్తం శుభం శాసనమ్.

శ్లో. గృహేగృహే విశాం వర్షే వర్షే ద్వాదశగోత్రిణామ్
వివాహేచ వివాహేచ శ్రీమత్సీమంతకర్మణి
పుత్రే పుత్రే సముత్పన్నే కన్యాయాం జన్మజన్మని
గద్యాణి కం తదర్థంచ గద్యపద్యాదిసత్క్రియాః.
శాంతికే పౌష్టికే చైవ పైతృకే వృద్ధికర్మణి

అన్యస్మిన్ పుణ్యకాలే చ గ్రహణే చంద్రసూర్యయోః
లక్ష్మీనారాయణానంతవ్రతాదిషు సమంతతః
గోత్రప్రవరవిజ్ఞానే కులనిర్వాహకర్మణి.
ప్రతిజ్ఞైషాం కృతా వైశ్యాః స్తస్మాత్పండితఆశ్రయః
యథాకాలం యథావిత్తం యథాదేశం తథాచరేత్
విత్తశాఠ్యం నక్రియేత విఫలే ఫలకాంక్షిభిః
అకృత్వా సత్క్రియా న్మూఢో నరకే పరిపచ్యతే.
పురాణోక్తప్రకారేణ కృతవాన్ ధర్మచింతయా
ఆయురారోగ్య మైశ్వర్యం పుత్రపౌత్రప్రవర్ధనమ్
ఐహికాముష్మికం చైవ లభతే నాత్ర సంశయః
పూర్వాశ్రితాన్ పరిత్యజ్య సమీపస్థాన్ కులాగతాన్
యో దదాత్యన్యవిప్రేభ్యస్తద్దానం నిష్ఫలం భవేత్
ఇత్యుక్త్వా తే విశ స్వస్య పుత్రాన్ ధర్మపరాయణాన్
భాస్కరాచార్యపూర్వేభ్యః ప్రదదు ర్ధర్మశాసనమ్,
కులోద్ధరణ చారిత్రాన్ బ్రాహ్మణాన్ శృణుయాత్సుధీః.
పాషండాః పతితాః శ్శూద్రాః మద్యపాయ్యంత్యజాతిభిః
న శ్రోతవ్యా కథా స్సాకం తేభ్యో దానం నదాపయేత్
స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనే
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్. 81

సీ. ముదమొప్పఁ గల్యాణమున నైదువిందులు వేర్వేఱ నొక్కొక్క పెద్దమాడ
వరుస సీమంతోత్సవమునను వరహాయుఁ దనయుఁడు గల్గఁ బ్రతాప మరయఁ
బుత్రిక జనియింపఁ బొలుపార ధరణంబుఁ బ్రదమూర్తవంబునఁ బరఁగఁ జలిపె
వ్రతపితృకార్యదైవతమహోత్సవములఁ గర్తలు మీఱ విఖ్యాతమునను
తే. గట్టిగా వర్తనలు దప్పినట్టివారు, ఘోరరౌరవనరకాలఁ గూడి మునిఁగి
పెక్కువర్షంబులెంతయుఁ బెంపుచెడుచుఁ, బుడమిబహుపాతకంబులఁ బొందువారు.

సీ. భాస్కరపండితప్రముఖసంఘముతోడ వినుఁ డంచు వైశ్యు లిట్లనిరి మఱియు
మావంశచరితంబు మహిలోన వెలయించి పుత్రులరీతిని బొందఁ జేసి
పితృదేవతోత్సవవ్రతశుభములయందు వర్తనల్ గైకొని కర్తలగుచు
నెవ్వరి వర్జింప కేఁటేఁటఁ దప్పక గురుపూజ సేయించుకొనుచు నాజ్ఞ
గీ. సీమలకు నెల్ల వెలయ సుక్షేత్రలతోడ, బాలనగరాల దీపించి ప్రబలఁ గోరి
ప్రవరలెఱిఁగించి కల్యాణపరులఁ జేసి, ధాత్రి వెలయింపుఁ డాచంద్రతారకముగ.

వ. అని యివ్విధంబున శాసనంబు లిచ్చి బాలనగరంబులం జూచి యిట్లని రయ్యా! మీర లీగురుభాస్కరాచార్యుల ననుదినంబును బూజించుచు వీరియాజ్ఞానుసరణంబున నడువగలవార లనిచెప్పి యనంతరంబ తలవరులం జూచి మీర లీనగరేశ్వరదేవాలయంబునకుఁ బడమర మిఱ్ఱుపల్లంబులులేని సమస్థలంబున గుండంబు లాయత్తంబులు సేయుం డనిపలికిన వారు భయంబంది మెల్లనచేరి వైశ్యుల పాదంబులు పట్టుకొని దండంబు లిడి యిట్లని విన్నవించిరి. 84

గీ. మీరు పెంపఁ బెరిఁగి మీపాదపద్మంబు, లనుదినంబుఁ గొలిచి యధికమమతఁ
బొదలి యింక మీరు పోఁగ ముక్తికి నేగ, నిచట నుండ నొల్ల మెట్టు లయిన.

వ. అని యనేకవిధంబుల విన్నపంబులు చేసికొని వారలయనుమతి వడసి వెంటఁ జనుటకై వీరకంకణంబులు ధరియించి గుండంబులు ద్రవ్వి యలంకరింపం జేసిరి. 86

సీ. పన్నీరుచిలికినపచ్చనైనజవ్వాది కలపినమృగనాభికర్దమంబు
కలయంగనలికినఁ గమనీయమై మించు గుండంబులో మేటికొమరుమిగులఁ
బత్పార్శ్వసంధులఁ దద్దయు మెరుగా వివిధమౌక్తికరత్నవితతి దనర
రంగవల్లులఁ దీర్చి శృంగారభంగులఁ బటుతరస్ఫురణలు పరిఢవిల్ల

తే. గంధసారద్రుమంబులు ఘనత మెఱయ, గుండములనిండఁ బఱపుచు దండిమిగులఁ
జల్లికర్పూరతైలంబు చతురగతులఁ, గప్పి రంతటఁ గర్పూర మొప్పు మిగుల. 87

వ. ఇవ్విధంబున నలంకరించుచు నానాచిత్రవిలాసంబు లలర మహోన్నతంబు లగుతమకంబులు ముప్పిరిగొనఁ జిత్రవస్త్రతోరణ రంభాస్తంభగుగ్గులు దీపనివారంబుల నొప్పంజేసి యాసమయంబున వైశ్యులు తమకులాంగనలం గని యిట్లనిరి. 88

క. వాసవకన్యాసహితము, గా సరభసవృత్తి మీఱు ఘనశృంగారో
ల్లాసిత లై యుండుఁడు సం, త్రాసానలకీలలకును దార్కొనవలయున్. 89

వ. అని సాధ్వీసముదయంబులకుం జెప్పి తదనంతరం బావైశ్యవరులు వీరవ్రతంబులు ధరియించి పరమోత్సాహంబున నిట్లనిరి. 90

చ. మనమతిధైర్యవంతులము మానకమానకఠోరవీరతన్
జనులు నుతింపఁ బూనితిమి సాహసవైఖరిఁ జెప్పఁ జిత్రమై
కనలెడునగ్నికుండములఁ గ్రక్కున వచ్చి యనువ్రజంబులం
దనరి శివార్పణం బనుచుఁ దద్దయుఁ బూనిన సాహసక్రియన్. 91

మ. విని యెబ్భంగిఁ దలంచునో నయగతి స్వీక్షించి యవ్వాసవి
న్మనమారం గడు నూఱడించి తలఁపు ల్మానావచోయుక్తులన్
దనర న్నారసి నేర్పు పెంపున మహాధైర్యప్రతాపస్థితుల్
ఘనమౌచిత్తముసంఘటింపవలయుం గైవల్యసంసిద్ధికిన్. 92

వ. అని మఱియు నెఱుంగ కంటిమిగాక యవ్వాసవిచిత్తంబును నతిసాహసక్రియ
యును మన మెఱుంగుదుమె కద యిదియ మృదుమధురవాక్యంబుల ననునయింపు
మని కుసుమాఖ్యుగృహంబున కనిచి బాలనగరంబులు జూచి పురంబుల శృంగా
రంబు సేయింపుం డనిన వారలు తత్క్షణంబ. 93

గీ. పురము వేడ్క నలంకారములు దనర్పఁ, దమచమత్కృతి నత్యాపరమును మెఱయ
సకలవస్తువితాన సుసంగతముగఁ, జేయుచుండిరి విమలసుశ్రీలు చెలఁగ. 94

వ. అంతఁ గుసుమాయుధుండు నిజమందిరంబునకుం జని పుత్రియైనవాసవి నవలోకించి
యిట్లని విలపింపం దొడంగె. 95

శా. నీరూపంబును నీదుమంచితనము న్నీ నేర్పు నీముద్దులున్
నీగమ్యం బగు రాజహంసగతియు న్నీరాజబింబాస్యమున్
న్నీరత్నావళిహారశోభిగళము న్నీమందహాసంబు నిం
కేరీతి న్మఱవంగవచ్చుఁ జెపుమా యేణాక్షి యోవాసవీ. 96

సీ. పాండవవంశసంభవుఁ డగువిష్ణువర్ధనుఁ డేల ధాత్రికి దండు వెడలె
విమతులఁ బరిమార్చి విజయంబుఁ గైకొని లీలతో మనపురి కేల వచ్చె
వచ్చిన మనమేల వరుసతో నతనికిఁ బొడసూపితిమి పరిస్ఫురణమెఱయ
మనతోడఁగూడ సమ్మదలీలతో వచ్చె నీకన్య మున్నతఁ డేల చూచెఁ

తే. జూచి మోహనలీలల సొబగు మీఱఁ, దేలకల్యాణ మగఁ గోరి యిచ్చ నుబ్బె
నింతయును విధివశము గా కింతవట్టు, మనలఁ బ్రేరేఁచుదురితకర్మంబుకతన. 97

చ. సతతము పెక్కుదానములు సద్ద్విజకోటికి నిచ్చి సూనృత
వ్రతము లొనర్చి ధర్మము లవారణలీల ఘటింపఁజేసి శా
శ్వతబహుభోగసంపదలఁ జాలఁగఁ గైకొని నిన్నుఁ బుత్రిగాఁ
జతురతఁ గంటి నోసరసిజాతవిలోచన వాసవాంగనా. 98

వ. అని పలికి. 99

క. అప్పుడు శోకభరంబున, ముప్పిరిగొనిఁ గుసుమసెట్టి మోహాపుఁబుత్రిం
దప్పక చూచి కలంగుచు, నప్పంకజగర్భు దూఱె నకటా యనుచున్. 100

సీ. కన్య నాయుఃక్షీణఁగా మత్కులంబునఁ బుట్టింపఁ దగునె యంభోజగర్భ
బాలాలలామను భర్తృశూన్యనుగాఁగఁ గావింపఁ దగునె యోకాలకంఠ
పుత్రికారత్నంబు భోగభాగ్యశ్రీలఁ బాపంగఁ దగునె యోపద్మనాభ
యీపుష్పకోమలి నెట్లు నిర్దయుండవై యాహుతిఁగొనియెద వహ్నిహోత్ర

తే. దేవతతులార రవిసుధాదీప్తులార, యక్షపన్నగఖేచరాధ్యక్షులార
మానివరులార భూనభోమాన్యులార, దయదలంపక యిటు చేయఁదగునె మీకు. 101

వ. అని పెక్కువిధంబుల నక్కమలగర్భముఖ్యులం దూఱి శోకవిహ్వలహృదయుం డగుచు నక్కన్యామణిరూపంబుఁ దనమదిం దలపోయుచు మూర్ఛిల్లి యొక్కింత సేపునకు సేదదేఱి తన కెదురుగా నేతెంచిన యక్కన్యారత్నంబు నెత్తుకొని కూర్చుండి తనతొడలపై నిడికొని తేఱిచూడఁజాలక చూచినయెడ దృష్టితాఁకునో యని కలంగుచుఁ బలుమఱు తల నిమురుచు నెట్టకేలకుఁ గన్యామణి విన నిట్లనియె. 102

శా. తల్లీ వాసవి వాసవాంగన మహైశ్వర్యప్రతాపాఢ్య సం
ఫుల్లాంభోజవికాసితాస్య నిను నాపూర్వాదిభాగ్యంబునం
దెల్లం బైనముఖంబునన్ సుకృతినై తేజంబునం గాంచితిన్
ముల్లోకంబులఁ గీర్తి నించితి జను ల్మోదంబునం జెందఁగాన్. 103

క. నగరంబునఁ గలవార్తలు, నగరస్వాముల ప్రతిజ్ఞ నానావిధము
ల్తెగిననృపాలునితలఁపును, నగణితముగ నెఱుఁగుదమ్మ యంభోజముఖీ. 104

క. మన మేమితలఁచుచుండఁగఁ, దనరారఁగ దైవ మేమి తలఁచునొ పిదపన్
మనుజాధిపుఁ డివ్విధమునఁ, గొనకొని యన్యాయకార్యగోచరుఁ డయ్యెన్. 105

ఉ. నిన్నదె పట్టితెత్తు మని నిర్దయవృత్తి నృపాలసద్భటుల్
పన్నుగ వచ్చినారు కులపావని వాసవి నీమనంబున
న్విన్నఁదనంబు నొంపక వివేకముపొందుమ ధీరచిత్తవై
సన్నుతకీర్తి నొందవలె సమ్మతి నొక్కతలంపుఁ జెప్పెదన్. 106

వ. అనుచు నక్కుసుమవిభుండు దుఃఖార్ణవంబున మునింగి. 107

గీ. చెప్పలేక కలఁగుఁ జెప్ప నుద్యోగించుఁ, జెప్ప నేటికనుచుఁ జెప్పకుండుఁ
జెప్పకున్న బాలచిత్త మెట్లుండునో, చెప్పవలయుననుచుఁ జెప్పఁదొడఁగె. 108

సీ. విష్ణువర్ధనుఁడు పృథ్వీతలేంద్రుల నెల్ల నని గెల్చి మనవీటి కతఁడు వచ్చి
నిన్ను నిమ్మని పట్టి నిగ్రహింప మహోగ్ర బహువిధంబుల మమ్ము బాధచేయ
మానంబుఁ బాటించి మనకులస్వాములు ప్రాణంబు విడిచి యేఁ బ్రతిభ దనర
వంశసత్కీర్తులు వసుధలో నెగడంగ నగ్నిప్రవేశంబు లర్థిఁ జేసి

తే. ముక్తిఁ బొందఁ దలంచిరి మోదమలర, నీసహాయం బపేక్షించి నిత్యపదము
గలుగు నిట్లని కులమువారలు దలంచి, పలుకు మని నన్నుఁ బంచిరి పలుకులెల్ల. 109

వ. అని కుసుమవిభుం డవరిపడఁ బల్కిన విని యతనిసాధ్వి యైనకుసుమగంధి శోకపరవశ యై మూర్ఛిల్లి కొంతతడవునకు సేదదేఱి తనముద్దుఁగూఁతు నెత్తికొని పురపురం బొక్కుచు గద్గదస్వరంబున నిట్లనియె. 110

ఉ. నోములు సద్వ్రతంబులును నూతనభంగి నొనర్చి భామినీ
స్తోమము మెచ్చ మాసములు తొమ్మిది మోసియు నిన్నుఁ బుత్త్రిగా
నేమముతోడఁ గాంచితిని నీరజలోచన మమ్ము డించి నీ
వేమని యగ్ని కాహుతిగ నేగెదు మా కెఱుఁగంగఁ జెప్పుమా. 111

క. నినుఁ గొడుకుపగిదిఁ గంటిని, వనజారికలావతంసువరమున నీవున్
వినయా సౌభాగ్యంబున, జనియించితి నిన్ను సర్వజనులు నుతింపన్. 112

సీ. పైఁడిగిన్నెలలోనఁ బాలు నేయును బోసి పంచదార యొకింత మించ వేసి
బహువిధంబుల జోలవాడుచుఁ ద్రావింతు నీముద్దుపలుకుల నేర్పు మెఱసి
విందు నెయ్యముతోడ వీనులకింపుగాఁ గలసి చరిత్రలు కలికి మతులు
వీక్షించి హృదయారవిందంబులోపల నానంద మొందుదు నద్భుతముగ
తే. నెట్లు నిన్నగ్నికీలల నెఱియ ధాత్రి, యందు నొప్పింతు నక్కటా హరివిరించి
ముఖ్యులేటికిఁ దెలియరో ముగ్ధ నీదు, మృదులభావంబుఁ దలపోసి మదినివగతు.

గీ. పుత్త్రకామేష్టి చేసి శంభుని గుఱించి, తనయగాఁ గంటి నిన్ను వృద్ధాప్యమునను
అకట! నీమేలు చూడలేదయ్యెఁ బిడప, నట్టిసంతోష మెక్కడ నణఁగెఁ జెపుమ.

వ. అని యిట్లు పరమదుఃఖితు లై యున్నతల్లిదండ్రులం జూచి వాసవకన్యకా సహో
దరుం డైననిరూపాత్ముం డిట్లనియె. 115

సీ. ప్రియము రెట్టింపంగఁ బెంచితి విన్నాళ్లు మాత నిన్నెట్లు నే మఱతు నమ్మ
నిఖిలవిద్య లెఱుంగ నేర్పినతండ్రివి కడువేడ్క నిన్నెట్లు విడుతు నయ్య
అభివాంఛితంబు లిమ్మనియెడు చెల్లెలి నింక నే నెవ్వరి కిత్తు నమ్మ
వేడ్కతో నను గారవించుబంధువులార వంతతో నెట్లు వేగింతు నయ్య
తే. యనుచుఁ బలుమాఱు వేర్వేఱ నాత్మఁ దలఁచి, ఘనతరం బైనదుఃఖాబ్ధిమునిఁగి లేచి
వేయుభంగులఁ దాఁ బలవింపఁ దొడఁగె, నంతకంతకు నానిరూపాత్ముఁ డెలమి.

వ. అనంతరంబు కుసుమాఖ్యుండు కూఁతుం గనుంగొని యనేకవిధంబుల దుఃఖించి
గద్గదకంఠుం డై మఱియు నిట్లనియె. 117

మ. అనలజ్వాలలఁ జొచ్చునప్పుడు మహాహంకార మేపారఁగా
జను లత్యద్భుతభంగిఁ జూడఁ గడఁకన్ సంరంభజృంభాత్ము లై
ఘనభక్తి న్మది శంకరుం దలఁచుచుం గారుణ్యభావమ్మునన్
మన వైశ్యాన్వయ మెల్లఁ బావనముగా మన్నించి రక్షింపుమీ. 118

క. సివలనను మనవంశము, ధీవినుతం బై ధరిత్రిఁ దేజం బెసఁగం
బావకశిఖలను భీకర, భావంబులు గాఁగఁ జూచి భయమందకుమీ. 119

వ. అనుచు ననేకవిధంబుల బోధించుచు శోకవివశుండై యుండె నంతఁ గుసుమగంధి యు దుఃఖార్ణవమగ్న యైయుండె నయ్యవసరంబునఁ దల్లిదండ్రులను సహోదర బాంధుజనులం జూచి యూఱడించుచు వాసవి యిట్లనియె. 120

శా. ఏలా యజ్ఞులరీతి మూఢమతులై యిబ్భంగి శోకించుచున్
జాలిం బొందకుఁ డింక నన్నుఁ గదకఁ న్సంరంభజృంభంబునన్
బాల న్నుగ్రతఁ బట్టితెం దనునృపున్ వైశ్వానరాభీలమై
కాలోగ్రం బగుశాపఖడ్గమున నే ఖండింతుఁ దత్కంఠమున్. 121

ఉ. మీకు విచార మేల బలిమిం జననాథునిభృత్యు లుగ్రులై
చేకొని పట్టవచ్చినఁ బ్రసిద్ధఘనప్రతిభాగ్నివీక్ష ల
స్తోకగతిం దనర్ప భయదుస్సహశాపమహావిజృంభణ
న్లోకము లెల్ల మెచ్చ భటలోకము నుగ్రత భస్మ మేర్చెదన్. 122

చ. జ్వలదనలోగ్రకుండమునఁ జయ్యనఁ జొచ్చి యసువ్రజంబుల
న్వెలయ శివార్పణం బనుచు విశ్రుతభక్తి నొనర్చి శంభునిం
గొలిచి వణిక్కులంబుఁ దగఁ గుంభినియం దతిపావనంబుగాఁ
నలరఁగ మీకుఁ బుణ్యగతు లచ్చుగ నిచ్చిన మెచ్చరాదొకో. 123

చ. వగపున కేమికారణము వైశ్య లనాథ లటంచుఁ గొవ్వనం
బగఁగొని భూతలాధిపుఁడు పాపమునేసిన నెవ్వరడ్డ మీ
జగతిని జావులేనిమనుజవ్రజముంగలదే వణిక్కులం
బగణితకీర్తి నొంద నృతు లచ్చుగ నిచ్చెద దుఃఖ మేటికిన్. 124

క. ఏమియు నెఱుఁగని మూఢత, నే మతి సంసారదుఃఖ మేలా త్రవ్వన్
భూమిని మును జనువారలు, నేమంబున జగతి నుండనేరరె చెపుఁడా. 125

గీ. లేజ మొనరించి సుజ్ఞానదీపలక్ష్మి, చేత నజ్ఞానతిమిరంబు చెండి వైచి
శ్రీమహాదేవుఁ గైలాసశిఖరివాసు, నెలమి మెప్పించి కైకొందు నిష్టసిద్ధి. 126

చ. నలపురుకుత్స చంద్రసుతనందన రంతిగయాంబరీషరా
ములు శశిబిందుపంక్తిరథముఖ్యధరాతలనాథు లోలి దో
ర్బలయుతు లై మహీతలము పాలన చేసిరి గాక కాలముం
గెలువఁగ శక్తులై రె మది ఖేదము నొందకు తండ్రి యెంతయున్. 127

వ. అనుచు ననేకవిధంబుల నావాసవకన్యాలలామంబు పూర్వకథావిశేషంబుల జ్ఞాన వైరాగ్యంబు లుపదేశించుచుండె నంత నబ్బాలనగరంబులు పురంబు సముద్భట చటులవీరాలాపంబును నానాదేవతామందిరద్వారపంచమహావాద్యఘుమఘుమా యంబును వివిధమణిగణప్రయుక్తకనకధ్వజముక్తాఫలచ్ఛత్రచామర దివ్యాంబరవితాన

విరాజితంబును బుణ్యపణ్యవీథికాంగణకస్తూరికాజలసంప్రోక్షిత మణిరంగవల్లికావేల్లి
తంబును మధురసుధాధౌతశాతకుంభప్రభాధగద్ధగితభూనభోంతరాళంబును సదా
శివధ్యాననిష్ఠాగరిష్ఠవీరమాహేశ్వరసంకులంబును నై కైలాసనగంబునుంబోలె మె
ఱుంగులం బొదలి కీర్తిశ్రైశ్వర్యం బయ్యె నయ్యవసరంబున. 128

క. లలనలు వాసవకన్యా, నిలయమునకు నేగుదెంచి నియమవ్రతలై
చెలఁగుచుఁ బరమానందం, బులు మెఱయఁగ వెలయ సద్విభూత్యుపచర్తిన్. 129

సీ. మగువలు పన్నీట మజ్జనంబులు దీర్చి కమనీయచిత్రాంశుకములు గట్టి
కస్తూరిజవ్వాదికలపముల్ మైఁ బూసి ఫాలస్థలంబున బాగు మెఱయఁ
దిలకంబు లొగిఁ దీర్చి దివ్యభూషణములు కడు నొప్పమీఱ నంగమునఁ దాల్చి
చెంగల్వరేకులఁ జేమంతిపూవులు జడలందుఁ గొప్పుల సంతరించి
తే. తమ్మలమ్ములు సేయుచు దర్పణములు, మంచిఫలములు పాణిపద్మముల మెఱయ
నుడిసి బహువిధగంధము లొస్డుముట్ట, వాసవాంగనయింటికి వచ్చి రపుడు. 130

వ. ఇట్లు వచ్చిన. 131

క. కుసుమాంబ సంభ్రమంబునఁ గుసుమసుగంధులను జూచి కోరికఁ బలికెం
బొసఁగఁగ వాసవకన్యను, రసికశ్రీఁ గై సేసి రండు రాజితలీలన్. 132

క. అని చెప్పిన నాఁగాకని, యనురాగముతోడ నప్పు డంగన లెల్ల
న్వినయమునఁ గన్యకామణి, నెనయఁగఁ గైసేయఁ బూని రింపులు వెలయన్. 133

క. షంపంగినూనె శిరమున, సొంపునఁ గలయంగ నంటి జొబ్బిల మేనం
బెంపున మైమర్దనగా, వింపుచు నలుగొప్పఁ బెట్టి వేడుకతోడన్. 134

సీ. కస్తూరియును బచ్చకర్పూరమును గోవజవ్వాదియును మంచిచందనంబుఁ
బన్నీటఁ బదనిచ్చి పంకంబుగాఁ జేసి యంగుల నలకవి నమరఁబెట్టి
గంగాజలంబులఁ గలయ మజ్జనమార్చి పంచవర్ణాన్నంబు బడిసి వైచి
దివ్యాంబరంబుల దేహంబు తడి యొత్తి కుఱులు నున్నఁగ దువ్వి కొప్పు వెట్టి
తే. ధాళధళమగుబహుపుష్పదామకములు, నెఱయఁ గబరీభరంబున నిండఁ దుఱిమి
నొసల మృగమదతిలకంబు పొసఁగఁ బెట్టి, చెందుమణిదర్పణంబును జేతి కిచ్చి. 135

క. పాటీరగంధి కన్నులఁ, గాటుక నేరుపునఁ బెట్టి కనకమణిశ్రీ
తాటంకంబులు చెవులఁ బ, టాటోపంబుగ ధరించి రంచితలీలన్. 136

గీ. చెలఁగి కట్టాణిముత్యాలచేరుచుక్క, విశ్రుతం బైనసీమంతవీథియందు
నించి కోమలదివ్యమాణిక్య మైన, ముక్కఱ యపుడు నాసాగ్రమున నమర్చి. 137

సీ. పచ్చలకడియాలఁ బాణిపద్మంబులఁ గీలించి రత్నసంకీర్ణ మైన
బవిరెలు మృదుకర్ణభాగంబులను బెట్టి తారహారముల నూతనము లైన

పదకముల్ గళమున భాసురంబుగ వైచి భుజయుగంబున బాహుపురుల నుంచి
కటితటంబున రత్నకాంచికాదామంబుఁ జెలువొప్ప నమరించి చిత్రలీల

తే. నందెలును వీరమద్దియ లంద మైన, మెట్టెలను బెట్టి పిల్లాండ్లు మెఱయఁ బూన్చి
మేనఁ గస్తూరి గంధంబు మిగుల నలఁది, వాసవాంగన నప్పు డైసేసి కలిమి. 138

వ. మఱియు ననేకభూషణంబులు తొడిగిన నావాసవకన్యక చంద్రరేఖయుంబోలెఁ దేజరిల్లె నయ్యవసరంబున బాలనగరంబులు వసంతంబులు చేయించి యనంతరంబ కుసుమాంగనయును వాసవకన్యయును సెలవొసంగ వైశ్యకాంతలు నిజమందిరంబుల కరిగి. 139

గీ. దివ్యబహుగంధగంధితదీప్య మైన, చందనంబులు మేనులఁ జాల నలఁది
మల్లికాదిప్రసూనంబు లమితభంగి, నడర ధమ్మిల్లములయందు ముడిచి రంత. 140

వ. మఱియు ననేకవిధంబు లైన యంబరంబులం గట్టి దివ్యభూషణంబుల ధరియించి బాలనగరంబులఁ బిలిపించి వారల నాదరించి వసంతంబులాడుటకై యుద్యోగించుటయు వారలు పసిఁడి కొప్పెరల నిండఁ బన్నీరు నానావిధంబుల నించి వెండితొట్లలఁ గర్పూరతైలంబులును జాఁదుమొదలైనవస్తువులును బట్టించి మఱియును వసంతోచిత నానావిధద్రవ్యంబు లనేకంబులుగాఁ గూర్చి చిమ్మనగ్రోవులు మొదలైన యనేకచిత్రంబులు గూర్చి వసంతంబులకు రండని బాలనగరంబులు పిలిపించి రాసమయంబున. 141

శా. సాక్షాదాదిమలక్ష్మివోలె సుషమాసౌభాగ్యభాగ్యోదయం
బేక్షోణిం బ్రభవించె నొక్కొ శుభమత్తేభంబుఁ దానెక్కి న
స్వీక్షింప న్సతులెల్ల భవ్యతురగాస్వేతోత్తమారోహ లై
యక్షీణప్రభ లుల్లసిల్లఁగ మహాహంకార లై వచ్చినన్. 142

మ. కదలె న్వాసవకన్యకామణి మహోగ్రవ్యగ్రజృంభాత్మ యై
సుదతీసంఘము గొల్వ మాగధజనస్తోత్రంబు లేపారఁగా
విదితచ్ఛత్రపతాకచామరఘటా విభ్రాజమానస్ఫుర
న్మదధారాభినవానుమోదనటనామందామితానంద మై. 143

వ. అప్పుడు. 144

సీ. కర్మకుంభంబులఁ బట్టినపన్నీరు జిమ్మనఁగ్రోవులఁ జిమ్మువారు
ఘనచిత్రవేదికాకమనీయకర్పూర సిరములు వెదచల్లి చెలఁగువారు
మణిఘటసంపూర్ణమంజులమృగనాభిపంకంబు లోఁగి వేసి పరఁగువారు
బహుయంత్రదీర్ఘికాపరిపూర్ణచందనజలకేళి యందంద సలుపువారు

తే. గుంకుమ ప్రసూనాగరుఘుసృణసురభి, వస్తునిచయంబుఁ బగఁ జల్లువారు నగుచు
నవ్యకాంతావణిగ్బాలనగరవరులు, గొలువ నేతెంచె వీథులఁ గువలయాక్షి. 145

సీ. అలరఁగఁ బంచమహాశబ్దములు మ్రోయ వివిధభంగులరాజవీథి నేగి
రాజిల్లు నగరేశ్వరస్వామిఁ బూజించి తాత్పర్యమున జనార్దను భజించి
వేడుకతోఁ జని వింధ్యవాసిని గొల్చి కడుభక్తితోఁ గోనకమల కెఱఁగి
కొదవ లేకుండఁగఁ గొఱఁతనోములు నోఁచి ధారిణీసురులకు ధనము లొసఁగి
తే. యిష్టబంధుజనంబుల కిచ్చితార్థ, సంచయము లిచ్చి యర్థులఁ జాలఁ దనిపి
తమ్ము నెప్పుడు దయతోడఁ దలఁపుఁ డనుచు, బాలనగరాల దీవించి ప్రబలఁగోరి.

శా. ఆకన్యామణిఁ జూచి వైశ్యవరు లత్యాశ్చర్యముం బొందుచు
న్లోకశ్లోకశుభాశక్తినిత్యకరుణాలోలాత్మ లై యుబ్బుచున్
శ్రీకీర్తిస్థితిగా నెదుర్కొని బహుశ్రీవాహనారూఢులై
భూకంపంబుగ వీథుల న్మెఱయుచుం బుష్పావళుల్ జల్లుచున్. 147

చ. తరుణులుఁ బ్రాణవల్లభులుఁ దక్కినచూపఱు లుల్లసిల్లుచు
న్వరుస వసంతము ల్సలిపి వాసవకన్య సఖీజనంబులు
న్సరసవచోవిలాసముల సంభ్రమ మొప్ప ననుగ్రహించుసొం
పరుదుగ వింధ్యవాసినిగృహంబున కేగె నుదారమూర్తి యై. 148

సీ. అమ్మహాశక్తికి ననురక్తితో మ్రొక్కి విధిపురస్సరముగా వినుతమహిమఁ
గొఱఁతనోములు నోఁచి కొమరొంద సఖులకుఁ దద్వ్రతశుభపదార్థంబు లొసఁగి
యిల బాలనగరాల బలుమాఱు దీవించి చిరవృద్ధి నొంద నాశీర్వదించి
ప్రాణవయస్యలఁ బలుమాఱు వేర్వేఱఁ బిలిచి కౌఁగిటఁ జేర్చి ప్రియము చెప్పి
తే. తొరఁగుబాష్పాంబుధారలఁ దుడిచి మిగుల, నూఱడించుచు నేర్పుల నొకరి కొకరి
నప్పగించుచు నియతితో నాదరించి, వెలయ దీవించి మన్నించి వేడ్క లలర. 149

సీ. శ్రీజనార్దనమహాశ్రీనగరేశుల నతిభక్తిఁ బూజింపుఁ డనుదినంబు
భాస్కరపండితప్రముఖపురోహితవిభులఁ భావింపుఁడు వేడ్కతోడ
నారూఢిఁ గులధర్మమైనమేనఱికంబుఁ దప్పక నేయుఁ డుదారవృత్తి
ధీరతతోడ మదీయసంప్రీతిగా నుత్సవంబులు నేయుఁ డొప్ప మిగులఁ
తే. బుడమి దుర్జనసంగతి విడువవలయు, నిజకులాచారవర్తన నెఱపవలయు
ననుచు వాసవకన్యక యానతిచ్చి, చెలఁగి వైశ్యుల నెల్ల నాశీర్వదించె. 150

లయగ్రాహి. ఇందిరయుఁ బోలె మకరందజలభరిత మగు
కుందకురువిందములసందడిలకుండం
బొందుపడ చంద్రుకల నందముగఁ దుఱిమి జయ
ముంద్రి విభవం బెసఁగ దుందుభులు మ్రోయన్

సంపడిగ వాసవియు మందగతిఁ గదలెఁ జెలు
లందఱు భజింపఁ బెనుపొంద శుభలీల
స్వందిజనము ల్వొగడ సుందరులు చెలఁగ సుర
బృందములు చేరి దివి నొంది కడుఁ జూడన్. 151

వ. అప్పుడు నానావిచిత్రచినిచీనాంబరంబులు శుద్ధసువర్ణద్రవ్యంబులు నిష్కంబులుఁ బరిమళవస్తువిశేషంబులు వజ్రవైడూర్యగోమేధికాదినవరత్నంబులుఁ జేతులకొలఁది వెదచల్లుచు సురభిద్రవ్యంబుల వసంతంబు లాడుచు వింధ్యవాసినీనిలయంబు చేరి యమ్మహాశక్తికి షోడశోపచారంబులఁ బూజ లొనరించి కపలి మూలస్థానమల్లికార్జున శ్రీనగరేశ్వర శ్రీజనార్దనకోనకమలాదుర్గాదిపౌరదేవతానికాయంబుల బహువిధోత్సవంబుల బహువిధద్రవ్యంబుల నొసంగి వేదవేదాంతవేత్తలైనవిప్రులకు విద్యుక్తదానంబు లిచ్చి పెద్దలు కవిగాయకులు దీవింపఁ గులవృద్ధులైనవైశ్యసంఘంబులు గొలువఁ బెనుగొండపురంబునం గలుగునాబాలగోపాలంబుఁ జూడ నేతేర బాలనగరంబు లుప్పొంగుచు మహోత్సాహంబున నెచ్చరించునట్టిసమయంబున నవ్వాసవకన్యామణి మొదలైనవైశ్యసంఘంబులు భద్రదంతావళంబుల నెక్కి వందిమాగధులు కైవారంబు సేయ వికసితవదను లై కదలి శ్రీనగరేశ్వరనిలయంబునకుఁ బశ్చిమభాగంబున భద్రవేదికాస్థలంబున నవ్వాసవి నిల్చి సింహపీఠంబున వీరాసనాసీన యైననిజదివ్యదేహంబునఁ బ్రకాశమానం బగునట్లుగాఁ గన్యకుమారీశక్తి దంష్ట్రాకరాళాట్టహాసంబుతో ననేకాయుధంబులు ధరియించి యవ్వాసవి హృదయకమలంబుఁ బ్రవేశించినఁ దక్షణంబ దుర్నిరీక్షం బగుఫాలాక్షునిలలాటాగ్ని నిజరూపంబు ధరియించి ప్రబలభయంకరాకారంబుఁ జూపినట్లు విష్ణువర్ధనభూపాలునిమృత్యుదేవత కనిపించినరీతిని మఱియు శుంభనిశుంభచండముండరక్తబీజమధుకైటభులమీఁద భద్రకాళి కనిమసంగినచందంబున రాక్షసులమీఁద రఘురాముండు చూచుచుండ సీతామహాదేవి కవిసినవిధంబునఁ గ్రవ్యాదులమీఁదఁ గృష్ణుండు చూడ సత్యభామ రణంబునకుం దొడరినట్లు విష్ణువర్ధనమహారాజేంద్రు మీఁద నమ్మహావాసవాంగన దివ్యదేహంబున ననేకాయుధహస్తులై శివదూతలుద్భవింపం జూచి వారందఱు భయకంపితులై యుండి రట్టిసమయంబున వాసవి నలుదిక్కులు వీక్షించినమాత్రంబున వీరరసం బుప్పతిల్లఁ గనుదమ్ము లరుణకమలంబులై కనుపట్టె నట్టిసమయంబున వాసవి యిట్లనియె. 152

శా. కోపాటోపమహోగ్రమూర్తి యగుచున్ ఘోరాగ్ని వీక్షించుచుం
బాపాత్ముం డగువిష్ణువర్ధనమహీపాలుండు దుర్మార్గుఁడై
యీపుణ్యాత్ముల కిట్లు చేసె నకటా యొబ్బంగి ఖండింతు నా
కాపుండుం డగువానిమూర్ధము మహాకాలాగ్నిహోమంబునన్. 153

వ. అని వితర్కించి రఘురామబాణసమానం బైనవాక్యంబున నిట్లనియె. 154

ఉ. ఎవ్వఁడుఁ గన్యయు న్సతులు నీవణిగన్వయసత్యసంధులు
న్నివ్వగ నగ్నిజాలముఁ బ్రవేశము సేయుట విన్నమాత్రనే
తప్పక రాజుమస్తకము ధాత్రితలంబునఁ బెక్కువ్రయ్యలై
చెప్ప విచిత్ర మై పడుట సిద్ధ మటంచు శపించె సుగ్రశక్తిన్. 155

వ. మఱియుఁ దదనంతరంబునఁ గులవృద్ధు లైనవైశ్యులను భాస్కరాచార్యులను వే
ర్వేఱఁ బిలిచి బాలనగరంబులకు భాస్కరాచార్యుల నప్పగించి వారల విలోకించి
ప్రతిజ్ఞ మీఱ నిట్లనియె. 156

సీ. మదగజాకృతితోడ మట్టిమల్లాడుదుఁ బెనుగాలి నై వీచుఁ బెఱికి వైవ
బ్రహ్మరాక్షసి నయి బాధింతు వాకిలి విడువక శూలి నై మఱియుఁ జూతుఁ
గాళికాదేవి నై ఖండించి చంపుదుఁ గంగ నై ముంచుదుఁ గసిమసంగి
గరుడి నై మీఁది కెగిరినను బొరిగొందుఁ గ్రుంకిన మొసలి నై కుదియఁ జూతు
సింహంబుచంప మై చెండుదు నఖములఁ బులిరీతిఁ దమిరేఁచి పొరియఁ జూతు
వెలిగాఁడిపాము నై విషపఱుందుదు నింటఁ గంపు నై పెరుఁగుదు గట్టిగాను
మృత్యురూపంబున మితి లేక చంపుదు జముఁడ నై ప్రాణుల సంహరింతు
తే. నన్ను నట్టింటఁ బూజింపకున్నవారి, భాస్కరాచార్యవర్యులఁ బ్రతిదినంబుఁ
గొలువకున్నట్టిసెట్టులకుల మణంతు, ననుచుఁ బోకలకుండఁ జట్టనుచు బాలఁ
బగులవ్రేయుచు మిగుల నార్భటముతోడ, నగ్ని జూచుచు మఱియు నిట్లనుచుఁ బలికె.

సీ. మొదలిరాజుల నెల్ల ముయ్యేడుమాఱులు తెగఁజూచురేణుకాదేవిరీతిఁ
బ్రతిభటపర్వతపక్షంబు లగలించు తగునింద్రుశతకోటిధారఁ బోలి
తఱిలేని జీవులఁ దరియంగ నాలుక కసివోవఁ దినుభద్రకాళిరీతిఁ
బటుతరబ్రహ్మాండభాండంబు లవియంగ మోదెడుశితికంఠుమూర్తి వగిది
తే. మనుజపతిచేత జాజ్వల్యమాన మగుచు, నొదవు సాత్ర్యభవవహ్ని కాహుతిగఁ జేతుఁ
గులము వైశ్యులు నను భక్తిఁ గొలుతున్న, భాస్కరాచార్యశిక్షచేఁ బ్రబలకున్న.

సీ. అఱచేతిమాణిక్య మై కోర్కె లీడేర్తు సిద్ధాంజనంబ నై సిరు లొనర్తు
మ్రానఁ గట్టినకామధేను వై ఫలియింతుఁ బెన్నిధానంబ నై ప్రియము సేతుఁ
గొంగుపసిండి నై చెంగలింపఁగఁ జేతుఁ బెరటికల్పకము నై కరుణ మనుతు
నికటహేమాద్రి నై నిలిచియక్కఱఁ దీర్తుఁ బహుపుత్రపౌత్రులఁ బ్రబలఁ జూతు
తే. సంతతంబును భాస్కరాచార్యులకును, వందనోదారవినయసద్వర్తనలను
హిత మొనర్చినవైశ్యుల కెల్ల ననుచుఁ, గరుణ దీపించి వాసవకన్య మఱియు. 159

ఉ. వేదపురాణయుక్తమయి విశ్రుతమైనవణిక్పురాణసం
వాదము విప్రవర్గము లవశ్యముఁ జెప్పఁగ వింట మేలు మ
ర్యాద లెఱుంగలేక కుటిలాత్ములు గర్వమదాంధయుక్తి శూ
ద్రాదులచెంత విన్నఁ గులహాని యగు న్వసుధాస్థలంబునన్. 169

[illegible]. విష్ణువర్ధనరాజుతో విగ్రహించి, చెలఁగి యగ్నిప్రవేశంబు చేసినట్టి
నూటయెనుబండ్రచరితంబు నూత్నభంగి, విన్నవారికి వంశాభివృద్ధి యగును. 170

వ. అని పలికి బ్రహ్మదేవు నుద్దేశించి యిట్లనియె. 171

క. మాకులమునందుఁ జక్కని, యీకన్నియపుట్టుకతన నిటు గావలసెన్
లోకేశ యింతనుండియుఁ, జేకొని యిటువంటిసతుల సృజియింపకుమీ. 172

క. ఘనమగుమత్కులమునఁ జక్కనికన్నియ వలదు గుణము గలకాంతలు గా
జనియింపఁజేయు మీశ్వర, యని ప్రార్థనచేసె వాసవాంగన కడఁకన్. 173

వ. అని పలికి యాసింహాసనంబు నుండి దిగ్గనలేచి యచ్చోటువదలి సాంద్రతరంబైన మృగేంద్రనాదంబులు చెలంగ వికటాట్టహాసంబు చేసి ప్రస్ఫురితభుజాస్ఫాలనంబుచేసి సారెసారెకు విచ్చలవిడిగా మత్సరంబులు పిచ్చలింప నవ్వాసవాంగన వీరరసం బుప్పతిల్ల హుంకరించి వికవికనవ్వి కేకలువేసి పుట్టింటికిఁ బోయినతెఱంగునఁ గదలి యతిరయంబునఁ జని బహువిధాలంకారంబులైన తమగమకంబుల నెక్కి యార్చి వీరవ్రతులైనసపత్నీకు లగువైశ్యవరులును జండబలప్రచండబలులును దమతమగమకంబు లెక్కి వీరవ్రతులై సాహసోల్లాసవీరావేశంబులఁ బ్రకాశితసంరంభవిజృంభమాణు లగుచున్నసమయంబున. 174

మ. కులభూభృన్నిచయంబు వెల్లగిలె దిక్కుంభీంద్రము ల్బెగ్గిలెం
గలఁగె న్సప్తసముద్రము ల్బెదరె నక్షత్రేశుఁడున్ భీతిచే
నిలపైఁ జుక్కలు రాలెఁ బక్షినివహం బేపార మ్రోసె న్వడిం
గలయం ధాత్రి వడంకె దేవగణము ల్గంపించె నయ్యుగ్రతన్. 175

వ. అంత విఘ్నేశ్వరనందినాథనందిమహాకాళవీరభద్రవిజయరుద్రఘంటాకర్ణదారుకర్ణప్రముఖప్రమథగణంబులును బరమభాగవతులును సేవింప లక్ష్మీసమేతుండై శ్రీమన్నారాయణుండును నవబ్రహ్మదిక్పాలరుద్రాదిత్య నవగ్రహవసుమునిగణంబులును ద్రయస్త్రింశత్కోటిదేవతలును యక్షరక్షఃపక్షిగరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధవిద్యాధరసాధ్యాది సమస్తఖేచరులును నుతింప బ్రహ్మయును రంభోర్వశీమేనకాతిలోత్తమాదిదివ్యసురకామినీనికాయంబులు విమానంబుల నుండి నాట్యంబులు సలుప నారదతుంబురులు వీణెలు ధరియించి గుండక్రియ రామక్రియ మొదలైన ముప్పదినాలుగురాగభేదంబుల గానంబులు సేయఁ బార్వతీసమేతుండును నందివా

హనారూఢుండును నాగపాశాంకుశడమరుఖడ్గవరదాభయకురంగాదిలాంఛనంబులు ధరియించి వచ్చి భక్తవత్సలుండును ద్రినేత్రుండును జగదాధారుండును సమస్తదేవర్షి బ్రహ్మహరిరాబగణసేవితుండును ననేకకోటిసూర్యజ్వాలాజ్వలత్ప్రభాభరిత దిగంతరవ్యోమభూభాగుండును నై సదాశివుండు గగనమార్గంబున నిలిచి ప్రకాశించుచుండె నయ్యవసరంబున. 176

క. ద్వితయోత్తరశతసంజ్ఞిత, వితతమహాకుండచండవిభ్రమరేఖా
తతబహుళదహనదహన, స్మితకహకహరవము లెసఁగ మింటం బొలిచెన్. 177

లయగ్రాహి. మండెఁ బెనుమిణుఁగుఱులు ఖండములఁ దుండముల
నొండొరులఁ జెలఁగి శశిమండలము స్రుక్కన్
బొండుసుతదగ్ధపటుకాండపవనోగ్రశిఖి
మండలమహానియతకుండకనకోద్య
త్కుండ దివిషజ్జ్వలనమండితసమగ్రభయ,
దాండజకఠోరజలజాండరుచిదివ్య
చ్చండిమఘనానలమునిండి దశదిక్కులనఖండ
గతిఁ బొంగివడి మెండుకొనియుండెన్. 178

క. ఆకాలప్రళయోజ్జ్వల, భీకరకఠినాగ్నిఁ జూచి బెదరక కడఁకన్
జేకొని ధీరత తమగం, బాకంపింపంగ వాసవాంగన యంతన్. 179

వ. అనేకవిధంబు లగునిజకుండంబులమీఁద వీరపత్నిసహితుల నిజవైశ్యకులంబులవారి నెల్ల నవలోకించి చండబలప్రచండులు మనతోడ గుండంబులఁ బ్రవేశించిరి,మఱియు వారలసంతతిజనంబుల కెల్లకాలంబును మీరలు వర్తనచేసి రక్షింపుఁ డని యానతిచ్చి యనంతరంబ. 180

చ. ఫెడఫెడనార్చి కుండములఁ జేర్చినమంటలు మింట నంటఁగా
వడిఁ దగ హేమపుష్పమణివర్షము లద్భుతభంగిఁ జాలుగాఁ
గడువడి దివ్యతూర్యములు గ్రక్కున మ్రోయ మహానలంబులోఁ
దడయక ధీర లై యుఱికెఁ దత్పరభంగి సురల్ నుతింపఁగన్. 181

శా. హాహాకారము లుల్లసిల్లఁగ మహాహంకారనిశ్శంకు లై
బాహాటోపత నూటయిర్వురు వడిన్ భార్యాసమాయుక్తు లై
స్వాహా యంచు నమశ్శివాయ యనుచు న్వ్యాతాగ్నిలోఁ ద్రెళ్లిన
న్నోహో ధ్వానము లుల్లసిల్లె దివిషద్వ్యూహంబు లుప్పొంగఁగాన్. 182

వ. ఆసమయంబున. 183

చ. అనలము చల్ల నై జలములాశతకుండముల న్సమగ్ర మై
ఘనకమలాకరాకృతులు గైకొని యుండినఁ జూచి వైశ్యులు

స్వనితలుఁ జిత్రభంగి తడివస్త్రము లొయ్యనఁ గట్టుకొంచుఁ జ
య్యన జలకేళి సల్పిరి మహోవరసంభ్రమ లీల లుబ్బఁగాన్. 184

వ. ఇవ్విధంబున నగ్నికుండంబులన్నియు నతిశీతలకమలాకరంబులకై వడి చెలువు మిగిలి యున్నతటి నమ్మహాజలంబులమీఁద సమీరజనితతరంగంబు లొయ్యనొయ్యనఁ బట్టి యీఁదువారై సమస్తజనంబులు వెఱఁగందిచూడ నవ్వైశ్యులు పత్నీసమేతులై గుండంబులు వెలువడి వచ్చి వైశ్వానరునకుఁ జేక్కావందనంబులు చేసి యిట్లని వినుతించిరి. 185

కైవారగద్యము. జయజయ హవ్యవాహన ॥జగత్త్రయసంసేవ్యమానచరణసరసీరుహ త్రిభయశోభిత సప్తహస్త చతుశ్శృంగసంగతప్రభావిజృంభణమస్తకద్వయవిరాజమాన నమో వైశ్వానర తుభ్యం నమో దేవదేవ నమస్తే నమస్తే నమః. 186

వ. అని యనేకవిధంబుల నుతియించుచుఁ బునఃపునః ప్రణామంబులు సేయుచుఁ గరకమలంబులు మొగిచి యార్చి పేర్చిన నయ్యగ్నిదేవుం డశరీరవాణిగ నిట్లనియె.

ఉ. మీ రతిపుణ్యవారిధులు మిమ్ము నకారణ మే హరింపఁగా
నేరక యున్నవాఁడ రజనీకరశేఖరభక్తి యుక్తులై
చేరి శివాపవర్గసుఖసిద్ధి రహించితిరేని నానిజా
కారముఁ జూడుఁ డంచు లయకాలదవాకృతి నిండి మండినన్. 188

వ. సంతసిల్లి వైశ్యు లవ్వైశ్వానరుం గనుంగొని యిట్లనిరి. 189

క. భువనంబుల నీ తేజము, నవిరళమహిమం జనించు ననవరతంబున్
దివిజమునిలోకపూజిత, పవమానసఖుండ మమ్ముఁ బాలింపు దయన్. 190

వ. అని నుతించి యుప్పొంగుచు. 191

చ. తడిసినచీర లూడ్చి నెఱిదారనిచీరలు గట్టి పుష్పము
ల్దుడిచి నవాంగరాగరసముఖ్యసుగంధశరీరులై కడు
న్వడిఁ దమగంబు లెక్కి తెగి వాసవకన్యయు నూటయిర్వురుం
దడయక తత్సతీమణులుఁ దత్పరమానసులై మహోగ్రతన్. 192

క. శివశివశివయని పలుకుచు, బ్రవిమలసద్భక్తి నిలిచి పావకతతిలోఁ
గువలయము వణఁక నుఱికిరి, దివిజులు వెఱఁగంది పొగడ దిక్కులు నెదరన్. 193

వ. తత్సమయంబున. 194

మ. కురిసెన్ దైవతపుష్పవర్షము మహాఘోషంబుతో మ్రోసె నం
బరవీథి న్సురదుందుభిధ్వను లొగిన్ ధర్గుండు కన్యామణి
న్వరవైశ్యాన్వయనాథుల న్సలలనావైశ్యేంద్రసద్భృత్యుల
న్వరుసం దోడ్కొని తద్విమానవిసరావాసాభ్యులం జేయఁగన్. 195

శా. కైలాసంబున కేగి వైశ్యజనముల్ కైవల్యపాదంబునన్
ఫాలాక్షుం దగఁ గొల్చి నిల్చిరి సుఖభ్రాజిష్ణులై లీలతో
శ్రీ లింపారఁగ వాసవాంగన జయశ్రీరుద్రశక్తీశ్వరి
స్లీలాలాలితభంగిఁ గూడి వెలసె న్నిత్యప్రభావోన్నతిన్. 196

వ. అట్లువ్వారవనియు వైశ్యజనంబులు గుండంబులం బ్రవేశించినయనంతరంబ విష్ణువర్ధనుండు వివాహకౌతూహలస్వాంతుండై తద్విరహతాపంబునఁ బొక్కుచు నిద్రలేక యెట్టకేలకుఁ గనుమొగుడ్చునెడ నత్యంతదీర్ఘకరాళదంష్ట్రాభీకర యైనమృత్యుదేవతం గని భయంపడి వెఱఁగంది లేచి ముందఱ సూక్ష్మక్రిమిభావంబుగా నుండుటం జూచి తనదుస్వప్నంబు మంత్రుల కెఱింగించి నిద్రలేక సత్కథావినోదంబులం బ్రొద్దుపుచ్చుచున్నంత నిక్కడ వేగుటయు. 196

గీ. అంధకారంబుచేతఁ జీకాకువడిన, ప్రజల కెల్లను సంతోషభరితముగను
భాస్కరునిదూత వచ్చె నేర్పడ ననంగ, నరుణుఁడుదయించెఁ బ్రాగ్దిశాభ్యంతరమున.

వ. అనంతరంబ. 199

చ. తరుణవణిగ్జనంబులు పదంపడి దుఃఖితమోబిలంబులోఁ
బరువడిఁ బ్రుంగుఁడై భ్రమసి పొల్పడ శోకముమాన్ప దక్షుఁడై
కరుణ దలిర్ప వచ్చుసఖుకైవడి రాగము గప్ప దిక్కులం
గరముగ నిండిపర్వఁగ వికర్తనుఁ డుద్భవమయ్యెఁ దూర్పునన్. 200

ఉ. అంతట విష్ణువర్ధననృపాగ్రణిభృత్యులు వీతనిద్రులై
కాంతలగేహము ల్వెదలి గ్రక్కునఁ దత్పురిసర్వసంధుల
త్యంతనిశాంతచోరనికరాశ్వకరీంద్రవిరోధఘోష మై
వింత లెదిర్చినం బెదరి విస్మయమందుచు విహ్వలాత్ములై. 201

క. వడిఁ జనుదెంచి పురంబున, కడరంగా విష్ణువర్ధనాధిపునెదుటం
గడగడవణఁకుచు భయమునఁ, జిడిముడిపడి విన్నపంబుచేసిరి యార్తిన్. 202

గీ. అవనినాథ పెండ్లి కాయత్తపడువార, పోలె వైశ్యవరులు పురములోనఁ
గదలి పుష్యరాత్రి కాంతాసమేతులై, కన్యతోడ నగ్నిఁ గాలి రనిన. 203

చ. స్ఫుటకఠినోగ్రవార్త చెవి సోఁకినయంతన ఘోరభంగిగాఁ
బటపటఁబొసి మస్తకము భంజితమై కడుఁ బెక్కువ్రయ్యలై
పటుగతి నుగ్గులై పడఁగఁ బల్మఱుఁ గన్యకశాపఘూతిచేఁ
గుటిలుఁడు విష్ణువర్ధనుఁడు గూలె ధరిత్రి విచిత్రరూపతన్. 204

వ. ఇట్లు శిరంబు పగిలి భూమిం గూలినఁ దత్క్షణంబ. 205

క. ఉర్వీపతి యపుడు గం, ధర్వనిరూపంబు దాల్చి తద్దయు వేడ్క
న్సర్వజనంబులుఁ జూడఁగ, గర్వంబున దివికి నేగెఁ గౌతుక మొదవన్. 206

వ. అంతఁ బెనుగొండపురంబునం దవశిష్టవైశ్యశ్రేష్ఠులు బాలనగరంబులఁ బుణ్యాంగనలు బాలికలు నానాజనంబులు శోకాతురులై యనేకవిధంబుల విలపించుచున్నం జూచి భాస్కరాచార్యుండు దుఃఖోపశమనంబులగు వాక్యంబుల నిట్లనియె.

చ. జ్వలనముఖంబున న్నిలిచి వైశ్యులు చేసినసాహసక్రియం
జలరుహసంభవాదులకు శక్యముగానిపదంబు గల్గె మీ
కులము పవిత్రమై వెలసెఁ గుంభినియందును గీర్తి నిల్చె మ
ర్త్యులకును గర్మబంధములు త్రోవఁగ రా దెటువంటివారికిన్. 208

చ. మనముల శోకదైన్యములు మానుఁడు బంధుకళత్రమిత్రనం
దనులను భక్తితోఁ బ్రతిదినంబును రక్షణమాచరింపుఁ డిం
కను భవదీయమాతృజనకప్రియకార్యము లౌర్ధ్వదైహికా
దినిజకులోచితక్రియలు ధీరతఁ జేయుఁడు చింత లేటికిన్. 209

వ. అనుచు బహువిధంబుల బాలనగరంబుల ననునయించిన వారలు దుఃఖంబులు మాని నిజగృహంబులకుఁ జనిరి. తదనంతరంబ వారలచేత భాస్కరాచార్యులు విధ్యుక్తప్రకారంబుల నుత్తరక్రియలు సేయించి శోకం బుడిపి కాశీగయాప్రయాగలకుఁ దోడ్కొని చని యచట స్నానంబులు సేయించి మఱియు భూమింగలయుత్తమతీర్థక్షేత్రంబులకుం గొని చని యచ్చటచ్చట వారలచేత స్నానదానాదికృత్యంబు లాచరింపంజేసి పెనుగొండపురంబునకుఁ దోడ్కొని వచ్చి కన్యాశక్తిని బ్రతిష్ఠ సేయించి యనంతరంబ తమపితృనామాంకితంబు లగు శివాలయంబులు నిర్మింప నాజ్ఞాపించి తటాకంబులు కల్పితంబులుచేయించి వనంబులఁ గల్పించి యఖండంబులైనదీపంబులు పెట్టించి సప్తసంతానంబులు గావించి తత్పుణ్యవిశేషంబున శ్రీనగరేశ్వరజనార్దనవాసవకన్యకాకృపావిశేషంబులఁ దమయాశీర్వచనంబులను బుత్రపౌత్రాభివృద్ధి యగునట్లు దీవించి తదనంతరంబ తత్ప్రకారంబున సుఖులై మీవారందఱు నూటయిబ్బండ్రు నగరస్వాములు తమతమపితృమాతృప్రీతికరంబు లగుపనులు నడపించుచు బహువిధంబు లగు ద్రవ్యంబులు విప్రకవిగాయక దీనజనులకు నొసంగుచు సకలవ్రతంబు లాచరించుచు సంతతివిరహితం బగునొక్కగోత్రంబు దక్కఁ దక్కిననూటొక్కగోత్రంబులవారలు సుఖంబుండి రని సాలంకాయనముని యానతిచ్చిన విని యమ్మహాత్మునకు దండప్రణామంబు లాచరించి వైశ్యర్షులు నిజాశ్రమంబులకుం బోయి రని చెప్పి శిష్యసమేతుండై నైమిశారణ్యంబునకుం జనియె నీపుణ్యకథ వినినవైశ్యులకు నుత్తరోత్తరాభివృద్ధి యగు నిది వినుటకుఁ గ్రమవిధానంబు వివరించెద నెట్లనిన. పురాణప్రారంభకాలంబున శక్త్యనుసరణరంబుగా బ్రాహ్మణభోజనంబు చేయించి పురాణజ్ఞునకు నొక్క

యుచితాసనం బిచ్చి కూర్చుండ నియోగించి వైశ్యజను లందఱును వచ్చి వందనం బాచరించి భక్తివిశ్వాసయుక్తులై శ్రద్ధచే వినుటకుఁ గూర్చుండవలయుఁ బురాణపుస్తకంబునకు మొదట రెండఖండంబులు కల్పించి ధూపదీపనైవేద్యంబుల నర్చించి పురాణం బుపక్రమింపవలయుఁ బురాణశ్రవణానంతరంబునఁ బునర్ధూపదీపనైవేద్యతాంబూలాదులఁ బూజించి పుస్తకంబు గట్టవలయు నిదిక్రమం బీక్రమంబునఁ జదువక వినక దుర్మదంబున విధిరహితంబుగా నాచరించినజనంబులు బురాణశ్రవణఫలంబు లభింపక పాపాత్ములగుదురు. ఇవియునుం గాక శాంతిచేయుస్థలంబులు వినుండు. పార్వతీపరమేశ్వరవివాహఘట్టంబునను వైశ్యులు పురప్రవేశంబుచేయు సమయంబునను వాసవాంగనాజననంబునను గోత్రసంకేతలిఖితకాలంబునను శాంతిచేయవలయును. దంపతీపూజలుచేయవలయుఁ గుండప్రవేశఘట్టంబునఁ జేయవలసినశాంతి వినుండు. వైశ్యులెందఱుఁ గలరో యందఱు గృహమర్యాదప్రకారంబున వాయనదానంబును దంపతిపూజయు గోదానంబులును బ్రాహ్మణభోజనంబులును విశేషించి చేయవలయుఁ బురాణశ్రవణానంతరంబున యథాశక్తి బ్రాహ్మణభోజనంబును బురాణజ్ఞునకు దివ్యవస్త్రమాల్యాదులచేఁ బూజించి యథాశక్తి సువర్ణపుష్పంబు లొసంగి ఫలమంత్రాక్షతలు గైకొని పురాణంబు శాంతిపూరింపవలయు నీక్రమంబున నడపవలయు నిదిపురాణశ్రవణక్రమంబు దీనిచే వైశ్యులకు సకలసంపత్సమృద్ధియుఁ బుత్రపౌత్రాభివృద్ధియును గంగాదిసమస్తనదీస్నానపుణ్యంబును గలిగి వాసవాంబికాకటాక్షంబున సుఖంబుందురనిన విని సంతసిల్లి బాలసగరంబులు తత్క్రమంబు నిలిపి రని చెప్పి. 210

ఉ. కేకయమాళవద్రవిళకేరళగూర్జరముఖ్యపట్టన
ప్రాకటకీర్తివర్తనులు బంధుజనావనపాకశాసనా
నోకహము ల్మహామతు లనూనకృపాకరు లిందుశేఖర
శ్రీకరవిష్ణుపాదసరసీరుహభృంగము లూరుసంభవుల్. 211

మాలిని.—
కలశజలధికన్యాకాంతపాదాబ్జలిప్తో
స్థలయజఘనవంశోన్మగ్నఫాలస్థరేఖా
విలసితఘనచిహ్నవిష్కృతుల్నిష్కళంకో
జ్జ్వలవరమతిమంతుల్ శాంతు లీవైశ్యు లుర్విన్. 212

హంసపదవృత్తము.—
వందనాగతామరేంద్రబృందచారువర్ణనా
నందపూర్ణమానసాబ్జనవ్యభవ్యవిక్రమా
కుందచంద్రికాప్రకాశకోమలాంగశోభితా
నందివాహనాధిరూఢనాగభూషణోజ్జ్వలా. 213

వనమయూరవిరాజితము.——

పంకజలోచనపద్మజశక్రశుభప్రదనూతనపద్మపదా
శంకరశర్వలసద్ఘనచంద్రశశాంకవృషధ్వజచారునటా
కింకరరక్షణకేళికళాకలకేళివిలాససుకీర్తిధరా
న్యంకుధరామరనారదముఖ్యవినాయకవందితదివ్యపదా. 214

గద్యము. ఇది శ్రీసరస్వతీవిలాసచరణసరసీరుహానిష్యందమకరందబిందుసందోహమాధురీమధుకరాయమానమానససరసకవితావిలాసబొల్లనార్యతనూజవర్య శ్రీగురుభాస్కరాచార్యప్రణీతం బైనవైశ్యపురాణం బనుపేర బిలసిల్లుకన్యకాచరిత్రంబునందు వైశ్యులు రాజుచేసినకాపట్యంబు వినుటయు వచ్చినరాజదూతలకు నివాసంబులు గల్పించి వారాంగనాలోలు తౌనట్టుగాఁ జేయుటయు హోమకుండప్రవేశంబుచేయుటకు నిశ్చయించి గ్రామంబునఁ జాటఁ బంచుటయుఁ దద్వార్త విని యార్యాటపన్నిద్దఱు పలాయితు లగుటయుఁ దక్కిననన్నూట యిబ్బంద్రు వీరకంకణతాంబూలంబు లందుటయు నిజగోత్రలిఖితంబులును భాస్కరాచార్యదానపత్రక్రమంబును బాలనగరంబులకు వైశ్యులు కులధర్మంబులు సూచించుటయు వాసవకన్యకాసమాధానంబును బురశృంగారంబును వీరసనంతంబు లాడుటయును గుండప్రవేశంబును విష్ణువర్ధనుమరణంబును బురాణశ్రవణశ్రమసంవిధానంబును బాలనగరంబులు సుఖం బుండుటయు ననుకథలం గల యష్టమాశ్వాసము సర్వంబును సంపూర్ణము.

వైశ్యపురాణము సంపూర్ణము.

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీమదాంధ్రభారతము - పద్యకావ్యము:— | | | |
| 7 సంపుటముల ప్రతి | ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి | ... | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము | ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ,, | ... | 2 | 0 |
| శాంతిపర్వము ,, | ... | 2 | 0 |
| ఆనుశాసనిక, ఆశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము ,, | ... | 3 | 12 |
| శాంతిసప్తకము ,, | ... | 3 | 12 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు | ... | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక, పిండిప్రోలు, లక్ష్మణకవికృతము | | 1 | 8 |
| నిర్వచనోత్తరరామాయణము, మేలుప్రతి | ... | 1 | 0 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము | | 2 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు | ... | 3 | 0 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | ... | 7 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కఁగ ముద్రితము | | 0 | 10 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| అచ్చతెనుఁగురామాయణము శుద్ధప్రతి | ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతుల కన్న అన్నివిధముల బాగుగనున్నది. | ... | 5 | 8 |
| డిటో మేలుప్రతి, రెండువాల్యములు | ... | 7 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి, మూడువాల్యములు | ... | 9 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్న సైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నాము. ... | 2 | 0 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీ చినసీతారామస్వామిశాస్త్రికృతము. అత్యద్భుతము లగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు ... | 4 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు ... | 0 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరి కాకితములు ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... | 2 | 0 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవి ... | 0 | 8 |
| రంగరాయచరిత్రము, దిట్టకవి, నారాయణకవిప్రణీతము ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు రామభద్రకవికృతము ... | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమకవికృతము ... | 0 | 4 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము ... | 0 | 12 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము ... | 1 | 2 |
| బసవపురాణము, పిడుపర్తి సోమనాథప్రణీతము ... | 2 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |
| డిటో వేంకటనాథరాజకవికృతము ... | 1 | 4 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్న సైజున ముద్రించినారము, సటీక, వివరణము మిక్కిలి విపులము. ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది. సాధారణప్రతి | 2 | 0 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు ... | 3 | 8 |
| జైమినిభారతము అశ్వమేధపర్వము, చక్కనికూర్పు ... | 1 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ... | 1 | 8 |
| హరివంశము, ఎఱ్ఱాప్రెగ్గడ, క్రొత్తకూర్పు ... | 3 | 0 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.